# శ్రీ దుర్గామల్లేశ్వర స్వామివార్ల దేవస్థానం

## సేవా కార్యక్రమములు

**నిత్య పూజలు - రుసుములు :**

| | | రూ. |
|---|---|---|
| 1. | సహస్ర నామార్చన | 15-00 |
| 2. | అష్టోత్తర నామార్చన | 10-00 |
| 3. | శ్రీ మల్లేశ్వర స్వామివారి రుద్రాభిషేకం | 15-00 |
| 4. | సంవత్సరమునకు 52 శుక్రవారములు సహస్ర నామార్చన | 780-00 |
| 5. | సంవత్సరమునకు 52 శుక్రవారములు అష్టోత్తరం | 520-00 |
| 6. | శ్రీ మల్లేశ్వర స్వామివారి రుద్రాభిషేకం 52 సోమవారములు | 520-00 |
| 7. | చండీ హోమము (ప్రతి పౌర్ణమి రోజున) | 116-00 |

**శాశ్వత పూజలు - రుసుములు**

| | | |
|---|---|---|
| 1. | శాశ్వత సహస్ర నామార్చన 52 శుక్రవారములు | 7.800-00 |
| 2. | శాశ్వత అష్టోత్తరం 52 శుక్రవారములు | 5,200-00 |
| 3. | శాశ్వత సహస్ర నామార్చన సంవత్సరంలో ఒకరోజు | 150-00 |
| 4. | శాశ్వత అష్టోత్తరం సంవత్సరంలో ఒకరోజు | 100-00 |
| 5. | పల్లకి సేవ | 1,116-00 |
| 6. | శాశ్వత శాంతి కళ్యాణం | 5,000-00 |
| 7. | శాశ్వత లక్ష కుంకుమార్చన | 4,500-00 |
| 8. | శాశ్వత అన్నదానం సంవత్సరమునకు ఒకరోజు | 1,116-00 నుండి |
| | (10 నుండి 50 మందికి ఉచిత అన్నదానం) | 5,116-00 వరకు |

**శ్రీ జి.వి. నరసింహమూర్తి B.Sc., B.L.**
కార్యనిర్వహణాధికారి

ఈ పూజలు చేయు ఉద్దేశ్యమున్న భక్తులు పైకమును పై అడ్రసుకు డి.డి. ద్వారా గాని, ఎమ్.ఓ. ద్వారా గాని పంపవచ్చును.

Why Fear When I am here?
Put All your Faith in me
I shall Guide and Guard you

# శ్రీ మదాంధ్ర నాయక శతకము

## శ్రీ కాసుల పురుషోత్తమ కవి

శ్రీ విఘ్నేశ్వరాయ నమః

టీకా తాత్పర్య విశేష రచన :

### శ్రీ శనగన నరసింహస్వామి


విశ్రాంత ఆంధ్రశాఖాధ్యక్షులు

ఆంధ్ర లయోలా కళాశాల

విజయవాడ - 520 008



ప్రచురణ :

శ్రీ సత్యసాయి పబ్లిషర్స్

డోర్ నెం.29-13-30

కాళేశ్వరరావు రోడ్డు, సూర్యారావుపేట

విజయవాడ - 2, ఫోన్ : 437045 పి.పి.

**శ్రీ మహాంధ్ర నాయక శతకము**

**కాసుల పురుషోత్తమ కవి**


ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1996

ప్రతులు : **2000**

సంపాదకులు : **వడాలి అంజంరాజు**

హక్కులు : గ్రంథకర్తవి

ధాత్రు నామ - శ్రావణ

ముఖచిత్రం : శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు

వెల : 60/-

ప్రతులకు :

1. **వి.అంజంరాజు,** ఎడిటర్, ఆంధ్రబాల
   డోర్ నెం.29-13-30, కాళేశ్వరరావురోడ్డు,
   సూర్యారావుపేట, విజయవాడ-2

2. **శ్రీమతి మొవ్వ పద్మాలయదేవి**
   W/o. మొవ్వ వృషాద్రిపతి
   శ్రీ వెంకటేశ్వరాలయం వెనుక
   ఉప్పూడిరోడ్డు, గుంటూరు జిల్లా

3. **బల్లం సూర్యనారాయణరాజు**
   (తెలుగు పండిట్)
   జడ్.పి.హైస్కూలు
   లంకలకోడేరు (పోస్ట్)
   (వయా) పాలకొల్లు, ప॥ గో॥ జిల్లా.





చిత్రకారులు : ఎ.వి.బాబు

ముద్రణ : అరుణా గ్రాఫిక్స్, నెల్లూరు.

# సమర్పణ

1 శేషాహినా యుక్తశైలే సంభావించు
వసుచరిత్రంబును వ్రాసెనెవడు-
జోడించి కాశ్యపెవ్వాడు భాష్యాకృతిన్
సంహరిత్రాంత ఘనార్థ కథలు
నరసింహుడను భూమివరుపేర నెవడు రా
వ్యాలంకృతి యాసంగ్రహము ఘటించె-
ఘటికాశతగ్రంథకల్పయుండైనై
దినకావ్యనిర్మాణ పటువెవండు-

ఎవని - సంగీత విద్యాసాహిత్యనిధి, స
పినవీణావిధాత, వధానకుడు
నాద్యు, కారణజని, ప్రబంధాంకవంశ
కలశజలరాశి శశిమూర్తి కవి నమింతు.

2 ఆ ప్రబంధాంకవంశమే అంతభువిని
ప్రబలె రత్నాకరాన్వయు ప్రథ వహించి
అందుప్రభవించిరెందఱో కుందచంద్ర
చందన తుషారసిత యశస్సాంద్రధనులు.

3 ఆ రత్నాకర రాజవంశమున మద్భాగ్యాకారతన్ తోచెవ
హో! రత్నాకరమందు నిందుమ దయుంబైనట్లు సాయీశ్వరుం
డారోహించెను పుట్టపర్తి పురమందధ్యాత్మ పీఠంబు శ్రీ
కారుణ్యామృతమూర్తి విశ్వజగతీ కల్యాణ కాంక్షామతిన్

4 సాగరంబులు దాటె చసుదెంచి విజ్ఞులు
చరణాబ్జసన్నిధి సంవసించ-
స్వయముగా సడపించు సకల సంస్థలు సాటి
బహుళ సంస్థల కొజ్జబంతికాగ-
వారువీరనకనెవ్వారు సేవాధర్మ
మానందమున తామె యందు కొనగ-
అనమానమైన ధర్మానుపత్తిని గాంచి
సిరిమీఱు దేశాలు సిగ్గుపడగ-

ఉభయ సంధ్యల యందు నేత్రోత్సవముగ
భక్తకోటికి దర్శన భాగ్యమొసగు
చెబ్బదేముల పదుచు వాడిబ్బడిగను
ఇచ్చు అభయంబు మాకు సాయీశ్వరుండు.

శనగన నరసింహ స్వామి

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

భగవద్గీతలో భగవానుని వాక్యమిది. ఎప్పుడెప్పుడధర్మము విజృంభించి ధర్మమునకు గ్లాని యేర్పడుచున్నదో, అప్పుడు నన్ను నేనే సృష్టించుకొనుచున్నాను. దశావతారములు జగత్ప్రసిద్ధములైనను భాగవతము ఏకవింశత్యవతారములు పేర్కొనినది. కాని "అనంతావై అవతారాః" అని శ్రుతి.

ఈ అవతారములలో కొన్ని అంశావతారములు. కొన్ని ఉగ్రావతారములు. కొన్ని పూర్ణావతారములు. మరికొన్ని పరిపూర్ణావతారములని తత్వవేత్తలు నిర్ధారించుచున్నారు. "దైవం మానుష రూపేణ" అనికూడా శాస్త్ర వాక్యము. రామచంద్రస్వామి రావణ సంహారానంతరము కూడ, తనను విష్ణ్వంశసంభూతునిగా అభివర్ణించుచున్న బ్రహ్మదేవునితో "ఆత్మానం మానుషం మన్యే - రామం దశరథాత్మజమ్" నన్ను దశరథుని కుమారునిగా, మానవునిగా భావించుకొనుచున్నానని తెలిపెను.

ఈ కలియుగమున షిరిడీసాయి, దత్తావతారముగా ప్రజలచే కీర్తింపబడుచున్నాడు. ఆయన సర్వమత సమానత్వం - సర్వదైవైకత్వము ప్రబోధించి, భక్తులనుద్ధరించి, మరల తాను ఆంధ్రదేశమున, పుట్టపర్తి గ్రామమున "సత్యసాయి"గా అవతరింతునని తెలుపుకొనెను.

ఆ స్వామి యవతారమే నేడు అనంత ప్రపంచ మానవులు సత్యసాయీశ్వరుండని ఆరాధించుచున్నది. పాశ్చాత్యులలో హేతువాద స్ఫూర్తి ఎక్కువ. పైగా కొన్ని విషయము లందు భారతీయులను వారంగీకరింపరు. కాని నేడు అమెరికా-లండన్-ఫ్రాన్స్-ఆస్ట్రేలియా-స్వీడన్ వంటి సుదూర దేశవాసులు 'బాబా' ఆశీస్సులకై పుట్టపర్తికి లక్షల సంఖ్యలో విచ్చేసి, తన్మూర్తి దర్శనమునకును, తదాశీస్సులు పొందుటకును, అనునిత్యము వేచియుండుచున్నారు. 'Thus spake to Baba' అనే గ్రంథమున పాశ్చాత్యులు బాబాను గురించి తమతమ అనుభవములను, అనుభూతులను ఎన్నింటినో [illegible] బాబా విభూతి ప్రసాదముచే శమించినవనియు, బాబాయే స్వయముగా శస్త్రచికిత్సలు నిర్వహించెననియు, ఆపదలోనున్నవేళ భావించినంతనే భక్తులకు కొంగుబంగారమై దర్శనమొసంగి విపత్తులు గోటమీటుచున్నాడనియు నెన్నో యెన్నో పొందుపరచి యున్నారు. ఏ మాహాత్మ్యమునులేని సామాన్యులకడ కింతింత దూరము తలంపక యింతటి వ్యయప్రయాసలకోర్చి ఖండాంతరంబుల నుండి వచ్చి అగర్భ శ్రీమంతులు సైతము దాసానుదాసులుగా, భృత్యానుభృత్యులుగా సేవలొనరించుచు పుట్టపర్తిలో చెట్లనీడ వసింతురా? సుఖముల పరిత్యజింతురా? బాబా దర్శనమునకై పడిగాపులుందురా? తద్వచశ్శ్రవణార్థమై పరితపింతురా?

ఆసేతు హిమాచలమునుసత్యసాయిబాబా అవతార మాహాత్మ్యమును వేనోళ్ళ అగ్గించుచున్నది. భారత రాష్ట్రపతి మొదలు సామాన్యుని వఱకు అబాలగోపాలమాయన పాదములచెంత ప్రణమిల్లుచున్నది. కవులు, పండితులు, గాయకులు తన్మహాత్మ్యమును గానముచేయుచున్నారు. నర్తకులాయన గాథలనాడుచున్నారు. సూరి భగవంతము

వంటి శాస్త్రజ్ఞులాయన భక్తగణములో పరమాణువులైనారు. పుట్టపర్తియే వైకుంఠ ధామముగా, బాబా శ్రీ మహావిష్ణువుగా అనంతలోకము భావించి భక్తిభావ పరవశ మగుచున్నది.

బాబా విద్యాపోషకుడు. ఎన్ని పాఠశాలలు-ఎన్ని కళాశాలలు, వేదపాఠశాలలు, చివరకు విశ్వవిద్యాలయాదులే నిర్మించి, 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యని వేదముచే చెప్పబడిన సత్యజ్ఞానములనందించి యుద్ధరించుచున్నాడు. అన్నార్తులు-రోగార్తులు-పీడితులు-తాడితులునైన ప్రజలకు ఆరోగ్యమందించి, ఆదరించుటకు, సర్వసముత్కృష్ట వైద్యశాలనేర్పాటుగావించి, ఎక్కడను లభింపని అత్యుత్తమ వైద్యసేవలను ప్రజానీకమున కందించుచున్నాడు. ఆ వైద్యసేవలన్నియూ ఉచితములే.

దరిద్రులను నారాయణ స్వరూపులుగా భావించి, అర్చించి, వారికి వివాహాదులు-ఉపనయనాదులు నిర్వహించుచున్నాడు. తిండిలేనివారికి తిండి-గూడులేనివారికి గూడు, వృత్తిలేనివారికి వృత్తి సమకూర్చి జాతినుద్ధరించుచున్నాడు.

వేసవిలో గొంతు తడుపుకొన గ్రుక్కెడు జలములేక అల్లాడుచున్న గ్రామములకు నీటి సదుపాయమును కల్పించి, వారి బాధలను పోకార్చి, ప్రభుత్వములే చేయలేని, మహాకార్యములను సర్వసమర్థుడై యొక్కడే నిర్వహించుచున్నాడు.

ఇవన్నియు ఒక యెత్తు. ఆధ్యాత్మిక జ్ఞానము మానవ జీవన విధానములో సంస్కృతిలో ఒక ప్రధాన భాగము. ఆధ్యాత్మిక శిఖరములకు చేరికొనుటకే జీవుడు పరితపించును. అన్ని కల్గియు, ఆత్మశాంతిలేక అలమటించు ఆర్తులకు, జిజ్ఞాసువులకు, తన బోధనలచేత సంతృప్తిని కలిగించి సేదతీర్చుచున్నాడు. తనను నమ్మినవారికండయై తోడునీడగా, తానే నడిపించుచున్నాడు. అజ్ఞానాంధకార నిమగ్న జీవులకు దివ్యజ్యోతియై మార్గమును చూపించుచున్నాడు. అనంతవిశ్వాంతర్యామియైనను, పుట్టపర్తి ప్రశాంత నిలయములో భక్తులకు దర్శనమొసంగుచున్నాడు.

మహాకవి తల్లజుడు - భక్తియోగ సిద్ధుడైన కానుల పురుషోత్తమ కవి శ్రీకృష్ణుని గురించి,

"భువనత్రయైక సంపూజ్యుండవగు నీకు
నందకుటీరమా మందిరంబు?" అని ప్రశంసించెను. అట్లే బాబా ఆత్మస్వరూపుడైనను, ఇప్పడీయవతారమున భక్తులకు రక్షకుడై, హితుడై-స్నేహితుడై ఆదుకొనుచున్నాడు.

సాయిరాముని చరణరజంబుదాల్చి
ధర వసుంధర నామ సంభరితయయ్యె
సాయి నామామృత మధురసంబు గ్రోలి
అమరగణమమృతతాంధన మైరహించె

**మొవ్వ వృషాద్రిపతి**

ఆంధ్రశాఖాధ్యక్షులు
ప్రభుత్వ మహిళా కళాశాల - గుంటూరు

# సంపాదకీయం



ఎందరో మహానుభావులు అందరికి వందనములు.

భక్తి– జాతిని ఏకంగా అట్టిపెట్టుటకు ఒక మార్గం. వివిధ మతాలతో, వివిధ జాతులతో, వివిధ భాషలతో ఉన్నటువంటిది భారతదేశం. భారతదేశాన్ని ఒకటిగా చేయుటకు గల కారణము భారత – భాగవత రామాయణాలు మొదలగు గ్రంథములు మనకు అందించిన భక్తి భావనే! ఏకత్వంలో భిన్నత్వం — భిన్నత్వంలో ఏకత్వం మనది. దానికి ఉదాహరణ ఆది పరమ శివుడే.

ఆ భక్తి తత్వాన్ని అతివేలంగా ప్రబోధించిన మహాకవి కాసుల పురుషోత్తమకవి. సర్వశాస్త్రార్థ తత్వజ్ఞుడు, తపోధనుడు, ఋషి, బహుముఖ ప్రజ్ఞాశాలి, సర్వకళా ప్రవీణుడు. ఆయన శతకములో వాడిన పదములు లలిత మనోహరములు, మృదు మధురమైనవి, అపురూపమైనవి. భారత, భాగవత ఇతిహాసాది గ్రంథములలో సైతము కానరాని నవ్యమైన, భవ్యమైన, వినూత్న పదములు. ఆయన శైలి అపురూపము, అనన్యము. ఈ మహాకవి వైభవాన్నిగూర్చి తిరుపతి వేంకటకవులు ఆంధ్రనాయక శతకములోని మకుటం, చిత్ర, చిత్ర, ప్రభావ, దాక్షిణ్యాభావ, హతవిమతజీవ, శ్రీకాకుళాంధ్ర దేవ అనే మకుటంతో ఆంధ్రదేశం ఏడు నిలువుల లోతు పునీతమైనదని చెప్పారు. భాగవతాన్ని బమ్మెర పోతరాజు రాయకపోతే ఎవరు రాసేవారని వారి శిష్యులు అడుగగా కాసుల పురుషోత్తమకవి రాసేవాడని చెప్పేవారట. విశ్వనాథ సత్యన్నారాయణగారు ఆంధ్రనాయక శతకములోని పద్యములను కిన్నెర కంఠంతో అనేక సభలలో పాడినారని నానుడి.

వ్యక్తిలో బాధ్యతను నిజాయితీని విధ్యుక్త ధర్మాన్ని సక్రమముగా నెరవేర్చగల శక్తిని, యుక్తిని, ఆధ్యాత్మిక, భక్తిజ్ఞానం ప్రసాదిస్తుందని చాటిచెప్పిన మహనీయుడు. ఈకవి తన అతులిత కవితా మాధురీ

మహిమనంతా ధారపోసి మకుట మాధుర్యాన్ని ప్రతి సాహితీవేత్త, సహృదయ పాఠకులు ఆస్వాదించి చక్కని అనుభూతిని పొందునట్లుగా శతకాన్ని రూపుదిద్దినారు.

శ్రీ కాసుల పురుషోత్తమకవి (ఈయనకు పుల్లమరాజనే నామాంతరం కలదు.) అది కృష్ణాతీరము దివిసీమ, మండలం అందునా క్రీ.శ. 1791వ సంవత్సరము దేవరకోట ప్రభువు రాజా అంకినీడు బహదూర్‌గారి ఆస్థానకవిగా ఉన్నారు. ఆ మహనీయుని కన్న పుణ్యదంపతులు రమణమాంబ, అప్పలరాజులు ధన్యజీవులు. అద్దంకి తిరుమలాచార్యులు ఈతని గురువై తరించారు. కవి భట్టరాజ కులానికి చెందినవారు. ఈయనది కాశ్యపగోత్రం. గ్రామము పెద్దప్రోలు. ఈ కులమువారి స్తోత్రాలతో సరస్వతీదేవి పరికల్పిత సాన్నిధ్యం కలదిగా మహాకవి కాళిదాసు అభివర్ణనం.

కృష్ణదేవరాయల ఆస్థానకవి వసు చరిత్ర కర్త భట్టుమూర్తి ప్రబంధాంకం రామరాజ భూషణుడు, రావతం మానవాకారం శ్రీశ్రీ భగవాన్ సత్యసాయిబాబా, భారద్వాజ గోత్రం, ఆపస్తంభ సూత్రం (రత్నాకరం సత్యన్నారాయణ రాజు) ఈ కవి వంశీయులే.

ఆంధ్ర సారస్వతంలో కొన్నివేల శతకాలు ఉన్నట్లు పరిశోధనలో తేలినది. అట్టివానిలో పురుషోత్తమకవి శతక ద్వయ సౌందర్యము మహోన్నతమైనది. పురుషోత్తమకవి మహా భక్తుడై నాలుగు శతకములు రచించెను.

1. మనసా! హరిపాదములాశ్రయించవే
2. పరాకు భద్రశైల రామ! భక్త కల్ప ద్రుమా!

అను మకుటము గలవి. ఆయన శతక ద్వయము ఆంధ్రనాయక శతకము, హంసలదీవి వేణుగోపాల శతకము. శతకములోని భాష సరళము. భక్తి భావ యుక్తము. పదముల కూర్పు లలిత మనోహరము.

అంతటి మహోన్నతమైన కవిని గూర్చి ఎంతని వ్రాయగలము. ఆయన కవిత ఎంతో వాసిగలది — రాసిగలది. ఎంత వ్రాసినా ఇంకా ఎంతో వ్రాయవలసి ఉన్నట్లుంటుంది. ఎందువలనంటే కవి హృదయం కడలికన్నా మిన్న. సర్వ విజ్ఞానములు ఎరిగిన తపోనిధి, ఆగమ శాస్త్ర విధులందు, కర్మలయందు స్థిరమైన ప్రజ్ఞ కలవాడు. వేదాంత విద్యా పారంగతుడు. ఎంతో సామాజిక స్పృహ కలవాడు. భూత - ప్రేత - పిశాచాదుల రాక్షస పన్నగములను మట్టుపెట్టగల మంత్ర శాస్త్రజ్ఞుడు. మహా తపస్వి. ఆగమవేత్త.

కావ్యజ్ఞత, రసజ్ఞత, తత్వజ్ఞత, శాస్త్రజ్ఞత తెలసినవాడు. ఆగమ శాస్త్రములో ఉద్దండ పండితుడు. 64 రుచులతో నిత్య నైమిత్తిక కార్యక్రమములు చేయుటలో సిద్ధ హస్తుడు. వైఖానస కల్పసూత్రము, పాక యజ్ఞము, సోమ యజ్ఞము తెలసినవాడు.

''క్షీరన్యాయం ఒక్క హంసకే తెలుసు. కానీ'' కాసుల పురుషోత్తమకవి కవితా వైభవం, పండిత, పామర, బడుగు వర్గాలను సైతము అలరించు సుమధురమైన కవిత. ఈయన పద్యాలను ఒక గీత కార్మికుడు తాటిచెట్టు ఎక్కి కల్లుగీస్తూ తన్మయంతో ఆంధ్రనాయక శతకములోని పద్యాన్ని అతి మధురంగా, లయబద్ధంగా, శ్రావ్యంగా పాడుట స్వయంగా కవిగాంచి ఆ గీత కార్మికునకు (అందుకే అన్నారు పెద్దలు రవిగాంచనిది కవిగాంచునని) తనకు రాజుగారు బహూకరించిన రత్నాల హారాన్ని ఆ గీత కార్మికుని కంఠాన అలంకరించి ఆలింగనం చేసుకొని తన్మయంతో ఇప్పుడుగదా నా కవిత సార్ధకత చెందినది అని ఎంతో ఆనందము వెల్లివెరియ సంతోషించినారట.

భాగవత బంధువులందరు ఆంధ్ర మహావిష్ణు గాథల తోరణమైన ఆంధ్రనాయక శతకాన్ని పఠించి మధురానుభూతులను పొంది ఆ విష్ణుదేవుని దయకు, కృపకు, కరుణకు పాత్రులై అనంత కళ్యాణ సౌభాగ్యావహమగు సంపదలను పొందుదు.

మతం ఎప్పుడూ మానవ శ్రేయస్సును సమాజ క్షేమాన్ని కాంక్షిస్తుంది. ఏ మతమూ హింసను ప్రభోదించదు.

అంతటి మహనీయుని కవితకు సంపాదకీయం వ్రాయుట నా తరమా! కేవలం ఆ కవి నన్ను ఆవహించి సాయి కృపతో నాతో వ్రాయించిన మాటలివి. ''నేను అతి సామాన్యుడను అచ్చరం బెరుగని తెలుగువాడను, మీవాడను.''

ఈశతక ముద్రణకు నాకు సహాయ సహకారములందించిన మిత్రులకు, శ్రేయాభిలాషులకు, ముద్రణ కర్తలకు, కవితా వైతాళికులకు నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

సర్వేజనాః సుఖినోభవంతు

ఇట్లు
భవదీయుడు
మీ

వడాలి అంజంరాజు

# ఆగమశాస్త్ర పూజా విధానం



భరతభూమి కర్మభూమి. కర్మభూమికాధార బిందువు ధర్మం. ధర్మకర్మముల రెండింటికి విహరణస్థలములు వేదములు. వేదములు మంత్ర బ్రాహ్మణ సమ్మిశ్రితములు.

నిత్య పూజా విధానములుకాక ప్రతినెల నిర్వహించవలసిన పూజా నైవేద్య కార్యక్రమముల వివరములు.

<u>ద్వాదశమాసార్చనం:</u>

<u>మార్గశీర్షమాసం:</u> గౌళ్యం (ముద్గాన్నం), నివేదన ద్రవ్యములు (నీరు, బియ్యం, పెసరపప్పు, బెల్లం, నెయ్యి, పాలు)

<u>పుష్యమాసం:</u> గోక్షీరం (ఆవుపాలు, నివేదనచేసిన నివేదన ఫలితం సంవత్సరం పొడుగునా వచ్చును)

<u>మాఘమాసార్చనం:</u>

అగురు, చెంగల్వ కోష్టు, మొదలగువానిచే తయారుచేయబడిన ధూపద్రవ్యం

<u>చైత్రమాసం:</u> సుగంధపుష్పములచే దేవుని అలంకరించిన సంవత్సరం అలంకారఫలం వచ్చును.

<u>వైశాఖమాసం:</u> నదీ, తటాకం (చెరువు) కూపం నుండి తీర్థమును తెల్లవారుజామున పరిశుద్ధమైన నూతన ఘటముతో మంచినీరును తెచ్చి వడియపోసి పగలంతయు ఎండయందు వుంచి రాత్రి చంద్ర కిరణములయందు వుంచి, సూర్యచంద్రులచే చూడబడినట్టి ఆ నీటిని వేరు ఘటములందు వుంచి, మంచి గంధం, వట్టివేరు, ఏలుకలు,

పచ్చ కర్పూరం, మొదలైన వానిని వుంచి, మరునాడు స్వామికి నూతన కరకములో(చెంబు) వుంచి, స్వామికి అర్పించవలయును. నివేదన సమయంలో. దీనివలన సంవత్సరఫలితం లభించును.

**విశాఖానక్షత్రం** రోజున విశేషపూజా సల్పి, మామిడిపండ్లు పాలతో కలిపి అన్నము వండి నివేదన చేయవలయును.

జ్యేష్ఠమాసం: అమృతప్రాయమైన తీర్థముతో(నీటితో) స్వామికి స్నానముచేయించి పట్టు, నూలుతో చేయబడిన పల్చని వస్త్రము కట్టి (సమర్పించి), అర్పించవలయును. ఇట్లు చేసిన సంవత్సరం అంతా ఫలము వచ్చును. స్నాన, తోయ (తీర్థం) దానఫలం, వస్త్రదానఫలం, కల్గి చిరాయువు లభించును.

ఆషాఢమాసం: **అర్ఘ్యద్రవ్యముంతో** నిత్యము అర్ఘ్యం ఈయవలెను. **అర్ఘ్యద్రవ్యములు** దర్భలు, అక్షతలు(నసింపులేనివి), నువ్వులు, వడ్లు, యవలు, మినుములు(ప్రియంగు), ప్రేఖణం, తెల్లఆవాలు, పాలు, పెరుగు, నెయ్యి, కలిపిన తీర్థం నిత్యం చేయవలెను.

శ్రావణమాసం: నెయ్యి, పెరుగు, నివేదన నిత్యం చేయవలెను. కృష్ణాష్టమి రోజున విష్ణుని విశేషముగా పూజించి. ఆవుపాలు వెన్న ఎక్కువగా నివేదన చేయవలెను. ఫలితం ఈ క్షీరము సంతానంలేనివారు సేవించిన తప్పక పుత్రవతులు. అగుదురు.

భాద్రపదం: **అపూపము** పిండివండలు) నివేదన చేయవలెను. గారెలు, బూరెలు, వుండ్రములు(వుండ్రాళ్ళు), అరిసెలు మొదలగునవి నివేదన చేయవలెను.

ఆశ్వీజమాసం: సుగంధ సువాసితమైన తాంబూలం నివేదన చేయవలెయును. తాంబూల విశిష్టతను శివుడు పార్వతికి చెప్పిన మాటలు తాంబూలంకు వలయు ద్రవ్యములు, ఆకులు, వక్కలు, ఏలుకులు, లవంగాలు, పచ్చకర్పూరం, జాజికాయ, జాపత్రి, సోపు, కుంకుమపువ్వు, కస్తూరి, సున్నం, కాచు(కవిరి). గుణం:- కారం, చేదు, తీపి, వగరు, అమరురుచులు గలది. ఉష్ణం, క్షారము, వాతము పోగొట్టును. క్రిములను, కఫమును, నోటి దుర్వాసనను పోగొట్టును. **ముఖమునకు** అలంకారము, నోటిని శుభ్రంగావుంచును. కామోద్దీపనము, పదమూడు గుణములు ఈ తాంబూలమునందు లభించును. **సేకరణ : వి. అంజంరాజు**

# హృదయ నీరాజనము

''కమనీయంబులు - భక్తి సింధువులు - భక్తశ్రేణి కల్పాగముల్
ప్రమదాలోల రసాలవాలములు శబ్దబ్రహ్మసంవాసముల్
సుమగంధంబులు భారతీసతి శిరశ్చూడామణుల్ సాహితీ
విమలాకాశ సుధాకరస్మిత కళావిపీసరః పద్మముల్.



కాసు లాన్వయ దుగ్ధాబ్ధికంజవైరి
ఘనుడు పురుషోత్తమాహ్వయకవి విధుండు
వ్రాసిన మనోజ్ఞశతక ప్రపంచమునకు
అనిశమంజలిగావింతురాంధ్రజనులు.

కాసుల పురుషోత్తమ మహాకవి పితామహుని నామము వినని తెలుగువారుండరనుట అతిశయోక్తికాదు. ఈ మహాకవి తల్లజుడు మహా విష్ణుభక్తుడు. సనకసనందన నారదాదిభక్తకోటి యందు చేర్పదగినవాడు. విరాగిజనాగ్రేసరుడు. అపరవాగ్దేవతాస్వరూపుడు.

ఆంధ్రసాహిత్యమున మహాకావ్య రచనచేయక, కవీంద్రుల సరసన పీటవేయించుకొన్న కవి, పురుషోత్తమ కవీంద్రుడు తప్ప అన్యులు లేరు. ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యమును వ్రాయకున్నను కాళహస్తీశ్వర శతకము చేతనే మహాకవి పదము నందదగినవాడని విమర్శకులు భావించినను, ఆయన మహాప్రబంధమును రచించినాడు కదా!

పురుషోత్తమ కవీంద్రులు, ఆంధ్ర నాయక శతకము, హంసలదీవి వేణుగోపాల శతకము 'మనసాహరి పాదములాశ్రయింపవే' 'అనుమకుటముగల శతకము - 'భక్తకల్పద్రుమా!' అను మకుటముతోడి శతకమును రచించియున్నారు. కేవలమిట్టి శతకరచన చేతనేయీ మహానుభావుడు మహాకవీంద్రుల పంక్తి పెద్దపీట పెట్టించుకొనినాడు.

ఒకసారి కవి సమ్రాట్ విశ్వనాధవారు ఆకాశవాణిలో భాషించుచు ''చిత్రచిత్ర ప్రభావ దాక్షిణ్య భావ! హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ'' అను ఆంధ్రనాయక

...యము పదివి, యీ రెండు పాదములతో ఆంధ్రావని ఏడు నిలువుల లోతుకు పులకితమైనది'' అని ప్రశంసించిరి.

తిరుపతి వేంకట కవులను ఎవరో శిష్యులు ''భాగవతమును పోతనగారు రచింపక పోయినచో ఎవరు తెనిగించి యుండువారు?'' అని ప్రశ్నించిరట. వెంటనే వేంకట శాస్త్రిగారు ''కాసుల పురుషోత్తమ కవిగారు రచించియుండెడివారు'' అని సమాధానమిచ్చిరట. అంతకన్న ఆ కవి మూర్ధన్యున కన్యముగు ప్రశంసలేమి కావలయును?

కాసుల పురుషోత్తమ కవీంద్రునిలో భక్తిభావావేశమున ఒక పోతన - ఒక లీలాశుకుడు - ఒక వేదవ్యాస మహర్షి గోచరింతురు. పద్య రచనా విధానమున ఒక శ్రీనాథుడు కనిపించును. అల్పాక్షరముల నవల్పార్థరచనలో తిక్కన సోమయాజిదర్శన మిచ్చును.

నిందాస్తుతిరూపమున ఒక పద్యమును రచించుట ఎంతకష్టమో కవులకు తెలియనిది కాదు. మొత్తము శతకమంతయు అట్లే నిర్వహించి, పండిత పామరులచే శిరఃకంపనము చేయించుట సామాన్యమైన పనికాదు. ఆంధ్రనాయక శతకమున అట్టి అసిధారావ్రతమువలెగా నిర్వహించిన మహనీయుడు పురుషోత్తమకవి.

''భావజ విలాస! హంసలదీవివాస!
ఇరిత కృష్ణాబ్ధి సంగమస్థల విహార!
పరమ కరుణాస్వభావ! గోపాలదేవ!''

అను మకుటముతో రచించిన వేణుగోపాల శతకమును పఠించుచున్నచో, పాఠకునకు కృష్ణాసాగర సంగమస్థలమున వేణుగోపాలుని దర్శించుచు విహరించుచున్న అనుభూతి కలిగితీరును.

ఈ కవీంద్రుడు చల్లపల్లి జమీందారు సంస్థానమున నుండెడువాడు. మానవులను ప్రశంసింప లేదు. మానవులకు కవితా కన్యల నంకితమీయలేదు. ఒకసారి ఒక జమిందారు ఒక శతకమును తనకంకితమిమ్మని అర్థించెనట. అందులకు కవీంద్రులు భార్యనుచూచి ''ప్రాణేశ్వరీ! మన జీవికకు, ఈతోటకూరమడులు చాలవా? మనమొక శతకమంకితమిచ్చినచో ఏదో అర్థ మిత్తుననుచున్నారలీ జమిందారులు. నీ అభిప్రాయమేమి?'' అని అడిగిరట. అందుల కాసాధ్వీతిలకము ''స్వామీ! పొట్టకూటికి - నొడలిబట్టకు ఈ తోటకూరమడులు చాలును. మనకీ జమిందారుల జంఝాటమేటికి?'' అన్నదట.

ఆ మాటలు విని పురుషోత్తములు జమిందారుతో ''అయ్యా! ఆమె అర్థాంగి. ఆమె అభిప్రాయమడుగుట ధర్మమని యడిగితిని. సామాన్యముగా, స్త్రీలకు ధనధాన్యాదిక వైభవమునందాకాంక్ష మెండు. ఆమెకే లేనిచో నాకేల? క్షమింపుడు. కవితాకన్యనీయజాల''నని నిష్కర్షగా చెప్పిరి. అప్పుడు జమీందారు కోపముతో కన్ను లెఱ్ఱచేసి ''ఈయరా! ఎట్లీయరో నేను చూచెద''నని పరుషముగా భాషించెనట. వెంటనే కవీంద్రులు ''మీకు అంతకోపము వచ్చినచో కృష్ణ ప్రక్కనేయున్నది సుమా'' అనిరట. అనగా పిలిచినచో కృష్ణ ఉప్పొంగిముంచి వైచునను భావమును ప్రకటించిరి.

ఆ జమీందారు ఆయన భక్తికి అబ్బురపడి క్షమింపవేడి వినయముతో పాదములకు నమస్కరించి వెడలి పోయెను. దీనిని బట్టి ఆయన ఎంతటి విరాగి జనాగ్రేసరుడో అర్థము కాగలదు.

ఒక పర్యాయము పల్లిపల్లి సంస్థానాధీశుల యింటనేదో శుభకార్యము జరుగుచున్నది. ఎందరో జమీందారులు వచ్చిరి. ఆ సమయమున, 'ఎడవల్లి గంగన' యను క్షుద్ర మంత్రోపాసకుడు విచ్చలవిడిగా విజృంభించి సాహిత్య విషయ నిర్ణయములు సభయందు చేయుచుండెను, గంగన పేరు విన్నచో ప్రజలకు గుండెదడ. అతడు మంత్రవేత్తగా లబ్ధప్రతిష్ఠుడు. ఆయన తలచుకొన్నచో, ఎంతటివాడైన నేకకాలమున హతమొనరింపగలడు. అతని సిద్ధాంతములు తప్పులనిలోచియు అవి తప్పులనుట కెవ్వరును సాహసింపరైరి.

అప్పుడు కాసుల వారు కలుగ జేసికొని "గంగనగారూ! మీకు అనుభవ సిద్ధములు కాని వానిని సిద్ధాంతీకరింపవలదు. ఈసభలో ఎందరో సాహితీవేత్తలున్నారు" అని సున్నితముగా చెప్పిరి. గంగనకు గంగవెఱ్ఱు లెత్తినవి. తన గౌరవ మర్యాదలు మంటకలిసినట్లనిపించినది. ఆకంఠముగా ఆగ్రహమెగదన్నినది. భయదోగ్రతాండవ మారంభించినాడు. సభయంతయు భయోద్విగ్నమై కుడ్యార్పిత చిత్రముల్లున్నది. కవీంద్రులు చిరునవ్వుతోగమనించుచుండిరి. అపుడు గంగన "భట్టూ! నీవే కవిభట్టారకునివలె ప్రవర్తింపకు. నాశక్తి నీకు తెలియదు. తెల్లవారు వఱకు నీశవము మాత్రమే లోకమునకు దర్శనమొసంగును" అని కోపముతో విసవిస వెడలిపోయెను. సభచాలింపబడినది. కవీంద్రులు హరినామస్మరణముతో తిరిగి వెళ్ళిరి.

జమీందారులందు ఉత్కంఠ పెరిగినది. ఎవరు జయింతురు? పాపము. పురుషోత్తమ కవీంద్రులు అనవసరముగా తగవు పెట్టుకొని ప్రాణముపైకి తెచ్చుకొనిరి' అని సానుభూతిని ప్రకటించిరి. కొందరు వార్తాహరులను, గంగన - కవీంద్రుల యింటి యొద్దనేమి జరుగుచున్నదియు తెలుప వలసినదని ఆజ్ఞాపించిరి.

కొందరు వార్తాహరులు రాగా "ఓరీ! మీరెచట నుండివచ్చుచున్నారు" అని జమీందారులడుగ "స్వామీ! గంగనగారి యింటికడనుండి వచ్చితిమి. ఆయన తలస్నాన మొనరించి, పెద్ద పెద్ద బొట్టులను ధరించి ముగ్గులు వైచి, భూతముల నాహ్వానించుచున్నాడు. ఇంతింత బొమ్మలుగా వచ్చి భూమ్యాకాశములంటు పెరుగుచున్నవి. ఆ భూతదర్శనము నశరీరములు పట్టుతప్పుచున్నవి" అని మనవి చేసిరి.

కొందరు వార్తాహరులు పురుషోత్తమ కవీంద్రుల యింటి నుండి వచ్చి "స్వామీ! ఆయన స్నానమొనరించి ధ్యానాను సంధానమొనరించు కొనుచు పడుకొనినారు. ఏవేవో భూతములుగానున్నవి. భీకరముగా వచ్చి కవిగారిని సమీపింపజాలకున్నవని వినిపించిరి.

తెల్లవారులు ఇట్లే గడచినది. ఎడవల్లిగంగనమరణించి నాడను వార్తను వార్తాహరులు

మోసికొనివచ్చిరి. ప్రపంచము విస్మయమందినది. కాసుల పురుషోత్తమ కవిశార్దూలురు, కాలకృత్యములు తీర్చుకొని కృష్ణలో దిగి ఒక తాటియాకుపై

"హరునిలలాటఘర్మ కణమందున నుద్భవమందిపార్వతీ
పరిణయవేళ దీవనలు పల్కి పురంబులు కొల్చువేళ ఈ
శ్వర విభుదాంకముల్ పొగిడి సర్వజనంబుల మెప్పుగన్నవా
స్థైయగు భట్టుకెవ్వఁడపకారము సేయునొవాని కాయువున్
సిరియు దొలంగుగాన మృతి చెందెదవీ వెదవల్లి గంగనా"

అను పద్యమును రచించి, దానిని విరిచి కృష్ణాప్రవాహమున పడవైచిరి. అంతే. గంగనమడిసినాడు. సహజముగా సత్త్వగుణ సంపన్నుడగు కవీశ్వరులు శాపానుగ్రహ సమర్థులు. ఆరింట 'ఒ' కారము నుంచి రుద్రగణ ప్రయోగము చేయుటచే నాతడు మరణించెను.

అట్టి మహా కవీంద్రుల "ఆంధ్రనాయకశతకము"నకు ఆంధ్రసంస్కృతాంగ్ల భాషలయందు తలస్పర్శమొనరించిన మహా విద్వత్కవులు - లబ్ధ ప్రతిష్ఠులు, అనేక కావ్యకర్తలు - రసహృదయులు, మిత్రమణి శ్రీమాన్ శనగన నరసింహ స్వామిగారు, వ్యాఖ్యానమును రచించుట పసిడికి తావి యబ్బినట్లైనది. నేను ఒకటి రెండు పద్యముల టీకాతాత్పర్యములను మాత్రము మాచునదృష్టము కలిగనది. సరసమై - సరళమై - సుందరమై - నిర్మలమై వారి వ్యాఖ్యానము పఠితలకు అంకస్థితార్థపేటి కాగలదు. శతకమా గుణాధిక్య విస్తృతము. వ్యాఖ్యాత మహాసమర్థుడు. ఇంక నాబోటి అల్పజ్ఞులు ఎట్లు ప్రశంసింప జాలుదురు? శ్రీ శనగన వారి శబ్ద పాండిత్యము అనితరసాధ్యము.

ఒక్కమాట. కావ్యరసగ్రహణపారీణులు, కవితాపక్షపాతులు. నిర్మల చిత్తులు - కార్యదీక్షాతత్పరులగు శ్రీమాన్ అంజంరాజుగారు, శ్రీ కాసుల పురుషోత్తమ కవి చంద్రుల పేరిట నొకకవితా పీఠమును నెలకొల్పుట ఆంధ్రజాతి అదృష్టము పైగా ఆ మహనీయుని కవిత్వము నందఱకు పాయసముగా నందించుటకు చేయుచున్న కృషి బహుధా ప్రశంసనీయము. ప్రాతస్స్మరణీయము. వారి శతకముల కన్నింటికిని రసభరిత వ్యాఖ్యానములు శ్రీ శనగన నరసింహ స్వామి గారి లేఖిని నుండి వెలువరించుటకు శ్రీమాన్ అంజంరాజుగారు దీక్షాబద్ధులగుగాక.

ఈ మహాయజ్ఞమున 'ఉడుతాభక్తి'గా ఈ కొలదివాక్యములు రచించుట కవకాశము కల్పించిన మాన్య మహోదయులు శ్రీమాన్ అంజంరాజుగారికి కృతజ్ఞతాభివందనములు.

భక్తపాదరేణువు
మొవ్వవృషాద్రిపతి
ఆంధ్రోపన్యాసకులు
ప్రభుత్వ మహిళాకళాశాల - గుంటూరు.


"హరునిలలాట ఘర్మకణమందున
నుద్భవమంది"......

# పురుషోత్తమ దర్శనం

శ్రీమాన్ అగ్నిహోత్రం యోగానంద నరసింహాచార్య
శారదా కళాశాల, విజయవాడ-3

కాలం మారింది అని నేడు అందరు అంటున్నారు.

కాని,

మారింది కాలం కానేకాదు. ముమ్మాటికీ మారింది మానవుడు ఒక్కడే. అతని భావాలు నిరంతరం పరిణామశీలాలు. కాలచక్రగమనంలో మనిషి తనకు లభించిన అవకాశాలను తన అవసరాలకు అనుగుణంగా మలుచు కుంటున్నాడు. అనాదిగా జరుగుతున్న తంతే యిది. అయితే గతకాలాలలో ధర్మాన్ని కేంద్ర బిందువుగా స్వీకరించిన మానవులు అధిక శాతం మంది తమ పరిధిని తాము గుర్తించి ప్రవర్తించేవారు. పాపభీతి వారిలో అధికంగా ఉండేది.

కాని,

నేటి మనిషి మనస్తత్వానికి స్వార్థం పునాదియైంది. ధనం జీవన సౌధం అయింది. అంటే పూర్వీకులంతా నూటికి నూరుశాతం చాలా మంచివారని కాదు దీని ఆంతర్యం. "సర్వం స్వార్థం సమీహతే" అన్న మాఘ మహాకవి మాటలు అక్షరశః సార్వకాలిక సత్యాలు. స్వార్థం ఆలనాటివారిలో కూడా వున్నా యింత అధికంగా వారికి లేదు. దానికి కారణం నిరంతరం వారికి సజ్జన సంభాషణం, జ్ఞాన బోధ వంటివి అందుబాటులో వుండేవి. నేడవి పూర్తిగా మృగ్యమైనాయి.

ఆలనాటి విద్యావిధానంలో హితబోధ, ప్రపంచావగాహన, పురాణాదులలోని ఎన్నెన్నో మంచి పెద్దల ప్రసంగాలు సత్పురుషుల ప్రవర్తనాదులు మిక్కుటంగా వుండేవి. అలాంటి అంశాల పఠనపాఠనాదులచేతను, వినటం చేతను, పెద్దల అనుభవ పరంపరలను కన్నార దర్శించటం చేతను మనిషికి విశేష విజ్ఞానం లభించేది. ఆచరణీయ మార్గాలను సుగమంగా మనిషి అందుకోగల్గేవాడు, ఇంతటి విజ్ఞానాన్ని మనిషికి ఏకకాలంలో అందించిన ఘనత శతక సాహిత్యానిదే, వాఙ్మయంలో శతకానికొక విశిష్ట స్థానం వుంది. కాబట్టే పూర్వులు తమతమ పిల్లలకు చిన్న నాటి నుండే ఈ శతకాలకు పాఠ్యాంశంలో ప్రధాన భూమికను ఏర్పరచారు. మనిషి మనసుకు నిరంతరం కర్తవ్యాన్ని బోధించగల స్థాయి సత్తా శతకానికే వుంది. పామరులైన వారు కూడా వినటం ద్వారా విజ్ఞానాన్ని, లోకాచరణ మర్గాన్ని ఎన్నుకొనే అవకాశాన్ని శతకాలు కల్పించాయి.

శతవాఙ్మయంలో ఎన్నెన్నో అనర్ఘ రత్నాలు ఉన్నాయి. లోకం పోకడను అద్దంలో చూపించినవి కొన్ని, జీవన సత్యాలను కుమ్మరించిన మరికొన్ని సుమతీ శతకాదులు,

యీ కోవకు చెందిన శతకాలు. కానీ ఆంధ్ర నాయక శతకం శతక సాహిత్యంలోనే చాలా విలక్షణమైంది. ఎన్నెన్నో భావతరంగాలను తనలో ఇమిడించుకొనే "సీస" పద్యాలలో శ్రీ కాసుల పురుషోత్తమ కవిగారు రచించి ధన్యులైనారు. ఆంధ్ర శ్రీ మహావిష్ణుని అనంతవైభవ ప్రాభవాదులను ఆంధ్ర నాయక శతకంలో అభివర్ణించి పాఠకులందరికీ ఆనందం కల్గించారు. ఆలోచనలను రేకెత్తించారు. ప్రతి పద్యం పాఠకుని ఆలోచనాలోచనాలకు అంజనం లాంటిది. త్వరత్వరగా చదువుటకు అవకాశం అంతగా లేని శతకం ఇది. శతకంలోని ప్రతి పద్యం శ్రీ మహావిష్ణుని దశావతార జీవిత గాథలను కుమ్మరిస్తుంది. ఆ సమయం సందర్భం పురాణగాథ తెలియనప్పుడు పద్యం ఏమాత్రం అర్థం కాదు. సీస పద్యం పైకి చాలా సులభంగా వున్నట్లు కనిపించినా అంతరాంతరాలలో అనేకానేక మహావిషయాలను తనలో నిబిడీకృతం చేసుకొని పాఠకుని ముందు సాక్షాత్కరిస్తుంది.

శ్రీమన్నారాయణుడు సర్వాంతర్యామి. ఈ అంశను పూర్వ కవులెందరో ఎన్నెన్నో రీతుల వర్ణించిరి. కాసుల పురుషోత్తముని వాక్కుల సంయోజనమే చాలా విచిత్రమైనది. చెప్పదలచిన విషయమును వ్యంగ్యాంతరముగ, బహు సుందరంగా చెప్పుటలో సిద్ధహస్తుడు.

అచటలేవని కదా యరచేత జఱచె గ్రు
ద్దత సభాస్తంభంబు దానవేంద్రు
అచట లేవని కదా యాత్మీయ సభను ద్రౌ
పదివల్వ లూడ్చె సర్పధ్వజుండు — 9వ పద్యము

పై పద్య పాదములలోని భావము మిక్కిలి గంభీరమైనది. పురాణ విషయకమైనది. భగవానుని ఉనికిని సూచించు నట్టిది. దానవేంద్రుడైన హిరణ్యకసిపునకు విష్ణునిపై గల వైరి భావము అట్లు ఆయనను ప్రవర్తింప జేసినది. స్తంభమును తన అరచేతిలో అహంకారముగ, ధైర్యముగా గ్రుద్దినాడు. సజ్జన సంరక్షకుడైన శ్రీహరి ఆకస్మికముగ ప్రహ్లాదుని రక్షించుటకు అచటికి సిద్ధమైనాడు. భగవానుడు దుర్జనులైన వారిని సంహరించుటకు ప్రత్యేకముగ ప్రయత్నించ వలసిన అవసరము లేదు. కానీ సజ్జన సంరక్షణమే ఆయనకు అహర్నిశము ముఖ్యమైనది. ప్రహ్లాదుని వంటి సజ్జనుని సంరక్షించుటకు శ్రీహరి తప్పక రావలయును. ఆ రాకతోనే దుర్జనుని సంహరించుట జరుగును, అను విశిష్టాద్వైత సంప్రదాయమును కవి పరోక్షముగ పై పద్య పాదములో నింపినాడు. శిష్టరక్షణ చేయుట యందే దుష్ట శిక్షణ యిమిడి యున్నది అలనాడు నీ భక్తుడైన ప్రహ్లాదుడు, అభిమన్యుడు, ద్రౌపది వంటి వారిని కాచిన ఘనుడ వను పేరొందిన నీవు సర్వసిద్ధికరక్షేత్రమైన శ్రీకాకుళమున శ్రీహరివై నిల్చి భక్తజన

సంరక్షకుడవై యుండుట మా భాగ్యమని కవి ఆంధ్ర మహావిష్ణుని కొనియాడినాడు.

నేటికిని ఆలయమున వైఖానసాగమము ప్రకారము స్వామి వారికి అర్చనా కైంకర్యములు జరుగు చున్నవి. ఆగమములలో శ్రీ వైఖానసాగమము ఉత్తమోత్తమమైనది. అట్టి ఆగమము ద్వారా వివిధ పూజా ఉత్సవాది కార్యక్రమములను జరిపించు కొనుటలో ఆలసత్వమెందులకని నిగ్గదీసిన ఘనుడీ కవి. కొంతకాలము పూజలు నిలిచిపోయినట్లు కవి చారిత్రక అంశములను భావితరాల వారికి తెలియ జెప్పినాడు.

కవి శతకంలో "కీర్తినిందగ వర్ణించి గేలిపరుతు" అని వ్రాక్కుచ్చినాడు. భగవానుడు భక్త పరాధీనుడు, భక్తుని కోరిక మేరకు భగవంతుడు ప్రవర్తించుట భక్తి మార్గ సమ్మతము. శ్రీహరి లీలలను అభినందించుచు కవి.

> భిల్లాంగనా దంత పీడిత ఫలభుక్తి
>
> హేయంబు దోచలేదింత నీకు
>
> సంక్రందనాత్మజ స్యందన సారథ్య
>
> మెరుసుగా దోచలేదింత నీకు — 21వ పద్యము

శబరి ఇచ్చిన ఎంగిలి పండ్లు తినటం నీకు నీచంగా అనిపించలేదా? అర్జునుని రథాన్ని నడపడానికి సారథిగ అంగీకరించటం నీకు చిన్నతనంగా లేదా? యని కవి ప్రశ్నించాడు. పరమాత్మవైన నీవు నీ భక్తుల కోర్కెలను మన్నించటంలో చూపిన నేర్పు అద్వితీయమైందని ప్రశంసించటం గమనార్హం. పైగ లోకమంతా నీ పిచ్చిచేష్టలను సమర్థిస్తూ భక్తుల కోరిక మేరకు చేసినవేనని చెప్పటం చాలా విచిత్రంగా వుందని కవి నిందా స్తుతి కడురమ్యంగా వుంది.

ఆంధ్రనాయక స్వామి! నీ కుటుంబ చరిత్ర చూస్తే నీ అంత దరిద్రుడు వేరొకడు లేడు అనిపించే తీరులో ఆలు నిర్వాహకురాలు భూదేవి అనే పద్యం సాగుతుంది. పైకి అంతా నిందాపూర్వకముగానే కన్పిస్తుంది. చివరి పాదాలలో నీవు "మొదటి నుండియు దామోదరుడవె" అనటం మహాద్భుత ప్రయోగం. ఆది నుండి నీ కుటుంబం నిన్ను విలాసపురుషుడిగనే తీర్చి దిద్దింది అని అర్థం. "దామోదర" శబ్దానికి దరిద్రుడు, తులసిమాల, ఉదరముపై వ్రేలాడువాడు అనే శ్లేషార్థాలను కవి చక్కగ ఉపయోగించుకొని వాడు, మీ యింట్లో వారంతా ఇంత గొప్పవారైతే యిక నీవెంత గొప్పవాడివో నేను అభివర్ణించలేనని కవి భావన. పరాత్పరుని లీలా గుణ విశేషాలను వర్ణించటం అంత సులభం కాదని తాత్పర్యం. ఇలా పురుషోత్తమ కవి ఆశ్రియఃపతియైన పురుషోత్తముని ఎన్నెన్నో వన్నెచిన్నెలతో వర్ణించి తాను కృతార్థుడై పాఠకులను కృతార్థులను చేసినాడు.


ఆలు నిర్వాకకురాలు
చిత్ర చిత్ర ప్రభావ దాక్షిణ్య
భావ హతవిమత జీవ
శ్రీకాకుళాంధ్ర
దేవ

# అపూర్వమైనది
# ఆంధ్ర నాయక శతకం!!



అప్పుడు
ఆరోతరగతి చదువుతోన్న రోజులు....
వీధి అరుగుమీద, తుంగ చాప మీద,
బాసింపట్టు వేసుకొని బుద్ధిగా
చదువుకొంటున్న సమయం....
"ఇల నిర్వాహకురాలు భూదేవి యై
యఖిల భారకుడను నాఖ్యదెవ్వె."
అనే సీస పద్యం-

నాజంటు రెక్కల పడవల మీద చల్లగా..... మెల్లగా..... నవ్యంగా.... శ్రావ్యంగా.... తెరచాప లెత్తుకొని మనసును మహోన్నత తీరాలకు లాక్కెళ్ళి పోయింది.

ఆ పద్యాన్ని ఆలపించిన అపరిచిత భిక్షుకస్వామిని, వాలు కుర్చీలో కూర్చొని, పేపరు చదువుకొంటున్న మా నాన్నగారు (కవి సుధానిధి భల్లం తిరుపతిరాజు) మినీ ఇంటర్వ్యూ చేస్తుండగా ఆశ్చర్యంతో, ఆనందంతో వారి ముందు నిలబడ్డ ప్రత్యక్షసాక్షిని నేను.

అప్పటికే అనేకుల పద్యాలు నా నాలుకపై నాట్యమాడేవి.

ఆ భిక్షుక స్వామి అనేక సీసపద్యాలు రాగ భావసంయుక్తంగా ఆలపిస్తుంటే అచేతనంగా నిలబడి పోయాను.

ఆ సీస పద్యాల్లో.... నడకలో- భావసమన్వయంలో ఏదో కొత్త దనం - కన్పించింది!... విన్పించింది!!

అలా' ఆంధ్ర నాయక శతకం' నా సాహితీ జీవన సంచికలో తొలిపేజీ అయ్యింది. ఆ క్షణం నుంచి కాసుల పురుషోత్తమ కవిపై అభిమానం అర్ణవమైంది.

శ్రీనాథుని తర్వాత సీస పద్యాన్ని హృద్యంగా... భారతీసతికి నైవేద్యంగా రచించి - పాఠక లోకాన్ని రంజింప చేసిన కవి పురుషోత్తముడే...!

వ్యాజస్తుతికి అనుకూలంగా, భక్తిభావ సౌందర్య పోషణంగా విస్తృతమైన సీసాన్ని కవి ఎన్నుకోవడం ముఖ్యోద్దేశ్యమిదే కావచ్చు!

సాధారణంగా శబ్ద సౌందర్యమున్న చోట అర్థ సౌందర్యం లోపిస్తుంది. కాని పురుషోత్తమ కవి ఈ రెంటిని సమపాళ్ళలో రంగరించి పాఠకులకు అందించినట్లు కన్పిస్తుంది.

అందరిలా స్తోత్ర పాఠాలు వల్లించకుండా "హతం గావించి అన్వయాలెత్తి కీర్తి నిండుగ వన్నించి గేలి సలుపు" భగవంతుడ్ని గేలి చేస్తాడు. ఇది ఆంధ్ర సాహిత్యంలో వినూత్నమైన రచనా వైఖరి. నాన్యతో దర్శనీయ మైందికూడా.

అపారమైన లోకజ్ఞత, శాస్త్రజ్ఞత, ధర్మజ్ఞత, కావ్యజ్ఞత, తత్త్వజ్ఞత, విజ్ఞత, ప్రాజ్ఞత, రసజ్ఞతలతో పాటు, వ్యాజస్తుతి అలంకార మర్మజ్ఞత కాసుల పురుషోత్తమ కవిలో నిండుగా.... దండిగా.... మెండుగా కలవనటలో అనేక ఉదాహరణ లున్నాయి. ఆయన గారి శతకాల్లో....

వ్యంగ్య వైభవం వేయిదీపాల కాంతి నిస్తుంది. సన్నితమైన తిట్లు, సుతారమైన చీవాట్లు,

స్తుతిమెత్తి ఎత్తిపొడుపులు, కష్టనిష్ఠూరం, ఓర్పు నిండే కమనీయ సమాసాల పద గుంఫనం, ఈ శతకంలో అడుగడుగునా సాక్షాత్కరిస్తాయి.

ఎత్తి ఎత్తి ప్రభావ! దాక్షిణ్య భావ!
హత విమత జీవ! శ్రీకాకుళాంధ్ర దేవ!!

అనే మకుటంలో మహత్తరమైన లక్ష్యం నిక్షిప్తమైంది.

పురుషోత్తమకవి - వైష్ణవ మత ప్రవిష్టుడు కావడంలో - వీలు ఒప్పే దశావతారములు వినూత్న రీతిలో వర్ణించెను.

“పక్షంబు గల దంతు పొందు పుత్రుల ముందు
పాండవుల్ పడినట్టి పాటులేమి?”

అని ప్రశ్నించడంలో - కవి ప్రతిభ వ్యుత్పత్తి లోకజ్ఞత కన్పిస్తుంది.

హంసలదీవి గోపాల శతకంలో కన్నా ఆంధ్ర నాయక శతకంలో వ్యాజస్తుతి అలంకారం మరింతగా నిగ్గుతేలినట్లు కన్పిస్తుంది.

“సేవకులందందు సేవింప భావింప
తిరువీధుల రథంబు తిప్పవేమి?”

“దివ్య దేశంబిది తీర్థంబు సార్థంబు
చక్ర తీర్థము స్నానములు వేమి?”

ఆంధ్ర నాయక శతకమంతా వ్యాజస్తుత్యలంకార పరివ్యాప్తమైంది. కాకువు చేత అందులో అక్కడక్కడ వక్రోక్తి కూడా చేరినట్లు అనిపిస్తుంది.

పుష్పసుగంధంగా పూర్వగాథలు శతకమంతా పరివ్యాప్తమై పాఠకులను రంజింప చేస్తాయి. కాకాసుర వృత్తాంతం, శకుసారణులు, బలరామావతారం, ప్రలంబాసురు కథ, కుబ్జ వృత్తాంతం, మాలికావృత్తాంతం, విదురుని విందు ఇత్యాది మనోజ్ఞంగా వర్ణితం.

ఈ శతకంలో పంచ విధ భక్తి భావాలు శాంతం, దాస్యం, వాత్సల్యం, సఖ్యం, మధురం అభివర్ణితం.

“వ్రేపల్లెలో గొల్ల వెలదులు గొట్టరా
దొడిదొడి యుల్లిల్లు దూరలేదో.....”

శతక కర్తల్లో తెలుగు పలుకుబడి బాగా తెలిసిన కవుల్లో పురుషోత్తమకవి ప్రథముడు.

“నీగలివి గాదె? పాండవుల్ నిలిచి మనుట”

“లోకనాయక నీకు పరాకు దగునె”

ఇత్యాది కవి కాని వాడియైన ప్రశ్నార్థకాలు

“వేషమున దాసుడను మహా దోషినయ్య”

“ధన్యమతినైతి మీ ప్రసాదంబు మెక్కి”

సకృత్తుగా కొన్ని చరణాలు హాస్య ప్రేరకాలు.

“ఈ కవి వంశంలో వారి ప్రతి పద్యం కాసంత విలువ కలది కావడం చేత కానోపు “కాసుల” వారనే ఇంటి పేరు వీరికి ఏర్పడిందేమో.... అనే పెద్దల మాటలో స్తవంలో కన్నా వాస్తవం మిన్న!!

మహా కవి - విశ్వనాథ సత్యనారాయణ గారి మాటల్లో “బమ్మెర పోతరాజు భాగవతం వ్రాయకపోతే పురుషోత్తమకవి వ్రాసేవాడు”

ఇది అక్షర సత్యం!!

భల్లం సూర్యనారాయణ రాజు M.A.


సామాన్యుడుసైతం
నా కవిత గానము చేయుటతో
నా కవితకు సార్థకత
ఏర్పడినది.

# అలనాటి ఆంధ్రుల తొలిరాజధాని
## శ్రీకాకుళం (కృష్ణాజిల్లా)

అది కృష్ణాజిల్లా శాతవాహనుల తొలిముఖ్యపట్టణం శ్రీకాకుళం. శాతవాహనులకు ఆంధ్రమహావిష్ణువు ఆరాధ్యదైవం. తరువాత శాతవాహనులు అమరావతి దగ్గర వున్న కృష్ణాతీరంలోని ధాన్యకటకం రాజధానిగా విలసిల్లినది.

అతనిది గొల్లపల్లి, ఇతనిది చల్లపల్లి, కథానాయకుడు ఆంధ్రమహావిష్ణువు. కృతికర్త కానుల పురుషోత్తమకవి (పుల్లంరాజు)

నవబ్రహ్మలు, పాపపరిహారార్థం మహావిష్ణువుయొక్క విగ్రహంను ప్రతిష్ఠించుటకు ప్రయత్నించుచుండిరి. వారికి స్వామి ప్రత్యక్షమై ఆంధ్రవిష్ణువుగా ఆంధ్రుల ఆదిదైవతంగా ఆంధ్రులను రక్షిస్తూ కృష్ణానదీతీరంలో వెలుస్తానని పలికినాడు. అదే శ్రీకాకుళం ఆంధ్రశాతవాహన రాజులకు శ్రీకాకుళం మొదటి రాజధాని. ఇది బందరుకు ముప్పై కిలోమీటర్ల దూరంలో వుంది. మరియు కొల్లూరు(గుంటూరుజిల్లా) రైల్వేస్టేషనుకు 12 కిలోమీటర్ల దూరంలో వుంది.

ఆంధ్రమహావిష్ణువు ఆలయం చాలపురాతనాలయం. అగస్త్యుడు కృష్ణానదీతీరంలోని క్షేత్రాలను చూచుచూ, ఈ ఆలయంను దర్శించినట్లు స్కాంధపురాణ కథ కలదు. పద్మపురాణము నందుకూడా ఈఆలయ ప్రసక్తి కలదు. అవంతీ దేశవాసుడైన యజ్ఞశర్మ కుమారుడు దేవశర్మ వచ్చినట్లు ఆధారములు కలవు. ఆదివిష్ణువు, ఆంధ్రవిష్ణువు, ఆంధ్రనాయకుడు అను నామాంతరములు కలవు. ఇది 6 అడుగుల ఎత్తుగల విగ్రహం. 4 అడుగుల రాజ్యలక్ష్మి విగ్రహం కూడా కలదు. ఇక్కడ ఏక రాత్ర ప్రసన్న మల్లిఖార్జునస్వామి లింగం, ఆంజనేయస్వామి ఆలయం కూడా కలవు.

ఆంధ్రుల్ని గురించిన అతి ప్రాచీన ప్రస్తావన ఐత్తరేయ బ్రాహ్మణంలో వున్నది. ఆ తరువాత రామాయణంలో, మహాభారతంలో పురాణాలల్లో ఆంధ్రుల మాట వుంది. తొలుత ఆంధ్రులు ఆర్యకుటుంబంలోని వారనీ తరువాత దక్కను ప్రాంతానికి వలస వచ్చిన స్థానికులతో కలసిపోయారని తెలుస్తుంది. చరిత్ర గతంగా ఆంధ్రుల్ని క్రీస్తు పూర్వం 4వ శతాబ్దంలో మెగస్తనీసు వ్రాసాడు. క్రీ.పూ. 225 నుండి క్రీ.శ. 220 రాజ్యం చేసిన శాతవాహనరాజులలో

ప్రథమ, ద్వితీయ శాతకర్ణుడు, గౌతమీపుత్ర శాతకర్ణి యజ్ఞశ్రీ శాతకర్ణి ప్రభృతులు. ప్రాచీన భారతదేశంలో గణుతికెక్కినవారు.

కృష్ణ: అంటే నల్లని వర్ణం; అని అర్థం

మహాబలేశ్వరం మైదానంలోని తూర్పు కనుమలలో అరేబియా సముద్రం నుండి 40 మైళ్ళ దూరంలో ఈ నదీ ఉద్భవించినది. శ్రీకాకుళంకు బందరు నుండి మరియు విజయవాడ నుండి బస్సు సౌకర్యంలు కలవు. ఘంటశాలనుండి శ్రీకాకుళం 16 కిలోమీటర్ల దూరం. బందరు కృష్ణాజిల్లా ముఖ్యపట్టణం, రేవు పట్టణం కూడా. పోర్చుగీసు వారు కోటను నిర్మించారు. బందరు నుండి మార్మగోవాకు రైలుమార్గం వారిసౌకర్యార్థం వేయబడింది.

శ్రీకాకుళం ఓడరేవు ఇక్కడనుండి సముద్రతీర ప్రాంతంలతోనూ, పశ్చిమంలో, గ్రీసు, రోమ్ వంటి దేశాలతోను తూర్పున బర్మా, సయామ్, చీనా, జావా, మలేషియా, సుమిత్రా వంటి దేశాలతోనూ కృష్ణాతీరంనుంచి సముద్రం మీదుగా పూర్వం రత్నాల, వజ్రాల వ్యాపారం ముమ్మరంగా సాగుతుండేది.

పెరిప్లను, టాలేమి, భూగోళ గ్రంథాలను బట్టి కృష్ణానది ముఖద్వారం ఖండాంతర వాణిజ్యానికి కేంద్రంగా వుండేది. శ్రీగంథం, పచ్చకర్పూరం, ముత్యాలు, పగడాలు, దంతం మొదలైనవి ఆంధ్రదేశానికి దిగుమతి **అవుతుండేవి.**

1. కృష్ణానదిపై మొట్టమొదటి సారిగా 1852లో సర్ ఆర్థర్ కాటన్ ఆనకట్ట కట్టారు. 1-2 కిలోమీటర్ల పొడవున యీ ఆనకట్ట బెజవాడ ఆనకట్టగా పిలిచేవారు. 4 లక్షల ఎకరాల ఆయకట్టు సాగవుతుండేది.
2. కృష్ణవేణి పరుగులకు 'కోట్సి' వద్ద అడ్డుకట్ట పడింది. 1868లో యిక్కడ కృష్ణానది మీద ఒక ఆనకట్ట కట్టారు. ఈనాటికీ ఈ ఆనకట్ట చెక్కు చెదరక నిలిచేవుంది.
3. కృష్ణాసాగర సంగమ ప్రదేశం హంసలదీవి. ఇచ్చట శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం ప్రసిద్ధమైనది. హంసలదీవికి పరమహంసలు వస్తుంటాయి. కాకి - హంసగా మారి ప్రాధాన్యత సంతరించుకొన్నదీ హంసలదీవి.

తెలుగుజాతి ప్రాభవాన్ని ప్రపంచం నలుమూలల చాటిన ఖ్యాతి దేవరకోట సీమప్రాంతానికి దక్కుతుంది. శ్రీకాకుళంలో వెలసిన ఆంధ్రమహావిష్ణువు, శ్రీకృష్ణదేవరాయులకు కలలో కన్పించి 'ఆముక్తమా

ల్యద!' అను గ్రంథాన్ని రచించవలసిందిగా ఆదేశించినారట. అట్టడుగు వర్గానికి చెందిన ప్రజల నిత్యజీవితాల, భావాల, వర్ణలతో నిండి వున్న ఈ మహాగ్రంథ రచనకు శ్రీకృష్ణదేవరాయులు శ్రీకారం చుట్టుంది ఆంధ్రుల ప్రథమరాజధాని శ్రీకాకుళంలోనే అని చెబుతారు. శ్రీకృష్ణదేవరాయులు క్రీ.శ. 1519లో శ్రీ ఆంధ్రమహావిష్ణువును దర్శించి, నిత్య నైవేద్యాలకు ఐదు గ్రామములు సమర్పించినట్లు ఇక్కడ శాసనాలు వున్నాయి.

అలాగే ప్రపంచప్రఖ్యాత నృత్యాలకు అనువైన వందలకొంది పదాలను రచించిన క్షేత్రయ్య జన్మస్థలమైన మొవ్వ/ ప్రపంచ ఖ్యాతిగాంచిన నృత్యం సృష్టికర్త శ్రీ సిద్ధేంద్రయోగి జన్మస్థలమైన కూచిపూడి. అక్కన్న, మాదన్నలు 12వ శతాబ్దంలో కూచిపూడిని దర్శించి, అక్కడి 6 కుటుంబాల వారికి 600 ఎకరముల భూమిని అగ్రహారంగా ఇచ్చినట్లు చరిత్ర దాఖలాలు వున్నవి. బౌద్ధ పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతున్న టంకశాల (ముద్రణాలయం) ఘంటశాల.

జాతీయ పతాక జన్మదాత మన పింగళి వెంకయ్య జన్మస్థలం యార్లగడ్డ, శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి పింగళి సూర్యనార్యుడును గన్న చిట్టూర్పు ఈ దేవరకోటలోని గ్రామమే!.

ఇంతటి వైభవాలకు ఆటపట్టైన **దేవరకోట** సీమలోని శ్రీకాకుళంలో గల ఆంధ్రమహావిష్ణువు దేవాలయం, నిత్య నైవేద్యములు లేక, **పూజాదికములంకు** నోచుకోని తరుణములో, శ్రీదేవర కోట ప్రభువగు **రాజా** అంకినీడు ప్రభువుల ఆస్థాన కవిగా వున్న శ్రీ కాసుల పురుషోత్తమకవి తన కవితావైభవంతో ఆ దేవాలయానికి నిత్యనైవేద్య కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగుటకు, అగ్రహారములను, మాన్యములను జమీందారిగారిచే ఏర్పాటుచేయించినట్లు ఆధారములు కలవు. మరియు ఆంధ్రమహావిష్ణువుపై ఒక శతకమును వ్రాసినారు అదే శ్రీకాకుళ ఆంధ్రనాయక శతకము.

పాలలోని **తియ్యదనాన్ని యేరీతిగా** వేరు చేయలేమో! ఈయన కవిత్వంలోని భాషలోని తేనెకన్న మధురమైన తియ్యందనాన్ని అంత సులభంగా మరువలేము!

*నిధి - సుఖమా - రాముని సన్నిధి సుఖమా - త్యాగరాజు.*

వి. అంజంరాజు.
ఎడిటర్ : ఆంధ్రబాల.

# మా తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ పూర్తిగీతం ఇది :



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు...
కడుపులో బంగారు
కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు
దొరలించు మా తల్లి ॥మా॥
గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి ॥మా॥
అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై
నిలిచి వుండేదాక
రుద్రమ్మ భుజశక్తి - మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి - కృష్ణరాయని కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం... మా తల్లి
నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ!... జై తెలుగు తల్లీ...

# "దీపిక"

45«¡ UE:

కవి, దేవుని ఎంతో పిలిచినాడు. దేవుడు వచ్చుటలేదు, కనపడుటలేదు. ఈ జాగుకు కవి కారణములూహించి విన్నవించుకొనుచున్నాడు. "ఓ దేవా! మొదట యోగులయొక్క మనస్సు అనెడి కట్టుస్తంభానికి బంధింపబడి ఆ బంధాన్ని వదలించుకొని రాలేకపోవుచున్నావా? తరువాత వేదాంతము అనగా ఉపనిషత్తులు. దేవునికి ఉపనిషత్తులే మందిరములు. ఆ మందిరములతోనే ఆయనకు పరిచయము. భక్తులు మంత్రాక్షరములతో పిలిచినప్పుడు ఆ అక్షరములతో కూర్చబడిన మంత్రముల గుహలలో చిక్కుకొని ఒక్క పరియును ఆ గుహలతో పరిచయములేక వాటినుండి బయటపడు మార్గము తెలియక ఓ దేవా! రా గలవికాలేదా? మరియు కాలమనంతము, అఖండము. కాలమునందు అనేకములైన అంతరువులున్నవి. నిమిషము, అరనిమిషము మొదలయినవి. ఇటువంటి నిమేష, అర్ధనిమేషాది కాలచక్రాన్ని అధిగించి వచ్చుట క్రమముకాదని భావించి రాకున్నావా? అదియుగాక వక్రత్వము (వంకర), ముండ్లు, పాపపంకముతో కూడియున్న క్రూరుల మనస్సునందు కాలుమోపి నిలచుట కష్టమని రాకున్నావా?" అని భక్తకవి భగవంతుడు రాకపోవుటకు కారణములూహించినాడు.

యోగమనగా అష్టాంగయోగము, ధ్యాన, ధారణ, ప్రాణాయామ, సమాధి మొదలయినవి. ఇవి భగవంతుని సాక్షాత్కారాన్ని కలిగిస్తాయి. అష్టాంగ యోగములుకల, యోగుల మనస్సు దృఢమైన కట్టుగొయ్య దేవునకు. ఈ దృఢబంధం వదల్చుకొని తనవద్దకు వచ్చుట కష్టమని ఒక ఊహ. భగవంతుని భక్తిమార్గంతో ఉపాసించువారు తక్కువమంది. అందుచేత దేవునకు మంత్రాక్షర గుహా పరిచయం తక్కువ. అందుచేత అపరిచితమార్గాన్ని దాటుట అయనకు శ్రమ. దానిచే జాగని ఒక ఊహ. కాలంలో రెప్పపాటు నుంచి లెక్కయే నిముషంలో ౬౦ రెప్పపాట్లు. గంటలో ౬౦ నిమిషములు. ఇట్లే పెద్దచక్రంలో చిన్నచక్రాలెన్నో కలిగినది కాలచక్రము. ఈ అంతరాంతర చక్రాలను దాటి తన వద్దకు రావటంలో కాలక్రమం పెద్దది అవుతుంది. జాగుకు అది ఒక ఊహ. తన మనస్సు పాపపంకిలము, సంకల్పాది వికల్పాది కంటకావృతము. ముండ్లమీద కాలుమోపటమే కష్టము. పంకంమీద మోపినా కాలు జారుతుంది. ఈ కష్టాన్ని తెల్సుకొని దేవుడు తన మనోమందిరానికి రాలేదని ఇంకొక యూహ.

46«¡ UE:

ఇది మేలుకొలుపు పద్యము. భక్తులు దేవునకు మేలుకొలుపు పాడుట సాధారణము.కాని ఇందు కవి దేవుని గాఢనిద్రకు కారణము నూహించి

మేలుకొలుపుచున్నాడు. కృష్ణావతారమందలి కథను గైకొని ఉత్ప్రేక్ష జరిగినది. 16 వేలమంది గోపికలు కృష్ణుని తమ కఠినస్తనములతో మర్దించినారు, జడలతో బాదినారు, దంతక్షతములు జేసినారు, నఖక్షతములను జేసినారు. సాధారణముగా ఇవి పురుషులు జేయునవి. ఇచ్చట గోపికలే పురుషులుగానుండి "ఉపరతిని" జేసినారు. ఉపరతి అనగా వేదాంతమున ఐహిక విషయ వాంఛానివృత్తి అని అర్థము. శృంగారమున పురుషునిపైకెక్కి స్త్రీ రతిజేయుట అని అర్థము. గోపికలు కృష్ణ వ్యామోహముచేత అటు వేదాంతపరముగాను, శృంగారపరముగాను "ఉపరతి" జేసినారు. ఒక రాత్రిగాదు రెండు రాత్రులుకాదు. ఒక గోపిక విడచి ఇంకొక గోపిక పర్యాయపర్యాయములుగా పైవిధంగా కృష్ణునితో ఉపరతులు సలుపుటచేత ఓ దేవా! ఆనాడులేని నిద్రాసుఖం అనుభవిస్తున్నావా? అని ఉత్ప్రేక్షించి మేలుకొలిపినాడు కవి.

93«; ɯᴇ:

సముద్రుడు విష్ణువునకు మామ. శివుడు కడుంగడు స్నేహితుడు. లక్ష్మీదేవి భార్య, మన్మథుడు కొడుకు. ఈ నాలుగు విషయములను గ్రహించి కవి చమత్కరించినాడు. ఓ విష్ణూ! నీవు మామ ఇంటికిపోతే నీకు మంచినీరు పుట్టదు (సముద్రమంతా ఉప్పునీరేకదా) సముద్రుని అంత కారువాడింకొకడు లేడు. అనగా లోభి. స్నేహితుడుకదా అని శివునివద్దకు పోతే పుర్రెతో భిక్షాటనం చేసి, తోలు ధరించినవాడు నీకేమి అన్నం పెట్టును? నీకేమి బట్టనిచ్చును. ఇక భార్య లక్ష్మి. మాట పట్టింపువస్తే పదిమాటలు మాటలాడి నిన్నువదలి వెళ్లే స్వభావంకలది. ఆమె నిన్ను ఆదరింపదు. (ఇక్కడ భృగుమహర్షి రొమ్మున తన్నినప్పుడు నిందించి భూలోకంలోనికి లేచివచ్చిన కొల్హాపురి లక్ష్మికథను స్మరింపవలెను) ఇక మన్మథుడు పూలబాణాలతో అందరిని హింసపెడతాడు. కనుక కవి వీనిని తలగొట్లమారిగా నూహించి అట్టి తలగొట్లమారి నీకేమి పెట్టునయ్యా? అనినాడు. విష్ణువు ఇంద్రునకు తమ్ముడు. వామనావతారంలో ఉపేంద్రుడను పేరుతో ఇంద్రునకు తమ్ముడైనాడు. ఇంద్రుడు అన్న. అన్నయైన ఇంద్రునివద్దకు పోతే అతనిదొక మేషాండము. ఒక పనికి ఎవరైనా అడ్డుపడితే ఆ అడ్డును మేషాండము అని వ్యవహరించుట కలదు. ఇక్కడ ఇంద్రునదొక మేషాండము. అహల్యా జారత్వము చేత గౌతముడు కోపించి ఇంద్రుని వృషణములు పోవునట్లు శపించెను. అప్పుడు దేవతలు ఇంద్రునికి మేకయొక్క వృషణములు దెచ్చి అతికిరి. అందుచేత ఇంద్రునకున్నది మేషాండము. (ఈ పురాణ కథ ఇచ్చట స్మరింపదగినది) ఆ మేషాండపు వానివద్దకుపోతే వాడేమి ఈయగలడు? ఇక ఇంద్రునివద్ద కామధేను వున్నది. అది చాలా ముసలిదై పండ్లూడిపోయి ఉండును. కనుక ఓ దేవా! ఎక్కడికిపోయినా నీకేమియు లాభంలేదు. హాయిగా ఉన్నచోటనే ఉండి సంపదలు పెంపొందించుకో" అని కవి స్వామికి సలహా ఇచ్చెను. ఇట్టి చమత్కారములతో ఈ శతకము నిండియున్నది. ఇది వ్యాజనిందాలంకారము.

- ఎస్.సిహెచ్.కృష్ణమాచార్యులు

# దేశ భాషలందు తెలుగు లెస్స



"మున్నే కళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం కొన్ని వాసరంబులుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమధను సేవింపబోయి హరివాస రోపవాసం బచ్చట గావింప నప్పణ్యరాత్ర చతుర్థయామంబున...

ఆ. తెలుగుదేలయన్న దేశంబు దెలుగేను
దెలుగు వల్లభుండ దెలుగొకండ
యెల్లనృపులుగొలువ నెఱుగవే బాసాడి
దేశభాషలందు దెలుగు లెస్స

# మిత్రత్రయం



శ్రీ శనగన నరసింహస్వామి



శ్రీ మొవ్వ వృషాద్రిపతి



శ్రీ భల్లం సూర్యనారాయణరాజు

అలనాడు శ్రీరామచంద్రమూర్తికి ముగ్గురు మిత్రులుండేవారు. మొదటి మిత్రుడు - ఋక్షరాజైన జాంబవంతుడు - సాత్వికమైన గుణముగలవాడు; రెండవ మిత్రుడు రజోగుణ సంబంధమైన మిత్రుడు - సుగ్రీవుడు; మూడవ మిత్రుడు - విభీషణుడు. అలాగే శ్రీ పురుషోత్తమకవికి కవిత్రయం అనే ఈ మువ్వురు శ్రీ శనగన నరసింహస్వామి, శ్రీ మొవ్వ వృషాద్రిపతి, శ్రీ భల్లం సూర్యనారాయణరాజు త్రివిధములుగా పురుషోత్తమునిపై వారికిగల భక్తి, ప్రేమ - అనురాగంతో ఆంధ్రనాయక శతక మాధుర్యాన్ని చక్కెరకంటె తీయనైనది, దధిపాకముకంటె మధురమైనది, పెంపెక్కిన తేనెకంటే అతిమధురమైనదని వారి కలములద్వారా మధురమైన అమృతధారలు జాలువారగా వారు పురుషోత్తమునిపై అనన్యమైన భక్తిని వ్యక్తపర్చినారు. వారికి ప్రత్యేక కృతజ్ఞతలు.



అభినందనలతో...

**వి. అంజంరాజు**

# వక్తవ్యం

ఆంధ్రభాషలో వెలసిన ప్రసిద్ధ శతకాలలో ఆంధ్రనాయక శతకానిది ఒక విశిష్టమైన స్థానం. ఈ శతకానికి నాకు తెలిసినంతవరకూ ఎవరూ టీకా తాత్పర్యాలు వ్రాసినట్లులేదు. అందుకే శిష్యమిత్రులు రామరాజుగారూ, పూజ్యులు అంజిరాజుగారూ టీకా తాత్పర్యాలు వ్రాయగోరినపుడు సంతోషంగా అందుకు పూనుకున్నారు.

శ్రీ మదాంధ్ర నాయక శతకం వ్యాజస్తుతి ప్రచురమైన శతకరాజము. వ్యాజస్తుత్యలంకారానికి చంద్రాలోకంలో ఇవ్వబడిన లక్ష్య లక్షణాలు ఇవి.

'ఉక్తిః వ్యాజస్తుతిః నిన్దాస్తుతిభ్యాం స్తుతినిందయోః।
కః స్వర్ధుని! వివేకస్తే నయసే పాపినో దివమ్॥

నిందచేత స్తుతిగాని, స్తుతిచేత నిందగాని తోచునట్లు చెప్పిన యెడల వ్యాజస్తుతి అలంకారమగును.

ఉదా :- పాపాత్ములనుగూడ నీవు స్వర్గమందజేయుచున్నావు. గంగా నీకు వివేకమేది?

ఇట్టి పాపాత్ములకు గూడ స్వర్గప్రాప్తి కలుగజేయుచున్నావు. ఇది అనుచితము అని నింద. ఇది నిందవలె నగపడుచున్నది. ఆలోచింపగా నిందగాదు. పుణ్యాత్ములకు స్వర్గమిచ్చుట గొప్పకాదు. పాపాత్ములకుగూడ స్వర్గము నిచ్చుచున్నదని గంగా ప్రభావాతిశయము కొనియాడబడినది. కనుక నిందయను మిషతో స్తోత్రము చేయబడినది. అందుచే నిది వ్యాజస్తుతి అలంకారము. (శ్రీ అక్కిరాజు ఉమాకాంతం)

జగత్ప్రసిద్ధమైన ఆంధ్రనాయక శతకాన్ని ఇంతవరకూ -

1. వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారు (చెన్నపురి)
2. బాలసరస్వతీ బుక్ డిపో వారు (మద్రాసు)
3. నిర్మలా పబ్లికేషన్స్ వారు (విశాఖపట్నం)
4. నరేంద్రనాథ సాహితీ మండలివారు (తణుకు)

ముద్రించారు. ఇంకా కొందరు ముద్రించి ఉండవచ్చు. తణుకు ప్రతి మాకు లభించలేదు. సంస్కృతాంధ్ర భాషలలో పండితాఖండలులైన శ్రీమాన్ తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులుంగారు ఈ శతకాన్ని సంస్కృతంలోనికి అనువదించి

(సీస పద్యానికి మూడు ఉపజాతి వస్త్రిత్తాలుగా) ప్రకటించారు.

ముద్రితాలైన తెలుగు ప్రతులన్నీ దాదాపు గతానుగతికాలే. సుమారు రెండు శతాబ్దుల క్రితం రచింపబడ్డ ఈ శతకంలోని కొన్ని పద్యభాగాలు దురవగాహాలుకావటం, కొన్నిచోట్ల అనన్వితాలు కావటం వింత. ఇందులో వ్రాయనకాండ్ర చేతి చలువకూడా కొంత ఉండకుండా ఉండదు.

## ముద్రణ దోషాలా?

1వ పద్యంలో 'దరచక్ర ఖడ్గ గదా శరాననహస్త' అనే రెండవ పాదంలో దరకు మారుగా ధర అని కొన్ని ప్రతులలో అచ్చయింది. అది పొరపాటు. దర - శంఖం; ధర - కొండ; ధరా - భూమి.

2వ పద్యం మొదటి పాదంలో వర్ణిత సుత్రామ అనే సమాసానికి వర్ణింపబడిన ఇంద్రుడు కలవాడా అని అర్థం. ఇంద్రునిచేత వర్ణింపబడినవాడా అని కవి ఉద్దేశం కావచ్చు. ఆ పక్షంలో 'వందారు సుత్రామ' అని ఉండటం లెస్స. ఈ పద్యంలోనే 'వర్థిష్ణుకామ' అనే సమాసానికి అర్థం కుదరటంలేదు. వృద్ధిచెందే స్వభావంకల కోర్కెలు కలవాడా అని భావం. 3వ పద్యంలో విజితాశ! అని సంబోధించిన కవి ఇక్కడ ఇలా వ్రాసి ఉంటాడా!

3వ పద్యంలో 'వినుత వేదండ' తప్పు. ఒక ప్రతిలో 'వినతవేదండ' అని ఉన్నది. అది ఒప్పు.

4వ పద్యం మూడవ పాదంలో 'వరేశ' అని ఒక ప్రతిలోను, 'పరేశ' అని మరొక ప్రతిలోను ఉన్నది. 'పరేశ' సముచిత పాఠం. మోక్షానికి (పరలోకానికి) ప్రభువైనవాడా అని అర్థం.

4వ పద్యం ఎత్తుగీతలో అన్ని ప్రతులలోనూ 'పండితస్తోత్ర చారిత్ర' అని ఉన్నది. సంస్కృతానువాదంలో 'పండితస్తుతచారిత్ర' అని ఉన్నది. బహుశా ఆచార్యులవారే సవరించి ఉంటారు.

6వ పద్యం 4వ పాదంలో 'వర్ణితోరస్థ్సలి వైజయంతిక' కౌస్తుభాంతర శ్రీదేవి యందమమర అని ఉన్నది. ఆచార్యులవారి అనువాదంలో మాత్రం 'వక్షస్థ హారత్విషివర్ధితాయాం, సత్ కౌస్తుభాంతఃస్థపయోధిపుత్ర్యా' అని ఉన్నది. 'వర్ధితోరస్థ్సలి' అని సవరించుకుంటే లెస్స.

25వ పద్యం మూడవపాదంలో 'పదియారువేల గోపకుమారికలు' అని ఒక ప్రతిలోనూ, 'భూపకుమారికలు' అని మరొక ప్రతిలోనూ ఉన్నది. హంసలదీవి శతకంలో 'నరకుని చెఱవాపతరుణుల పదియారువేలు నిన్మోహింపనేలినావు'

# శ్రీ విశ్వయోగి విశ్వంజీ



విశ్వకళ్యాణం కోసం అవతరించిన కారణ జన్ముడు శ్రీ విశ్వయోగి విశ్వంజీ. సర్వ మత సమ్మతమైన ప్రేమమతమే ఆయన మతం. మానవులంతా ఆయనవారే. అందరి కష్టాలు ఆయనవే. ఆయన హృదయం విశ్వమంత పెద్దది. ఆ హృదయంలోని కరుణ సముద్రమంత విస్తృతమైనది. కోపమంటే ఏమిటో తెలియని పరమ ప్రశాంతమూర్తి. సత్యం-శివం-సుందరమైన శాశ్వత దివ్యతత్త్వానికి ఆయన తిరుగు లేని ప్రతీక. అజ్ఞాన తిమిరాంధ కారాన్ని అంతంజేసే విజ్ఞాన జ్యోతి ఆయన. ఆయన సర్వజన సమవర్తి. ఆయన బ్రహ్మవేత్త-లోక కళ్యాణం కోసం "ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త"అనే మహామంత్రాన్ని ప్రదానంచేసిన శ్రీ సాయిదత్త.

*విశ్వమందు విభుడు వెలుగొందుచున్నాడు*<br>
*విభునియందు వెలుగు విశ్వమెపుడు*<br>
*విభుడు వెలుగకున్న విశ్వంబు వెలగదు*<br>
*విశ్వ విభుల మైత్రి శాశ్వతంబు*

**నమ సుమాంజలులు, ఎడిటర్, ఆంధ్రబాల**

అని ఉన్నది. పారిజాతపహరణంలో, 'హరి నరకాసురుం గెలిచి యద్దనుజేంద్రుని యింటనున్న యచ్చరల తొలంబువారి' అని ఉన్నది. అయితే లోకంలో 'పదహారువేల గోపికాస్త్రీలు' అనే సంప్రదాయంకూడా ఉన్నది. కాని భాగవతం దశమస్కంధం-ఉత్తరభాగం 206వ పద్యంలో 'పదాఱువేల రాజకన్యలన్' అని పోతనగారు వ్రాశారు. కాబట్టి 'భూపకుమారికలు' అనే పాఠమే సాధువు.

3వ పద్యంలో 'కొక్కెరాయనిబట్టి' (3వ పాదం) అని ముద్రింపబడింది. నిఘంటువులు కొక్కరాయి అనే రూపాన్ని స్వీకరించాయి. చిన్నప్పుడు 'కొక్కిరాయి కాలు విరిగె' అని ఆడపిల్లలు పాడుతుండగా విన్నాను.

37వ పద్యంలో 'అరువదాఱవరసంబులు' అని ఒక ప్రతిలోనూ మఱొక ప్రతిలో 'అఱువదాఱవసరంబులు అనీ అచ్చువేశారు. ఆచార్యులవారు 'షట్ షష్టి భోగాన్ విహితానుపూర్వాన్' అని అనువదించారు. నేను 'అఱువదారగుర సంబులు' అని దిద్దుకున్నాను. ఆ పద్యంలోనే 'పానకంబాలుసాబాలు భక్తులకిచ్చి యెనగును మంగళాధీశ్వరుండు' అని రెండు ప్రతులలో ఉన్నది. అర్థం కుదురలేదు. పానకంబందు సాబాలు అని సవరించాను. తరువాత వావిళ్ల వారి ప్రతి చూడగా అట్లే ఉన్నది. 'హమ్మయ్య' అనుకున్నాను.

49వ పద్యంలో 'నమ్మదురేరీతి నారదునాత్మజు, మానినిఁజేసిన మాయవాని' - అన్ని ప్రతులలోనూ చివరకు ఆచార్యులవారి అనువాదంలోనూ (చక్రే స్త్రియం నారదమాత్మజం యః) ఆత్మజ శబ్దమే ఉన్నది. ఆత్మజుడంటే కొడుకు. నారదుడు నారాయణుడికి మనుమడు కదా. అందుచేత కవి 'ఆత్మజ్ఞ' శబ్దం వాడి ఉంటాడు అని అనుకున్నాను. ఆత్మజ్ఞ అంటే తన్నుదానెఱిగినవాడు (యోగి) అని అర్థం. 52వ పద్యంలో 'తంతెగొట్టు సన్యాసి' అని అన్ని ప్రతులలోనూ ఉన్నది. తంత్రీ - తంతి - వీణ; తంతె - మెట్టు. కాబట్టి తంతి గొట్టు అనేదే సాధురూపం.

68వ పద్యంలో 'తండ్రి మృతుండైన దనరాజ్యమత్తఱి
నేల రాకుండని బేలగలడె?'

రెండు ప్రతులలో ఇలాగే ఉన్నది. తికమకపడ్డాను. ఒక ప్రతిలో మాత్రం రాకుండిన అని ఉన్నది. అర్థం కుదిరింది.

76వ పద్యంలో 'సుమనస్సులమనస్సులమృత వాక్యంబుల
బొసగనాశీర్వదించుటనుజేసి' అని యతిభంగమైన పాఠం కనిపిస్తున్నది. వావిళ్ల ప్రతిలో 'ఆశీర్వచింపుటనుజేసి' అని యతిభంగంలేని పాఠం ఇవ్వబడింది.

80వ పద్యంలో 'చెట్టుమాటొగ్గివేసితివిగాని' - అని అన్ని ప్రతులలోనూ ఇట్లే

ఉన్నది. 'ఏసితివి' అని ఉడాలి. ఏయు - బాణ ప్రయోగంచేయు; కవి 83వ పద్యంలో 'ఖరునాజిలో జొచ్చి శరముచ్చిపోనేయన్ (పోన్, ఏయన్) అనే వాడాడు.

81వ పద్యంలో 'మొసలిఁబెట్టిన కస్తి మొల్లుఁబెట్టిన హస్తి
రక్కరించితినన్న రమ్మమేమి!

మొసలి పదం తరువాత అన్ని ప్రతులలోనూ అరసున్న ఉన్నది. అప్పుడు అన్వయం చెడుతుంది.

82వ పద్యం ఎత్తుగీతి మొదటిపాదంలో ప్రతులన్నిటిలోనూ 'ప్రూనున్నై యుంట గుఱ్ఱపు మనిసి వంట' అని ఉన్నది. పై పాదాలలో కవి పాటించిన క్రమాన్నిబట్టి 'మనిసిపోటు' అని ఉండాలి. 'స్థాణుత్వసక్తిః నరవాజితాస్తిః అని ఆచార్యులవారు. బుద్ధకల్కి అవతారాలు ఈ పద్యంలో వర్ణింపబడ్డాయి. ప్రూనువైయుంట - ఈ సందర్భంలో 81 పద్యాన్ని స్మరించాలి. దశావతారాలలో బుద్ధుడికీ, చారిత్రక బుద్ధుడికీ సంబంధంలేదు. దశావతారాలలో ఒక అవతారమైన బుద్ధుడు -

"త్రిపురకాంతల శీలంబులపహరింప
బుద్ధవేషంబు గైకొన్న పోకలాడు" - కాశీఖండం, 6వ ఆ. 72వ పద్యం.

బుద్ధావతరాన్ని గురించి నాకు స్పష్టమైన వృత్తాంతం దొరకలేదు. ధరణిదేవుల రామయమంత్రి దశావతార చరిత్రమనే కావ్యంలో బుద్ధుడు అశ్వత్థరూపం ధరించినట్లున్నూ, త్రిపురాసురుల కాంతలు వ్రతరీత్యా ఆ ప్రూనును కౌగలించుకొన్నట్లునూ తత్ఫలితంగా వారి పాతివ్రత్యం చెడి వారి పతుల వధ సాధ్యమైనట్లున్నూ నాకు గుర్తున్న కథ. ఆ ప్రకారం 81 పద్యం పరపురుషాకృతి గుఱుతుగా జూపక, త్రిపుర పతివ్రతా తిలకములను, విటపియుక్తి భ్రమించి విఫల భ్రమతజేసి - అనే పద్యభాగానికి నేను వ్రాసిన అర్థమూ, గుఱుతుగా జూడని అని నేను చేసిన సవరణా అవిచార రమణీయాలు కావచ్చు.

83వ పద్యం 'ఖరునాజి'లో జొచ్చి శరముచ్చిపోనేయ
వెనుకకు లంఘించి వెలిచెననిరి"

తరువాతి పాదాలలోని ఏయన్, ఉన్నన్, యాచింపన్ - క్రియారూపాలనుబట్టి లంఘింపన్ అని ఉంటేనే అర్థం నలిపడుతుంది. ఉచ్చిపోనేయన్ - శరీరమును చీల్చేటట్లుగా; ఉచ్చి - బ్రహ్మరంధ్రమనే అర్థంకూడా ఉన్నది. 'ఖరమూర్ధరంధ్రే' అని ఆచార్యులవారి అనువాదం. ఏమైనా ఈ పాదంలోని పదాలకు అన్వయం క్లిష్టం. ఈ కథాంశానికి రామాయణం అరణ్యకాండం (30వ సర్గ) చూడాలి.

"స విముక్తో మహాబాణో, నిర్ఘాత సమనిస్వనః ।
రామేణధనురాయమ్య ఖరస్యోరసి చాపతత్ - 26వ శ్లో.

(అట్లు అమ్మహో బాణము రామునిచే నాకర్ణాంతము ధనువు నాకర్షించి విడువబడి పిడుగుపడినట్లు మహాధ్వని గదుర ఖరుని వక్షస్థలంబుఁజొచ్చెను) రామాయణాన్నిబట్టి రాముని బాణం ఖరాసురుని వక్షాన్ని చీల్చింది, అంతేకాని బ్రహ్మరంధ్రాన్ని చీల్చుకుంటూ పోలేదనేది స్పష్టంకదా.

౨౨వ పద్యంలో అన్ని ప్రతులలోనూ 'అలగాపరి' అని ఉన్నది. 'అలకాపరి' అని ఉండాలి.

౨౨వ పద్యంలో అన్ని ప్రతులలోనూ 'నగరి'లో అనురూపమే ఉన్నది. నగరి - పట్టణం; నగరు - రాజగృహం. నగరు పాఠమే సముచితం. (చూ. అలవైకుంఠపురంబులో నగరులో - గజేంద్రమోక్షం, ౩౨వ పద్యం)

౧౦౨వ పద్యంలో 'కరిరాజుఁబ్రోవ నిందిర రహస్య
కేళిసంహర్షితాంతరంగికుడవయ్యు
రమనుజే కొని వేంచేయు అవ్వయేమి?

ఇందిర, రమ అని రెండుసార్లు కవి వ్రాసియుండడు. ఇందిరకు మారు మందిర అని సవరించుకుంటే సరిపోతుంది. అంతేకాదు సామాసిక దోషం కూడా తొలగిపోతుంది.

౧౦౩వ పద్యంలో "ఆగామిసంచితప్రారబ్ధములటుండ,
నిజజన్మమందునే నెల్లవేళ -

ఇక్కడ యతిభంగం. ఈ జన్మమందు అని దిద్దాను.

## శతక మకుటం : అర్థ నిర్ణయం

1. ఆచార్యులవారు మకుటంలోని 'హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ'! అనే భాగాన్ని తమ సంస్కృతానువాదంలో 'హృతవిమతజీవ' అని సవరించారు. హృత - హరింపబడిన శత్రువుల ప్రాణాలు కలవాడా అని అర్థం.
2. రాళ్లబండి కవితాప్రసాద్‌గారు (అష్టదశావధాని) - చిత్రచిత్ర ప్రభావ - చిత్రవిచిత్రములైన ప్రభావములు చూపగలవాడ; దాక్షిణ్యభావ - దాక్షిణ్యమను భావముగలవాడా! హత, విమత జీవ - (విమతులు అనగా వికలమైన మనస్సులుగలవారిని నశింపజేయగలవాడ! శ్రీకాకుళాంధ్రదేవ - శ్రీకాకుళ ప్రాంతమందు ఆంధ్ర విష్ణువా! అని అర్థవివరణ చేశారు.
3. ఒకరు హతవిమతజీవ - చంపబడిన శత్రువుల ప్రాణాలు నీలో విలీనం చేసుకున్నవాడా! అని అర్థనిర్ణయం చేసినట్లు గుర్తు.
4. ఇక, నేను - హత - చంపబడిన, విమత - శత్రువులయొక్క, జీవ - ప్రాణములు కలవాడా (శత్రువులను సంహరించినవాడా) అని అర్థం వ్రాశాను. 'హత'

కంటె 'హృత' సాధుతమమేకాని తెలుగులో యతి చెడుతుందికదా.

28వ పద్యం : "నీ వనన్య కృతాది నిబిడ మాయావిధా
నులఁజేయుదెవ్వరిఁ దొలఁగ నీక"

ఒక ప్రతిలో నీ వనన్యకృతాతి (కృత  అతి) నిబిడ అని ఉన్నది. అతి అర్థవంతం.

37వ పద్యం : "మూర్తిమంతంబుఁ జూవక కీర్తిగలదె"

మూర్తిమత్వంబు అని ఉండాలి.

మూర్తిమత్వము - గొప్పతనం; మహత్వం

ఆచార్యులవారు 'ప్రభావమ్' అని అనువదించారు.

45వ పద్యం - "వేదాంత సత్కృదచుంబితల మంత్రావర్ణ
నల గుహలుండి రానలవిగాదొ॥"

వావిళ్లవారి ప్రతిలో 'గుహ' నుండి అని ఉన్నది. అదే సాధు పాఠం. ఆచార్యులవారు 'గుహాంతరాత్' అని అనువదించారు.

57వ పద్యం : "విషపుంజమనక నాభీలాజగరజిహ్వ,
జింపెదో ప్రాబల్వఁజింపినట్లు"

## కొన్ని విశేషాలు

61. హిరణ్యాక్షునికి భయపడి పందివై
ఇలమీద దాగినావు. అతడు
పాతాళమునకు గూడా రావటంతో
తప్పించుకోవటానికి వీలులేక
ఎదుర్కొని చంపినావు
అంతేకాని నిజంగా నీవు
పరాక్రమశాలివికాదని చమత్కారం.

75. అడవిలో తనకందినవారిని
మాత్రమే తాటకి భక్షించింది. అంతేకాని
ఊళ్లమీదపడి ఎవరిని తినలేదుకదా.
ఉదరపూరణ ఎవరికైనా అనివార్యమే.
ఆమె స్త్రీ. స్త్రీ దోషం చేసినా పెద్దలు అవధ్య అన్నారు. పైగా నీవు ఆమె రాజ్యంలో ప్రవేశించావు. అన్యాయంగా, ఆడుదానిని చంపావు అని భావం.

89. పరపురుషుడనే భావం కలుగనీకుండా త్రిపురాసురుల
భార్యల విలువును అపహరించాలని చూశావు. అది సాధ్యంకాక, ఆయుధానీకాన్ని సమకూర్చి రుద్రునిచేత చంపించావు అని సమర్థన.

71. "వెనుకంజ వైచిన విడువకపైకిరా
నరుదుగా ఖలుతలఁదఱిగినావు"
నీవు ఖరాసురునితోడి యుద్ధంలో జంకి వెనుకంజ వేశావు. అయినా ఖరుడు నిన్ను విడిచిపెట్టకుండా నీపైకి రావటంతో ప్రాణరక్షణకోసం ఖరుణ్ణి వధించావేతప్ప నీకు నిజంగా రోసంలేదని భావం. రాముడు వెనుకంజవేయడాన్ని ఈ పద్యంలో గేలి చేసిన కవి,
'ఖరునాజిలోఁజొచ్చి శరముచ్చి పోనేయ
వెనుకకు లంఘింప వెలిఁచెననిరి' - అని సమర్థించాడు.
52. వెలిపొఁప పొన్నుపై వేడ్కతోఁ బవళింతు
వదియేమి భోగిభోగాంతరంబు?
తెల్లని పాముమీద వేడ్కతో బవళిస్తావు. అదికూడా భోగుల భోగాలలో నొక భోగమా యేమిటి? అదేమి భోగమయ్యా బాబు అని ఎగతాళి.
88. 'నినుఁజూచి వేడ్కనొందిన గర్వముగనెంచి
నిండీ పాలెడునేలు నిలుపవలెనె'
ఆయేలు యమున. బలరాముని ఆజ్ఞను తిరస్కరించింది. అంతేకాని చూచి వేడ్క నొందలేదు. కారణాన్నిమార్చి గేలిచేశాడు కవి. అలాగే
"చెలికానివలె నొద్దఁజేరి యెత్తుకొనంగ
గినుకఁప్రలంబునిఁదునుమవలెనె?
అనీ
అలాగే - 77వ పద్యంలో
నడువజాలదని జానకి నెత్తుకొని ముందు
నడచు విరాధుని నఱకుటేమి - అని చమత్కరించాడు.
63వ పద్యంలో
'కశ్యపుడదితినిన్గన్న వారలుగారె
పెంచిరే మరుగుజ్జు బిడ్డవనుచు -
అదితి కశ్యపులు మరుగుజ్జు బిడ్డ వీడు అని జాలిగొని నిన్ను పెంచలేదు. అసహ్యపడి నిన్ను విడిచిపెట్టారు. అందుకే యాచకుడవై బలి దగ్గరకు జేరావు. దేవతల తల్లిదండ్రులైన అదితి కశ్యపుల బిడ్డకు అడుక్కోవలసిన దుఃస్థితి యేమిటి అని చమత్కరించాడు.
38. చేప, తాబేలు, పంది, వీటికిగూడ పౌరుషముంటుంది. సగం సింగం, సగం నరుడైన వానికి, పొట్టివానికి, బాపనికి, పిల్లజుట్టు దొరకూ, కడకు మునలివాడికి గూడా రోషముంటుంది. ఆలోచింపగా నీవు పిఱికివాడవు (గొల్లవాడవు). మత్స్యకూర్మవరాహ ఇత్యాది అవతారాల్లో నీవు పౌరుషం

చూపించావు. కృష్ణావతారంలో నీవు ఆభీరుడవు అంటే గోపాలకుడవుకదా ఇంకేమి పౌరుషం చూపిస్తావు. ఇక కలికి (స్త్రీ) అవతారంలో అస చూపించలేవుకదా అని చమత్కారం.

## అర్థంకానివీ, అనన్వితాలూ

ఇక నాకు సరిగా అర్థంకానివి, అనన్వితాలుగా ఉన్న భాగాలు :

౭7వ పద్యం : "అఖిలలోక స్థాపనాచార్య మణివయ్యు
నిజభక్తగురునిచే నిలుపుకొన్న

౭5వ పద్యం : "స్థిరత లోలోన నిక్షేపించు ధనము నెం
చఁగరాని దొకరిఁజే చావవలెనె?
పంటపైరుల కాఁవు కంటఁగాయుచునుండు
కోరికఁబెఱసొమ్ము గొనఁగవలెనె?

88వ పద్యం : "నిన్నెదుర్కొనరాని నెపమునఁగోపించి
కోపితహితు సూతుఁగొట్టవలెనె"

పరరాజ్యకాంక్షలోఁబట్టకుండెదవైన అనే 78వ పద్యం ఎంతో శ్రమపెట్టింది. అయినా శ్రమకు తగిన ఫలితం దక్కనేలేదు. అందులోనూ 'పరయోషపైనిచ్ఛఁబాయకుండెదవైన
నలశూర్పణఖముక్కు నిలుపరాదె - మరీ తికమకపెట్టింది. అలాగే

101వ పద్యం : "సాటించు నా సర్వసైన్యంబులనిఁగర్వు
చే శక్తి నరుసేయఁజెప్పినారె?"

౭౭వ పద్యం : "రామమూర్తికి వాంఛేతర ప్రపంచ
మేమిగావలె లీలార్థమింతెకాని

8౭వ పద్యం : "పరపురుషాకృతి గుఱుతుగాఁజూడక
త్రిపుర పతివ్రతా తిలకములను
విటపయుక్తి భ్రమించి విఫల భ్రమతఁజేసి
"వేదాంత సత్కృత చుంబితల మంత్రావర్ణ
నల గుహాలుండి రానలవిగాదొ     అలాగే -

14వ పద్యం : "తగునట్లు తిరుమేను తానామతింపుచు
మిన్న పీతాంబరం బున్నదనుచు"

83వ పద్యం : "బలినిఁజంపగరాని వరమున యాచింప
వృత్తినాతని భిక్షమెత్తెననిరి"

83. గరుడధ్వజుండన్న గుఱుతుఁదెల్పుటకున్న
బలభీతి శస్త్రాహిబద్ధుఁడనిరి - ఇందు 'బలభీతి' నాకు అర్థం కాలేదు.

౪౹. రక్కరించితినన్న రమ్యమేమి

౬౹. అదియేమి రక్కరింపు

రక్కరించు పదం నిఘంటువులో మృగ్యం. సందర్భాన్నిబట్టి రక్షించు అని అర్థం వ్రాయబడింది.

15వ పద్యం 'లోకాలోకములయందు కవిహృదయం స్పష్టంకాలేదు. ఈ పద్యంలోనే 'పరిపాటి' అనే పదం 'నగుబాటు' అనే అర్థంలో వాడబడింది. నిఘంటువులు ఈ అర్థాన్ని చెప్పలేదు.

౨౦వ పద్యం : పగవాడు పుటిలోఁబట్టి నెత్తుకపోవఁ
దమకించుచున్న నీ ధైర్యమేమి?

తమకించు : త్వరపడు, చలించు అని నిఘంటువు. కవి ఆలసించు అనే అర్థంలో వాడినట్లున్నది.

౨౩వ పద్యం : "మాటమాత్రంబైన మగువ నోరాపదు
గుడువఁబెట్టునె తలకొట్లమారి"

మొదటిపాదంలో మామ సముద్రుణ్ణి, రెండవ పాదంలో చెలికాడు శివుణ్ణి, నాల్గవ పాదంలో అన్న ఇంద్రుణ్ణి వర్ణించాడు. అందుచేత మూడవ పాదంలో మగువ (భార్య)ను మాత్రమే వర్ణించాడని చెప్పకోవాలి.

మగువ, లక్ష్మి అని చెప్పకుంటే క్రమం చెడుతోందికూడాను. పాదానికి ఒకరివంతున వర్ణించాడు. మఱొక ప్రతిలో కొడుకు పెట్టునె తలకొట్లమారి అని ఉన్నది. ఈ కొడుకు బ్రహ్మయా? మన్మథుడా? మగువ సరస్వతియా? రతిదేవియా? తలకొట్లమారి బ్రహ్మయా, మన్మథుడా? ఈ భాగానికి ఆచార్యులవారి సంస్కృతానువాదం ఇలా ఉన్నది.

"కరోతియోషా వచనం నకించిత్
కిం సర్వబాధీ తనయః ప్రదత్తే
ముఖే నిగృహేత్ వచనం న యోషా
సమర్పయేత్తాం భవతే కిమేషః"

ఒకే భాగాన్ని రెండు రకాలుగా అనువదించారు.

"అన్నది మేషాండమున్నదిచ్చేదొక్క
తొట్టిగొడ్డది నీకుఁదోలునేమి" - అనే నాల్గవ పాదాన్ని అనువదించకుండా వదలివేశారు.

## ఆచార్యులవారి సంస్కృతానువాదం

78. "పరరాజ్య కాంక్షలోఁబట్టకుండెద, వైన
సుగ్రీవు నగరంబుఁజూడరాదె?
పరధనంబున కొనపడక యుండెద, వైన

నాలంక నొకటాయి యంటరాదె?
పరయోషపై నిచ్చఁబాయకుండెద, వైన
నలశూర్పణఖ ముక్కు నిలుపరాదె?
పరదానవులఁ ద్రుంపఁబంతగించెద, వైన
మూల దైత్యులఁదోలివుచ్చరాదె?
చేసిన ప్రతిజ్ఞలో నొండు వీసమైన
దప్పవోకుండ నడచిన ధార్మికుఁడవొ ॥చిత్ర॥

అనువాదం :

"న కాంక్ష్యతే యద్యపి శత్రురాజ్యం కుతో న
సుగ్రీవపురీ విలోక్యా
న లోభనీయం యదితే పరస్వం, స్పృశ్యా
కి మేకా నఖిలాధిలంకామ్,
పరస్త్రియాం యద్యపితే న వాంఛా
స్థాప్యా నకిం శూర్పణఖా సనాసా
ప్రతి శ్రుతేంద్రారివధో భవాన్ చేత్,
విద్రావణీయాః కిము మూలదైత్యాః
కిం త్వం ప్రతిజ్ఞాతపథాన్ను
రేఖా మాత్రేణ ధర్మే న పరిచ్యుతోసి"

14. తగునట్లు తిరుమేను తానా మతింపుచు
మిన్న పీతాంబరంబున్నదనుచు -
గమలతోఁబుట్టిన కౌస్తుభం బదిపోవఁ
దక్కు సొమ్మది నీకు దక్కెననుచు -
లలితరత్నద్యుతి మొలచినట్లు కిరీట
ముత్తమాంగముఁబాయకున్న దనుచు -
పండితమాణిక్య కుండలంబులు కర్ణ
యుగళితోఁబుట్టినట్లున్నవనుచు-
నిండుకొన్నావు గడియించునేరుపరివె
ప్రావలువ ప్రోరువాణముల్ బ్రాతి
యేమి? ॥చిత్ర॥

"పీతాంబరేణావృతవక్షసం స్వాం
సంభావయన్ ప్రాప్తసువర్ణకాంతిమ్।
లక్ష్మీసహోద్భూతమణౌ ప్రనష్టే
భూషాన్తరాలంకృతవత్ ప్రహృష్యన్॥

అనర్ఘరత్న స్థగితం కిరీటం నిజోత్తమాంగ
స్థమితి ప్రతుష్యన్!
కర్ణద్వయం సద్యుతికుండలాభ్యాం
సహోదితాభ్యామితి మన్యమానః"
సమృద్ధిమానః జనదక్షిణశ్చ
కింతే పురాణైర్వసనైర్ధనైశ్చ"
45. "ఆదియోగ్యంతరంగా లానబంధంబు
వదలించుకొన నీకు వశముగాదో" - ఇత్యాది
"త్వమాదియోగీశ్వర చిత్తతః కిమ్
వేదాంత దుర్వేశ గుహాంతరాత్ కిమ్
నిర్గంతుమప్యస్తి భవాన్నదక్షః
ముహూర్త యామార్ధమితంచ కాలమ్
అతీత శక్నోషి నవక్తి తుం కిమ్।
అసజ్జన క్రూర మనః కుమార్గే
దధాసి పాదం న కదాపి కిం త్వమ్॥
కింహేతు కో యం భవతో విలంబః
సమస్త జంతూద్ధరణోచితస్య"
౪౨. పరపురుషాకృతి గురుతుగాఁజూడక
త్రిపుర పతివ్రతా తిలకములను
విటపయుక్తి భ్రమించి విఫల భ్రమతఁజేసి
తత్సతీపతుల దుర్దాంతబలుల
హతము సేయించితివి -
అనువాదం :
అదృష్ట భర్తృస్య నరాకృతీః తాః
పురత్రయాధీశ సతీః విలోక్య
విలుప్తధైర్యో విటవత్ తదర్థే
వంధ్య ప్రయత్నః ధృతవైరిభావః॥
ఆచార్యులవారి అనువాదం ప్రకారం చూడక - అనే పదాన్ని చూడని అని
సవరించుకోవాలి.
౫౨. "స్థిరత లోలోన నిక్షేపించు ధనము నెం
చఁగ రాని దొకరిఁ జేచాపవలెనె?
పంటపైరులకాఁపు కంటగాయుచునుండు
కోలికఁబెలుసొమ్ము గొనఁగవలెనె?

అనువాదం :

"స్త్రైణ సంగుప్త మహోధనః త్వం।
కిం సారయేః అన్యజనే స్వపాణిమ్॥
సంత్రాయనే త్వం కృషికస్య సస్యం।"

౭౭. "అఖిలలోకస్థాపనాచార్య మణివయ్యు
నిజభక్త గురునిచే నిలుపుకొన్న"

అనువాదం :

"అశేషలోకస్థితిహేతుభూతో
ప్యాత్మాశ్రితం యో గురుమేవ మేనే।"

౧౦౧. "సాటించు నా సర్వసైన్యంబులని(గర్ణు
చేశక్తి నరునేయ(జెప్పినారెగ?"

అనువాదం :

"కర్ణేన శక్త్యా ప్రహృతిర్నరస్య
కిం ఘోషితా సిద్ధదనీకసంఘైః

౪౪. "నిన్నెదుర్కొనరాని నెపమున(గోపించి
కోపిత హితుసూతు(గొట్టవలెనె?

అనువాదం :

"ప్రత్యుద్గమాభావ మిషేణ రుష్టః
కిం క్రుద్ధ మిత్రస్య జఘన్య సూతమ్"

౭౨. "పరువు గలవా(డేమి ప్రాంబల్కులందు(
దెలియ వరిముక్కు ముల్లంత గలవొలేవొ

అనువాదం :

"కింతే ప్రతిష్ఠానిగమేషు యస్య
నీవారశూక ప్రతిమత్వముక్తమ్।

౩౩. "గొప్పలో గొప్పవాడవు, కొలదిలోన(
గొలదివా(డవు నిన్నెట్లు గొలువవచ్చు"

అనువాదం :

"మహాన్ మహాత్ స్వల్పత మేషుచాల్పః
ఆరాధనీయోసి కథం జగత్యామ్।

౭౭. 'కడలేని నుడువులు'
'అనంతోవై వేదాః, అణోరణీయాన్ మహతో మహీయాన్ - ప్రభృతి ఉపనిషత్ సూక్తులను కవి సందర్భోచితంగా ఉపయోగించుకొన్నాడు.

## మరికొన్ని విశేషాలు

౩౪. 'డీకొన్న నడవి పందికిఁగల్గరోసంబు' - అన్ని ప్రతులలోనూ 'డీకొన్న' అనే ఉన్నది. 'దీకొను' అనేది రూపాంతరం. డీకొన్న అని అనుకుంటే భ్రాంతికి అవకాశం ఉండదు.

౧౬. 'కీర్తి నిందగ వర్ణించి గెలిపఱతు'. వావిళ్ల ప్రతిలో 'కీర్తి నిండగ' అనియున్నది.

౩౨. "నరరథాశ్వముల సంగరవీథిఁదోలునాఁడు"
ఇక్కడ వావిళ్ల ప్రతిలో 'నర'కు బదులు 'వర' అని ఉన్నది. 'రణాంగణే పార్థరథాశ్వచోదీ' అని ఆచార్యువారి అనువాదం. 'నర' పదమే సందర్భోచితం.

౮౪. "పంక్తికంఠాత్మజ ఫణిరాజబంధమోచనుడవై" - మోచితుడవై అని ఉండాలి. 'త్వం పంక్తి కంఠాత్మజసర్వబాధాత్ నిర్ముక్తరాసీః' అని సంస్కృతం.

౭౨. 'కులము బ్రహ్మణ్యమగు దైత్యకులము' అని అర్థం.
బ్రహ్మణ్యము - బ్రాహ్మణులకు హితమైనది. రావణాది దైత్యులు బ్రాహ్మణ కులమువారనే అర్థంలో కవి ప్రయోగించాడు. 'సురారీన్ జననేన విప్రాన్' అని సంస్కృతం.

౭౫. 'గడ్డికఱచు' - ఓడుట అని అర్థం. చమత్కారం ఊహించునది.

౭౬. 'సుమనస్కులు' - దేవతలని కవి ఉద్దేశం. సుమనస్సులు అని ఉండాలి. కవి అట్లే వ్రాసెనేమో. అమనస్కులకోసం సుమనస్కులని శబ్దాలంకార ప్రీతితో స్వతంత్రించి వాడెనో. సుమనస్సులని చదువుకొన్నా ఛందస్సు సరిపోతుంది.

౬౨. 'భగ్గురనంగ' అన్ని ప్రతులలోనూ అలాగే ఉన్నది. 'బగ్గుమనంగ' అని ఉండటం లెస్స.

౬౪. 'గండ్రగొడ్డలి' కాదు. గండగొడ్డలి. కాని వ్యవహారంలో గండ్రగొడ్డలి అనే అంటారు.

౬౮. 'మూర్ఛించి' - వ్యావహారికమా? పూర్వకవి ప్రయోగం మృగ్యం.

౬౧. 'మొక్కరించు' - నిఘంటువులలోలేదు. మొక్కలించు (ఉత్సహించు, పూను, ఔద్ధత్యం చూపు) శబ్దం ఉన్నది.
పురుషోత్తమకవి వాడిన పదాలు కొన్ని నిఘంటువునకెక్కవలసియున్నది.

౫౪. 'పుట్టుకమాలిన' - భగవంతుడు అభవుడు (పుట్టుకలేనివాడు) అని చమత్కృతి.

౫. 'శ్రీకాకుళము హత వ్యాకులంబు'
హత వ్యాకులంబు - వ్యాకరణ సాధ్యంకాదు. 'వ్యాకులతాపహారి' అని ఆచార్యులవారి అనువాదం.

౯౩. "మాటమాత్రంబైన మగువనోరాపదు
గుడువఁబెట్టునె తలకొట్లమారి"

ఆడవాళ్ల నోట నువ్వుగింజ నానదు. పైగా నీ భార్య లక్ష్మీదేవి. అంటే ధనదేవత. చంచల. అందుచేత లోకులమధ్య కలహాలు కల్పిస్తుంది. ఆమె దగ్గరకు వెళ్లకు (శ్రీకాకుళంలో అమ్మవారు వేరేదేవాలయంలో ఉంటుంది. నీకు వండిపెట్టటానికి ఆమెకు తీరిక యెక్కడుంటుంది? అని కవి హృదయమా?

ఒక్క నిమిషంకూడా స్త్రీ నోరు ఊరుకోదు. ఎప్పడూ వాగుతూనే ఉంటుంది. నీకు వండిపెట్టటానికి నీ భార్యకు తీరనే తీరదు. అనికూడా భావం చెప్పకోవచ్చునేమో.

'తలకొట్లమారి' పదానికి 'జగడగొండి' అని నిఘంటువులలో అర్థం ఇవ్వబడింది.

21. ఎరుసు - నిఘంటువులిచ్చిన అర్థం ఈర్ష్య. 'గౌరవహీనత' అనే అర్థంలో కవి ప్రయోగించాడు. వ్యవహారంలో దాదాపు ఇదే అర్థంలో వాడబడుతున్నది.

38. "నాగలి రోకలన్నకు నిచ్చి శంఖాది
పంచాయుధము లీవు పట్టినావు"

58. "నీరు పట్టుగ నుంట నారాయణుడవంద్రు
నారాయణాఖ్యాధికారమేమి"

ఇత్యాదిగాగల కొన్ని పద్యాలలో నింద పరిస్ఫుటంగా ఉన్నా, స్తుతి అందీఅందనట్లుగా ఉన్నది. కొంచెం ఆలోచిస్తే చాలా పద్యాలలోని నిందాస్తుతి సుధారసాన్ని దోసిళ్లకొద్దీ త్రాగవచ్చు

77. "నడువఁజాలదని జానకినెత్తుకొని ముందు
నడచు విరాధుని నఱకుటేమి? - ఇత్యాది పద్యంలో కారణాలు కానివానిని కారణాలుగా చెప్పి విరాధుడు మొదలైనవారు నీయెడ అపరాధం చేయలేదనీ, నిజంగా అపరాధమే చేస్తే వారికి ముక్తి ఎందుకు ఇచ్చావనీ గడుసుగా దేవుణ్ణి ప్రశ్నిస్తాడు కవి.

97వ పద్యంలో- 'హర చతుర్ముఖదేవతా గోచరుడవయ్యు
నెప్పడు దర్శనంబిచ్చుచున్న' అనే పాదాన్ని ఆచార్యులవారు,

'యః స్ర ష్టృ శూల్యాది సురైక దృశ్యో
దత్తే సదా దర్శనమాత్మనీనమ్' - అని అనువదించారు.

హరచతుర్ముఖ దేవతలకు కూడా నీవు అగోచరుడవు అని కవి భావం. హరచతుర్ముఖాది సురలకు మాత్రమే నీవు గోచరిస్తావు. ఇతరులకు నీవు గోచరింపవు అని అనువాద భావం.

# విజ్ఞప్తి

అన్వయం సరిగ్గా కుదరని భాగాలకు అన్వయం ఎట్లో సరిపెట్టటానికి ప్రయత్నించాను. గ్రంథం మూడువంతులు అచ్చయిన తరువాత ఆచార్యులవారి అనువాదం చేతికి వచ్చింది. మిగిలిన భాగానికి టీకాతాత్పర్యాలు వ్రాసేటప్పుడు సందేహం వచ్చినచోట ఆచార్యులవారి తోడ్పాటు పొందగలిగాను. ఆచార్యులవారు చాలావరకు మూలానుసారిగానే అనువదించినా బలభీతి (83) మొదలైన పదాలను అనువదించకుండా వదలివేయక తప్పలేదు.

'పంటపైరులకాఁపు కంటఁగాయుచునుండు' (95)

మొదలగుచోట్ల కవిహృదయాన్ని నేను గుర్తించినట్లే అర్థం వ్రాశాను.

ఆంధ్రనాయక శతకం సారమతిన్ కవీంద్రులులో నారసిమేలు అనదగిన కృతి. అట్టి శతక రత్నానికి యథాశక్తి టీకాతాత్పర్య విశేషాలు సంతరించాను. సంస్కృతానువాదముఖంగా ధైర్యస్థైర్యాలను ప్రసాదించి నా ప్రారంభాన్ని ఆశీర్వదించిన కీ.శే. శ్రీమాన్ వరదాచార్యులవారికి నమోవాకాలు.

నా రచనలో ఎన్నో దోషాలు ఉన్నమాట సుష్పష్టం. రసజ్ఞులైన పండితులువాటిని తెలిపితే రెండవ ముద్రణలో సవరించుకోగలనని సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్'

పట్టుపట్టి నాచేత నొక మంచి పనిచేయించిన క్షమాశీలి, క్షాత్రమూర్తి, సాహిత్యవ్రతి సుహృన్మణి శ్రీ అంజంరాజుగారికి అక్షరసుమనోంజలి.



- శనగన నరసింహస్వామి
విశ్రాంత ఆంధ్రశాఖాధ్యక్షులు
ఆంధ్ర లయోలా కళాశాల
విజయవాడ - 520 008

# మానసబోధ శతకం - కర్తృత్వం

'శతకమొకటి మనసా హరిపాదములాశ్రయించవె' యని యల్లినాడ, అని పురుషోత్తమకవి స్వయంగా చెప్పకున్నాడు. (అం.నా.08). తాడేపల్లి పానకాలరాయ కవి కృతమైన మానసబోధ శతకమొకటి మనసా హరిపాదములాశ్రయింపుమా అనే మకుటంతో ముద్రితమై లభిస్తున్నది. ఈ పానకాలరాయకవి 'శ్రీహరి పదమ్ములు కోరి భజించు చిత్తమా!' అనే మకుటంతో మఱొక శతకం వ్రాశాడు. ఒకే విషయంపై ఒకే కవి రెండు శతకాలు వ్రాసియుండునా?

'ప్రభువులిద్దరు వస్త్రదానమునీకున్న
దెచ్చియిచ్చిన చాకిమెచ్చలేదా' - (అం.నా.35)

బలరామకృష్ణులకు మధురలో వలువలు ఇచ్చిన వాడు సాలెవాడు. చాకలికాదు. కవి భ్రాంతిపడ్డారు. ఈ పొరపాటు హంసలదీవి గోపాల శతకంలో కూడా దొరలింది.

'రజకుడు శుభ్రవస్త్రముల గట్టగనిచ్చి
ఇహపరసౌఖ్యంబులిరవు గాంచె' - (7వ పద్యం)

తాడేపల్లి కవి, మానసబోధ శతకంలోకూడా, 'వలువలొసంగి చాకలియు... వాయక సద్గతిగాంచినట్లు' (34వ పద్యం) అని రజకుడే వలువలిచ్చినట్లు చెప్పబడింది. మఱొకచోట, 'ఉడుతకుగల్గె ముక్తి' అనే పద్యంలో (86) 'వాయకుండు (నేతగాడు) మేల్ వడసెను' అని భాగవతంలో ఉన్నట్లే పేర్కొబడింది. రామకృష్ణులకు వలువలిచ్చినవాడు ఒకే కవి ఒకే గ్రంథంలో రజకుడని ఒకచోట, వాయకుడని మఱొకచోట వ్రాయటం చిత్రంగా ఉన్నది. టీకాతాత్పర్యకర్త పూర్వపద్యానికి అనుగుణంగా వాయక శబ్దానికి చాకలి అని అర్థం వ్రాయటం మరీ వింత.

'అప్పనంబులు గొను నఖిలదిగ్ మండలే
శ్వరులచే వేంకటాచల నివాసుడు' - (అం.నా.37)

అనే పానకాల రాయని శతకంలోని,

"తిరుమలలో ప్రభాతవిధిదీర్చి నీలగిరిన్ భుజించి తే
నరిగిరి చందనంబలది చల్లని దాహము మంగళాద్రిలో
గురురుచిద్రావి రంగపురిగోములతో బవళించునట్టి యా
నరమునిసేర నీవు మనసా హరిపాదములాశ్రయింపుమా! - 79

పద్యానికి విషయసామ్యం సుస్పష్టం. భావి పరిశోధకులకు సత్యదర్శనమగుగాక!

- శనగన నరసింహస్వామి

"పానకాల రాయకవి చిత్తబోధ శతకము వ్రాసెనుగదా. ఇక మానసబోధ శతకమేల వ్రాయవలసి వచ్చెను? పురుషోత్తమ కృతికే యెవరేని కర్తృత్వము మార్చిరోయని మేమూహించుచున్నారము. లేక పురుషోత్తముని మానసబోధ శతకమంతరించినదేమో! నిశ్చయమెఱుంగరాదు.

- శేషాద్రిరమణ కవులు

1. "తెలుగు పలుకుబడిలోని మెలకువలు, తీరుతీయాలూ, కారకపై చిత్రీ ఇతనికి బాగా తెలుసు. వ్యాజస్తుతికేకాక, భక్తిప్రపత్తికీ పరాంకోటికెక్కిన ఈ శతకంలో భాగవతంలోని కథలనీ బంగారంలో రత్నాల్లా పొదగబడ్డాయి. భక్తిప్రధానాలూ, నిందాస్తుతి పదాలు అయిన రచనలు ఎన్నయినా ఉండవచ్చుగాని ఇలాంటి శతకం చాలా అరుదనే చెప్పాలి"

- యార్లగడ్డ బాలగంగాధరరావు

2. "కాసుల పురుషోత్తముఁడు గట్టిన పద్దెములెల్ల భక్తికావాసములు"

- తిరుపతి వేంకటకవులు

3. 'దేనికైనను అలంబనము, ఉద్దీపన సామగ్రియు ఉద్రేక కారణములగును. ఆంధ్ర నాయక దేవాలయము, అక్కడ పూజా పురస్కారములు లేకుండుట యివి యీ కవినుద్రేకపఱచినవి. దానితో అసలు దేవునిమీఁదికే దండెత్తినాడు కవి. వంతగించినాఁడు, పరియాచకములాడినాఁడు, సరసోక్తులు పచరించినాఁడు. సాధింపులకు దిగినాఁడు. ఎట్టకేలకు పూజా పురస్కారాదులనుద్ధరించినాడు. పురుషోత్తముని దయకుఁబాత్రుఁడైనాఁడు. ఇంతకంటె రచనకు సాఫల్యము కావలెనా?

- ముద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

4. నిందాస్తుతికింత యద్భుత రచనము మఱిచూచుట దుర్లభము. తిట్టులాగున కనఁబడి తిట్టుకాకపోవుటలో నీ కవి నేర్పు మిక్కిలి మెచ్చఁదగియున్నది. అవతార చర్యల భూషింపదగినవి దూషించినట్లు కనఁబడఁజేయునట్టి యీతని నేర్పు భక్తిచేఁగలిగిన రసగుళికలవలె నుండి ద్రాక్ష గుత్తుచ్ఛములవలెనంటిన వెంటనే రసమనుభవింపఁదగియున్నది. పండిత పామరజనవేద్యమై, బట్టుకవిత్వమునకుండు ప్రత్యేకత సుస్పష్టముగఁగానఁబడుచు, జాతీయోక్తులతో నిండియుండును. పద్యము, ధార, వాక్య క్రమము, భావము, మృదుమధురముగనుండె యాంధ్రనాయక శతకమని సార్థకనామమగుచున్నది.

హృదయముప్పొంగఁజేయు పద్యములు. గుణమునే దోషముగాఁజేసి చూపు వాక్యములు - పరమ వేదాంతరహస్యములఁబరిపోసి మొనలించి మన బుద్ధులకుఁబని గల్పించు మాటలు - పెక్కులుండి కవి ధన్యుఁడని మనకుఁదట్టుచుండును.

"కీర్తి నిందగ వర్ణించి గేలిపరుతు (౧౬)" నన్న యీతని వాక్యము నతినిపుణముగ నెగ్గించుకొనెను.

- వంగూరి సుబ్బారావుపంతులు



4. శ్రీకాకుళాంధ్ర మహావిష్ణు దేవాలయ గోడలో పొదగ బడిన ఆంధ్రనాయక శతకము 108 పద్యములు నాపరాళ్లపై 'చెక్కించి గోడలో పొదిగించినవారు. చిట్టిగూడురు గ్రామ వాస్తవ్యులు శ్రీమత్తిరుమల గుడిమెళ్ళ వరదా చార్యులు వారు మచ్చుకు ఒకఫోటో.



ఆంధ్రనాయక శతక ముద్రణకు ఆర్థిక సహాయమందించిన శ్రీ కాకాని వెంకటప్పలరాజుగారి ధర్మపత్ని వెంకటజయలక్ష్మి, తులశమ్మ. వీరినిగన్న పుణ్యదంపతులు తండ్రి పాపకాలరాజు, తల్లి సీతమ్మ గారలు ఎంతో ధన్యజీవులు. వీరిది కానూరు గ్రామశివారు కామయ్యతోపు. వెంకటప్పలరాజుగారు మంచి వేదాంతి, ఆధ్యాత్మిక, ధార్మిక చింతనగల సహృదయులు, నిరాడంబరులు, సాహితీ అభిమాని, శ్రీ కాసుల పురుషోత్తమకవిపై వీరికిగల అనన్య భక్తి-ప్రేమభావనే ఈ ప్రేరణకు కారణం. వారు సర్వధా ధన్యజీవులు. వారికి, వారి కుటుంబ సభ్యులు ఆంధ్ర మహావిష్ణువు దయకు, పురుషోత్తముని కరుణకు, భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబా కృపకు పాత్రులు, అనంత సౌభాగ్యావహమగు సంపదలను పొందెదరు. వారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

మీ ప్రేమపాత్రుడు
**వడాలి అంజంరాజు**

**వేదమంత్రం**

శతహస్త సమాహార
సహస్ర హస్త వికిరి - ఋగ్వేదం
(వంద చేతులతో సంపాదించు; వేయి చేతులతో పంచిపెట్టు)

# కృతజ్ఞతలు

*అక్షరంబు వలయు కుక్షి జీవులకు*
*అక్షరంబు లోకరక్షకంబు*
*అక్షయమైన విజ్ఞాన సంపద*
*అక్షరాలలోనే దాగియున్నది*

తల్లిపాలవలె జీవశక్తినిచ్చేది మాతృభాష. తల్లి ఉగ్గుపాలతోపాటు బిడ్డకు చిన్న చిన్న మాటలతో, అతి లాలనగా, గోముగా, ప్రేమగా భాష నేర్ప ప్రారంభించును. మాతృస్తన్యముతో కలిసి నేర్చుకొనిన భాష కనుకనే మాతృభాష అయినది. అందుకేనేమో తల్లివలె మృదుమధురమైనది.

కాలమహిమ! ఎందుకో ఒకనాడు ఆంధ్రనాయక శతకములోని మకుటం చిత్రచిత్ర ప్రభావ మనసులో మెదిలినది అంతే. నాకు తెలిసినంతవరకు ఎవరూ టీకా తాత్పర్యాలు వ్రాసినట్లు లేదు. అందుకే సదరు శతకమునకు టీకా తాత్పర్యాలు వ్రాయించాలని తలిచితిని. మిత్రులు శ్రీ కె.కోటంరాజుగారితో చెప్పితిని. మీ ఆలోచన బాగున్నది, జాగుచేయక కార్యోన్ముఖులుకండి! అని ఎంతో ఉత్సాహాన్ని కలుగజేసినారు. వారు, నేను కలిసి, కవిగారి స్వగ్రామము పెదప్రోలు వెళ్లి వారి కుటుంబసభ్యులతో మేము తలపెట్టిన కార్యక్రమాన్ని వివరించి వారిని సహకరించవలసినదిగా కోరినాము. అలనాడు కవిగారు నిర్మాణము చేసిన రామాలయాన్ని, వారి పేరున వున్న చెరువును, వారి కుటుంబ సభ్యులను ఫోటో తీసుకొని వచ్చినాము.

తొలి ఆంధ్ర రాజధాని శ్రీకాకుళం వెళ్లినాము. ఇ.ఓ. గారిని కలిసి దేవాలయ పూర్వ చరిత్ర మొదలగునవి వివరముగా తెలుసుకొని, కొన్ని ఫోటోలు తీసుకొని వచ్చినాము. .

ఇంతటి మహోన్నతమైన శతకరాజమునకు సంపూర్ణమైన శోభతో, కవిహృదయాన్ని, పాఠకుల హృదయములు రంజిల్లునట్లు టీకా తాత్పర్యాలు వ్రాయగల ధీరులెవరని తికమకపడినాము. కొంతకాలం అన్వేషణతో కాలయాపన జరిగినది. అట్టి తరుణంలో శ్రీ ఎస్.పి.రామరాజుగారు కలిసినారు. వారితో శతకము విషయం చెప్పితిని. వెంటనే వారు అమితమైన ఉత్సాహంతో అంతటి మహోన్నతమైన శతకానికి పరిపూర్ణమైన న్యాయము చేయగలవారున్నారన్నారు.

నేను ఎంతో కుతూహలంగా ఎవరండివారు అని అడిగితిని. ఋషితుల్యులు, కవిపండితులు, శాంతస్వభావి శ్రీ శనగన నరసింహస్వామిగారున్నారని ఎంతో దండిగా, మెండుగా చెప్పినారు. అప్పుడు నేను చాలా ఆనందపడితిని. అది షుమారు ౧౯౯౫ సం॥ మే నెల. ఒక శుభముహూర్తాన నేను, రామరాజుగారు అపర సరస్వతీమూర్తులు శ్రీ శనగన నరసింహస్వామిగారివద్దకు వెళ్లినాము. నా కోరిక వివరించుకొన్నాను. కొంత తడవు ఆలోచించి. వ్రాస్తానుగాని కొంత వ్యవధి కావాలి. ఈ శతకము టాలోటోలీగా వ్రాసేదికాదన్నారు. మీకు కావలసినంత వ్యవధి తీసుకోండి. కాని దానికి పరిపూర్ణత చేకూర్చండి అని ప్రార్థించినాను. టీకాతాత్పర్యాలు వ్రాయడం ప్రారంభించినారు. ఇంతకు పూర్వము శతకము ప్రచురణకర్తలు ప్రచురించిన ముద్రణ కాపీలు కావలయునన్నారు, హైదరాబాద్‌లో, చిట్టిగూడూరులో, రెడ్డిగూడెంలో, యింకా అనేకచోట్ల దానికి కావలసిన విషయ సేకరణ చేసి వారికి అందించినాను. శ్రీకాకుళం ఆంధ్ర మహావిష్ణువు దేవాలయము గోడలకు శ్రీ చిట్టిగూడూరు వరదాచార్యులవారు ౧౦౮ పద్యములు నాపరాళ్లపై చెక్కించి గోడలకు పొదిగినారు. వారి పుత్రుల వద్దకు పోయి వారివద్ద లభ్యమైన సంస్కృతానువాదము అయిన ఆంధ్ర నాయక శతకమును తెచ్చియిచ్చాను. కృష్ణదేవరాయల శాసనమును కూడా సేకరించితిని. సేకరణ కార్యములో ౮ మాసములు గడచినవి. అప్పుడు నా మనస్సులో ఇప్పటికే కాలాతీతమైనది. మరి పూర్తి అగుటకు యింకా ఎంతకాలం పట్టునో, ముద్రణకు ఎప్పుడు ముస్తాబగునో అని అనేక రీతులుగా ఆలోచన చేసితిని. ఎట్టకేలకు 7-౧-౧౯౯౬ తేదీన శ్రీ కాసుల పురుషోత్తమకవి కవితావైభవ సభ విజయవాడలో ఏర్పాటు చేసినాము. కవులు, గాయకులు, పండితులు, మిత్రులు, బంధువులు, నాయకులు, శ్రేయోభిలాషులు ఆ కార్యక్రమాన్ని అఖండ వైభవంగా, జయప్రదం గావించినారు. వారందరికి నా హృదయపూర్వక అభివందనలు.

అప్పుడు నూతనోత్సాహాన్ని సంతరించుకొని, అతిత్వరలో శతక ముద్రణకు పూనుకొని సంపూర్తి చేయగలమనే ధైర్యం చోటుచేసుకొంది.

మరల మొదలైనవి ఇబ్బందికర పరిస్థితులు. ఎన్నో అవరోధాలు, ఎన్నెన్నో అగాధాలను దాటుకుంటూ, అచంచలమైన విశ్వాసముతో ఎప్పటికైనా మంచికాలం రాకపోవునా అని కాలం తెచ్చు మార్పుకు "స్వాతి ముత్యం" లాగా మంచిరోజుకొరకు వేచియున్నాను. ఇప్పటికి కాలం కరుణించింది. ఇది ఒక యజ్ఞము. యజ్ఞము సంపూర్తి అగుటలో ఎందరో ఋషులు, కవులు, పండితులు, స్నేహితులు, శ్రేయోభిలాషుల, ప్రేమ-అనురాగం, కృషి నిక్షిప్తమైయున్నది. వారందరి

ప్రేమానురాగాలే పుస్తక రూపం.

సహృదయులు, సాహితీ విద్యానముద్రులు అనన్యప్రతిభావంతులు, ప్రేమస్వరూపులు అయిన శ్రీ శనగన నరసింహస్వామిగారు ఈ శతకమునకు టీకా తాత్పర్యములు వ్రాయుటకు అంగీకరించుట మహాభాగ్యంగా భావించితిని.

"కవి నిద్రపోతే లోకం నిద్రపోతుంది"

"వ్యక్తి నశించినా కవిత్వం జీవిస్తుంది"

ప్రేమమూర్తులైన శ్రీ శనగన నరసింహస్వామిగార్కి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

మీకు మంచి ముచ్చట. ఒకనాటి ఉదయం నరసింహస్వామిగారి వద్దకు వెళ్లితిని. అప్పుడు వారన్నమాటలు రాజుగారూ! శతకములోని కొన్నిపద్యాలు కొరుకుడు పడుటలేదు. ఏమి చేద్దామండి అన్నారు. మనము చేసేదేముందండి, అంతా పురుషోత్తమకవిగారు చూచుకొంటారన్నాను. 45వ పద్యం మరీ కొరుకుడు పడుటలేదని చెప్పినారు. వెంటనే నేను హైదరాబాద్ వెళ్ళి శ్రీ ఆర్.కవితాప్రసాద్‌గారిచేత వ్రాయించుకొని వచ్చినాను.

మాష్టారు ఆణిముత్యంలాంటి మరోమాట అన్నారు. ఈ శతకానికి సంపూర్ణమైన న్యాయం చేయలేమోనని సంతోషాన్ని వ్యక్తపరిచారు.ఏమైనా ఆ పురుషోత్తమ కవిగారిని తలచుకొని పడుకుంటే కలలో ఏమైనా కనిపించి మార్గం సుగమం చేస్తారని, ప్రయత్నం చేయగా కొన్ని పర్యాయములు వారి సుందర దృశ్యము కనిపించి కొన్ని సూచనలు యిచ్చినట్లు వారు అనుభూతిని పొందినట్లు నాతో చెప్పినారు ఎంతో ఆనందంతో.

7-1-2010న జరిగిన పురుషోత్తమ కవి కవితావైభవ సభలో అక్షరలక్షల విలువైన అమూల్యమైన మాట. ఎంతో ఆనందంతో, ఆనందబాష్పములు జాలువారుతుండగా ఇది ఏనాటి పుణ్యమో! నేను ఈ శతకానికి టీకాతాత్పర్యాలు వ్రాయటం. ఈ సభలో కవిగారు గీతకార్మికునికి ముత్యాలహారము బహూకరణ ప్రసక్తిరాగా ఆ గీతకార్మికుణ్ణి నేనే అని సభను సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తినారు.

అన్నివిధములుగా నాకు పూర్తి సహాయ సహకారములు అందించిన ఆర్.కవితాప్రసాద్‌గార్కి, సంగీత సాహిత్యములందు మహాపండితులు (ఒక వరలో రెండు కత్తులు ఇమడ్చగల ధీశాలురు) శ్రీ ఎన్.సి.హెచ్.కృష్ణమాచార్యులగార్కి, శ్రీ బల్లం సూర్యనారాయణరాజుగార్కి, శ్రీమాన్ అగ్నిహోత్రం యోగానంద నరసింహాచార్యులుగార్కి, స్థానిక ఎం.ఎల్.ఏ. శ్రీ కె.సుబ్బరాజుగార్కి, శ్రీ కె.కోటంరాజుగార్కి, శ్రీ ఆర్.బ్రహ్మరాజుగార్కి, శ్రీ టి.గంగరాజుగార్కి, శ్రీ కాసుల

రామ్మోహన్‌రాజుగార్కి, శ్రీ ఎన్.నారాయణరాజుగార్కి, శ్రీ వి.విష్ణువర్ధనరాజుగార్కి, శ్రీ ఎన్.ఆదినారాయణరాజుగార్కి, శ్రీ వి.సత్యనారాయణరాజుగార్కి, శ్రీ కాకాని వెంకటప్పలరాజుగార్కి, శ్రీ పోరంకి రాధాకృష్ణంరాజు, శ్రీ వై.వి.రాఘవరాజుగార్కి, శ్రీ వై.రంగరాజుగార్కి, శ్రీ పోరంకి పాండురంగరాజుగార్కి, ఆర్టిస్టు, డి.టి.పి. ఆపరేటర్సుకు - ముద్రించిన ప్రెస్‌వారికి సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ చిట్టిగూడూరు వరదాచార్యులుగార్కి ఆర్థిక సహకారం అందించిన శ్రీ జక్కిరెడ్డి కోటేశ్వరరెడ్డి, శ్రీ పెద్దసుబ్బారెడ్డి, శ్రీ చిన్నసుబ్బారెడ్డి, శ్రీ నాగిరెడ్డిగార్లకు, ఇంకా ఎందరో మిత్రులు, శ్రేయోభిలాషులకు, ఆర్థిక సహాయమందించిన సహృదయులకు నా హృదయపూర్వక అభివందనలు.

జగత్ప్రసిద్ధమైన ఆంధ్రనాయక శతకాన్ని ఇంతవరకు ముద్రణ చేసినవారు :

1. వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారు (చెన్నపురి)
2. బాలసరస్వతి బుక్ డిపోవారు, మద్రాసు
3. నిర్మలా పబ్లికేషన్స్‌వారు (విశాఖపట్నం)
4. నరేంద్రనాథ్ సాహితీ మండలివారు (తణుకు)
5. గాంధీ ఆశ్రమము (అవనిగడ్డ) వారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ కార్యక్రమంలో నాతో సహకరించిన గురుతుల్యులు శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారికి కృతజ్ఞుడను.

ఇంతకుముందుగాని, ఇప్పుడుగాని నేనే పదవిని ఆకాంక్షించలేదు. అయాచితంగా లభించినవాటిని స్వార్థానికి ఉపయోగించుకోలేదు. అంకితభావం, సేవాభావం, సమాజాభివృద్ధి అనే సిద్ధాంత త్రయానికి కట్టుబడిన వాడను. మీ వాడను, మీ ప్రేమకు పాత్రుడను.

అప్పకవి చిన్నకోట పెద్దన్న గారలు శతకమును క్షుద్రసాహిత్యములందు జేర్చిరి.
అనంతామాత్యుడు శతకములను చాటుప్రబంధములందు జేర్చెను.
ప్రేమస్వరూపులారా! సాహితీమూర్తులారా! మీరేమంటారు?
ధనం కోసంకాదు - కవితా ఘనత కోసం
నా యీ ప్రయత్నం - కార్యక్రమం.
నా యీ ప్రయత్నంలో లోపాలున్న మన్నించండి.

ఇట్లు,
బుధజన విధేయుడు
మీ వడాలి అంజంరాజు

కవి వంశవృక్షం : కాసుల పురుషోత్తమ కవి. తండ్రి అప్పలరాజు, తల్లి రమణమాంబ. వారి కుమారుడు అచ్యుత రామరాజు; వీరి కుమారుడు వెంచమ రాజు; వీరి కుమారులు : (1) శేషంరాజు; (2) సుబ్బరాజు; (3) పురుషోత్తమరాజు (4) రాఘవరాజు; కుమార్తెలు (1) బుల్లమ్మ, (2) బాపమ్మ (3) సంపూర్ణమ్మ. శేషంరాజుగారి కుమారుడు కోటంరాజు; సుబ్బరాజుగారి కుమారులు (ఎ) బసవరాజు, (బి) కృష్ణంరాజు (సి) బుజ్జి; పురుషోత్తమరాజుగారి కుమారుడు వెంకట కృష్ణంరాజు; రాఘవరాజుగారి కుమారుడు రామరాజు. బుల్లెమ్మ కుమారులు : ప్రకాశరాజు, విజయరామరాజు; ప్రకాశరాజు కుమారుడు రంగరాజు; విజయరామరాజు కుమారులు (ఎ) నారాయణరాజు, (బి) వాసుదేవరాజు; బాపమ్మ కుమారులు : రామరాజు, రఘుపతిరాజు, రామనాథరాజు, వెంకట కృష్ణంరాజు; సంపూర్ణమ్మ కుమారులు : శ్రీరామరాజు, శేషంరాజు.

# హృదయపూర్వక శుభాకాంక్షలు

విజయవాడ-సూర్యారావుపేటలో **ప్రశాంత యూరాలజీ సెంటరు** వారు శస్త్రచికిత్స లేకుండా మూత్ర పిండంలో రాళ్ళు తొలగింపునకు అత్యాధునికమైన యంత్రం **"లితోత్రిప్సి"**ని ప్రారంభించిన శుభసందర్భంగా మా హృదయపూర్వక అభినందనలు.

డా॥ ప్రశాంత్‌కుమార్‌గారు విజయవాడ నగరంలో ప్రముఖ వైద్యులలో ఒకరు. వీరు అంకితభావం, సేవాభావం, గొప్ప సామాజిక స్పృహగల వైద్యులు. పెండ్లికి, పిడుక్కి ఒకే మంత్రంగాక పేదల ఎడల కరుణ, దయతో వైద్యసేవలందించు చున్న మహామనీషి, సరళస్వభావి. అధునాతన యంత్ర పరికరంతో వారి వృత్తి సర్వతోముఖాభివృద్ధి చెందాలని కాంక్షిస్తూ వారికి మా హృదయపూర్వక శుభాకాంక్షలు.

ఇట్లు,

మీ **వి.అంజంరాజు**

ఎడిటర్, ఆంధ్రబాల



ప్రేమస్వరూపులైన విద్యార్థినీ, విద్యార్థులారా!

భారతదేశంలో ప్రతి అణువు పవిత్రమైనటు వంటిది. మన సంస్కృతి అతిప్రాచీనమైనది. మీరు భారతదేశమునకు ఎంతో ఋణపడి ఉంటున్నారు. కనుక మీ సేవలను ఈ భారత మాతకు అందించి ఆమె అనుగ్రహాన్ని పొందండి. మానవులకు భక్తి, ప్రేమ, విశ్వాసం అత్యవసరం.

విద్యార్థులకు శీలము-క్రమశిక్షణ అత్యవసరము. ఈనాటి విద్యార్థులే భావి భారతోద్ధారకులు.

నేటి ఆధునిక విద్య తెలివితేటలు మాత్రమే అభివృద్ధిచేస్తున్నాయి. గుణాన్ని పెంచడంలేదు. గుణంలేకుండా కోటివిద్యలు నేర్చినప్పటికి ప్రయోజనంలేదు. ప్రతివ్యక్తి ఆత్మపరిశీలన చేసుకోవాలి. విద్యార్థులు సద్గుణములు, సద్విద్య సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ, దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి అలవర్చుకోవాలి. శీలసంపన్నులై భారతమాత ప్రతిష్ఠను ఇనుమడింపజేయుటకు కృషిచేసి ఉత్తమ పౌరులు, ఆదర్శప్రాయులు గాండి. దేశ సమగ్రత, సమైక్యతకు పాటుపడండి.

ప్రేమ సర్వశక్తివంతమని నమ్మండి. ఓర్పులేనితనం, దురహంకారం వదిలి పెట్టండి. కుహనాలోచనలకు పోకండి. ఐకమత్యంతో ఇతరులతో కలసి సమాజ సేవ జేయడం నేర్చుకోండి. పరమశత్రువుతోకూడా ఇంపైన, హితమైన భాషణ ఉపయోగించండి. అందరితో అణకువగా మెలగండి. చేయీ చేయీ కలిపితే చేవ పెరుగుతుంది. సృష్టిలో తీయనిది స్నేహమేనోయి.

ఇట్లు,

**వి.అంజంరాజు, సంపాదకుడు**

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాన్తయే

అగజానన పద్మార్కం, గజానన మహర్నిశం !
అనేక దం తమ్ భక్తానా, మేకదంత ముపాస్మహే !!

# శ్రీమత్
# ఆంధ్ర నాయక శతకము

1. శ్రీమదనంత లక్ష్మీ యుతోరః స్థల,
చతురాననాండ పూరిత పిచండ,
దర చక్ర ఖడ్గ, గదా శరాసనహస్త,
నిఖిల వేదాంత వర్ణిత చరిత్ర,
సకల పావన నదీ జనక పాదాంభోజ,
రమణీయ ఖగకులోత్తమ తురంగ,
మణిసౌధవ త్ఫణామండ లోరగతల్ప,
వరకల్పకోద్యాన వన విహార,
భాను సితభాను నేత్ర, సౌభాగ్యగాత్ర,
యోగిహృద్ధ్యేయ, భువనైక భాగధేయ,
చిత్ర చిత్ర ప్రభావ, దాక్షిణ్యభావ,
హత విమతజీవ, శ్రీకాకుళాంధ్రదేవ!

అర్థములు: శ్రీమత్ = మంగళాకరమైన; అనంత లక్ష్మీయుత = అనంత లక్ష్మితో కూడిన; ఉరః స్థల = రొమ్ము కలవాడా!; చతురానన + అండ = బ్రహ్మాండము చేత; పూరిత = నింపబడిన; పిచండ = కడుపు కలవాడా!; దర = శంఖము; చక్ర = చక్రము; ఖడ్గ = కత్తి; గదా = గద; శరాసన = విల్లు (కలిగిన); హస్త = చేతులు కలవాడా!; నిఖిల = సమస్తమైన; వేదాంత = ఉపనిషత్తులలో; వర్ణిత = వర్ణింపబడిన; చరిత్ర = నడవడి కలవాడా!; సకల పావన = అన్నింటినీ పవిత్రము చేయు; నదీ = గంగానదిని; జనక = పుట్టించి నటువంటి; పాద + అంభోజ = పద్మములవంటి పాదములు కలవాడా!; రమణీయ = అందమైన; ఖగకుల + ఉత్తమ = పక్షిజాతిలో శ్రేష్ఠుడైన గరుత్మంతుడు; తురంగ = వాహనముగా కలవాడా!; మణిసౌధవత్ = రత్నములు పొదుగబడిన మేడలవంటి; ఫణా మండల = పడగల వరుస కలిగిన; ఉరగతల్ప = పాము పడకగలవాడా!; వరకల్పక = శ్రేష్ఠమైన కల్పవృక్షములు కల; ఉద్యానవన = తోటలో; విహార = సంచరించువాడా!; భాను, సితభాను, నేత్ర = సూర్యుడు, చంద్రుడు కన్నులుగా కలవాడా!; సౌభాగ్య

గాత్ర = సౌందర్యముతో కూడిన శరీరము కలవాడా!; యోగి = యోగిజనుల; హృత్, గేయ = మనస్సులలో పొగడబడువాడా!; భువన+ఏక = లోకములకు ముఖ్యమైన; భాగధేయ = భాగ్యమైనవాడా!; చిత్ర చిత్ర = బహు విచిత్రమైన; ప్రభావ = మహిమ కలవాడా!; దాక్షిణ్య భావ = దయా భావము కలవాడా!; హత, విమత, జీవ = కొట్టబడిన శత్రువుల యొక్క ప్రాణములు కలవాడా!; శ్రీకాకుళ+ఆంధ్రదేవ = శ్రీకాకుళము అను క్షేత్రమున వెలసిన ఆంధ్ర నాయకుడు అనుపేరు కలిగిన విష్ణుమూర్తీ!

**తాత్పర్యము:** శ్రీకాకుళ ఆంధ్ర దేవా! నీవు శుభప్రదమైన లక్ష్మీదేవిని రొమ్మున ధరిస్తావు. కడుపులో బ్రహ్మాండమును కలిగి ఉంటావు. నాలుగు చేతులందు శంఖ, చక్ర, గదా ధనుస్సులు ధరిస్తావు. ఉపనిషత్తులలో నీవు వర్ణింపబడ్డావు. పతితపావనమైన గంగానది నీపాదపద్మము నందు పుట్టినది. పక్షిరాజైన గరుత్మంతుడు నీకు వాహనము. వేయి పడగల శేషుడు నీకు పానుపు. కల్పవృక్ష వాటిక యందు నీవు విహరిస్తావు. సూర్య చంద్రులు నీకు నేత్రాలు. నీవు దివ్యమంగళ స్వరూపుడవు. యోగిజనుల మనస్సులలో నీవు కీర్తింపబడతావు. నీవు లోకములకు భాగ్యమైన వాడవు. నీవు అనేక విధములైన మహిమలు కలవాడవు. నీవు దయాసముద్రుడవు. శత్రు సంహారకుడవు.



2. వై జయంతీదామ, వర్ణిత సుత్రామ,
శోభననామ, లోకాభిరామ,
కువలయశ్యామ. వికుంఠపట్టణధామ,
శ్రుతిహితనామ, దైవతలలామ,
కృతదైత్య సంగ్రామ, గీతార్థ పరిణామ,
యదుకులాంబుధిసోమ, అఘవిరామ,
సంగర జిత భౌమ, రంగద్గుణస్తోమ,
త్రిభువన క్షేమ, వర్ధిష్ణుకామ,
దాసులము గామ? నీ పేరు దలచుకోమ?
కొసరితిమి ప్రేమ, కోరిన కోర్కు లీమ? చిత్ర..

అర్థములు: వైజయంతీదామ = వైజయంతి అనే మాలను ధరించువాడా!; వర్ణిత సుత్రామ = ఇంద్రునిచేత పొగడబడినవాడా! శోభననామ = శుభమును కలిగించు పేరు గలవాడా!; లోక+అభిరామ = లోకుల మనస్సులను రంజింప చేయువాడా! కువలయశ్యామ = నల్లకలువవలె నల్లనివాడా!; వికుంఠ పట్టణధామ = వైకుంఠమనే పట్టణము నివాస స్థానముగా గలవాడా!; శ్రుతిహితనామ = చెవులకు ఇంపైన పేరు కలవాడా!; దైవతలలామ = దేవతలలో శ్రేష్ఠుడా!; కృత, దైత్య, సంగ్రామ = చేయబడిన రాక్షసులతోడి యుద్ధము కలవాడా!; గీతా+అర్థ పరిణామ = భగవద్గీతార్థమునకు ఫలమైన వాడా!; యదుకుల+అంబుధిసోమ = యాదవ కులము అను సముద్రమునకు చంద్రుడైన వాడా!; అఘ, విరామ = పాపములను పోగొట్టువాడా!; సంగరజిత, భౌమ = యుద్ధమునందు గెల్వబడిన భూమి పుత్రుడు కలవాడా!; రంగత్ = ఒప్పుచుండే; గుణ, స్తోమ = సద్గుణముల యొక్క సమూహము కలవాడా!; త్రిభువన = మూడులోకాల యొక్క; క్షేమ = సేమము కలవాడా!; వర్ధిష్ణు = వృద్ధిపొందే స్వభావం కల; కామ = కోరికలు కలవాడా!; దాసులము కామ = సేవకులము మేముకామా!; నీ పేరు తలచు కోమ = నీ నామమును స్మరించుకొనుట లేదా!; కొసరితిమి ప్రేమన్ = కోరితిమి నీ ప్రేమను; కోరిన కోర్కులు = మేము కోరిన కోర్కెలు; ఈమ = ఇమ్మా!

తాత్పర్యము: శ్రీకాకుళ ఆంధ్ర దేవా! నీవు ఎదపై వనమాలను ధరిస్తావు. ఇంద్రుడు నిన్ను స్తుతిస్తాడు. నీ నామము శుభకరము. నీవు లోకాలను సంతోషపెడతావు. నీమేని రంగు నల్ల కలువల రంగు వంటిది. నీవు వైకుంఠ పురవాసుడవు. నీ పేరు చెవులకు ఇంపు గొలుపుతుంది. నీవు వేల్పులలో మిన్నవు. నీవు రాక్షసులతో యుద్ధం చేశావు. భగవద్గీతలోని అర్థాలకు ఫలమునీవే. యదుకులం అనే మున్నీటికి నీవు జాబిల్లివి. నీవు లోకుల పాపాలను తొలగిస్తావు. నీవు నరకాసురుణ్ణి వధించావు. నీవు సద్గుణ రాశివి. మూడులోకాలను రక్షిస్తావు. భక్తుల కోర్కెలను నెఱవేరుస్తావు. మేము నీ దాసులం కదా! నీ పేరు ఎప్పుడూ తలచుకొందుము గదా! నీ ప్రేమను కోరుచుందుము గదా! మా కోర్కెలను తీర్చుము.

3. మానుషహర్యక్ష, మార్తాండ సోమాక్ష,
త్రిభువనాధ్యక్ష, కౌంతేయపక్ష,
మదనకోటి విలాస, మంజుల దరహాస,
శ్రీహృన్నివాస, కౌశేయవాస,
శార్ఙ్గకోదండ పిచండ భృతాజాండ,
వినతవేదండ, రవిప్రచండ,
దీన శరణ్య, విద్విట్భేద నైపుణ్య,
భక్తానుగణ్య, దిక్ప్రభువరేణ్య,
సిద్ధసంకల్ప, అవికల్ప, శేషతల్ప,
నిష్కళంక, నిరాతంక, నిరుపమాంక, చిత్ర......

అర్థములు:- మానుష హర్యక్ష = నరసింహావతారము ధరించినవాడా!; మార్తాండ సోమ + అక్ష =సూర్యచంద్రులు కుడి ఎడమ కన్నులు అయినవాడా; త్రిభువన + అధ్యక్ష = మూడు లోకములకు అధిపతీ; కౌంతేయపక్ష = పాండవుల పక్షమైనవాడా!; మదనకోటి, విలాస = కోటి మన్మథుల సౌందర్యము కలవాడా!; మంజుల దరహాస = మనోహరమైన చిరునవ్వు కలవాడా!; శ్రీ, హృత్ నివాస = లక్ష్మీదేవి మనస్సులో ఉండువాడా!; కౌశేయవాస = పట్టువస్త్రము ధరించువాడా!; శార్ఙ్గ, కోదండ = శార్ఙ్గము అనే విల్లుకలవాడా!; పిచండ = కడుపులో భృత = భరింపబడిన; అజాండ = బ్రహ్మాండము కలవాడా!; వినత వేదండ = నమస్కరించిన ఏనుగు కలవాడా!; రవి ప్రచండ = సూర్యుని వలె తేరి చూడ రానివాడా!; దీన శరణ్య = దిక్కులేని వారిని రక్షించువాడా!; విద్విట్భేద = శత్రువులను సంహరించుటయందు; నైపుణ్య = నేర్పుకలవాడా!; భక్త+ అనుగణ్యా = భక్తులచేత స్తుతింప బడువాడా!; దిక్ ప్రభువరేణ్య = దిక్కులందలి రాజులలో శ్రేష్ఠుడా!; సిద్ధసంకల్ప = వెరవేరు కోరికలు కలవాడా!; అవికల్ప = భ్రాంతి లేనివాడా!; శేషతల్ప = శేషుడు పడకగా కలవాడా!; నిష్కళంక = ఎట్టి దోషము లేనివాడా!; నిరాతంక = ఎట్టి భయమూ లేనివాడా!; నిరుపమ + అంక = సాటిలేని పేరు కలవాడా!

తాత్పర్యము:- శ్రీ కాకుళ ఆంధ్రనాయకా! నీవు నరసింహుడవు. సూర్య చంద్రులు నీకు కన్నులు. నీవు మూడులోకాలకు ప్రభుడవు. పాండవులన్నచో నీకు ఎంతో ప్రేమ. నీవు శతకోటి మన్మథ సౌందర్యం కలవాడవు. నీ చిరునవ్వు మనోహరం. నీవు లక్ష్మీదేవి హృదయంలో నివసిస్తావు. పీతాంబరము ధరిస్తావు. శార్ఙ్గమనే విల్లు తాలుస్తావు. నీ కుక్షిలో బ్రహ్మాండమంతా ఉంటుంది. గజేంద్రుడు నిన్ను స్తుతించినాడు. నీతేజము సూర్యుని వలె తీక్ష్ణమైనది. దిక్కు లేనివారికి నీవేదిక్కు. శత్రువులను చంపుటలో నీవు నేర్పరివి. భక్తులు నిన్ను కీర్తిస్తారు. దిక్కులందలి రాజులలో నీవు శ్రేష్ఠుడవు. నీవు కోరినవెల్లా సిద్ధిస్తాయి. నీవు భ్రాంతి రహితుడవు. శేషుడు నీసెజ్జ. నీవు దోషరహితుడవు. భయరహితుడవు. నీ నామము సాటిలేనిది.

4. గోవింద, ముచికుంద సేవిత పాదార
వింద, నిత్యానంద, విశ్వతుంద,
శ్రీమంత, విజయలక్ష్మీకాంత, నిర్మల
స్వాంత, భక్తోద్యాన వనవసంత,
అఘనాశ, కోటిసూర్యప్రకాశ, వరేశ,
విజితాశ, సన్మనోంబుజ నివేశ,
సద్గుణ గేహ, వాసవనీల సమదేహ,
బంధురోత్సాహ, సుపర్ణవాహ,
పండితస్తోత్ర చారిత్ర, పద్మనేత్ర,
మధుర మంజులభాష. సమస్తపోష, చిత్ర....

అర్థములు: గోవింద = గోపాలకుడా!; ముచికుంద, సేవిత, పాద+ అరవింద = ముచికుందుడనే రాజుచే సేవింపబడిన పద్మములవంటి పాదములు కలవాడా!; నిత్య+ ఆనంద = శాశ్వతమైన ఆనందమే స్వరూపంగా గలవాడా!; శ్రీమంత = శుభములను కలిగించువాడా!; విజయలక్ష్మి కాంత = విజయలక్ష్మికి మనోహరుడైనవాడా!; నిర్మల స్వాంత = నిర్మలమైన మనస్సు గలవాడా!; భక్త+ఉద్యానవన, వసంత = భక్తులనే ఉద్యానవనమునకు వసంతమైనవాడా!; అఘనాశ = పాపములను నశింపచేయువాడా!; కోటి సూర్య ప్రకాశ = పెక్కుమంది సూర్యుల ప్రకాశము వంటి ప్రకాశము గలవాడా!; వర+ ఈశ = మేటి ప్రభువైనవాడా!; విజిత+ ఆశ = గెలువబడిన ఆశలు గలవాడా!; సత్ + మనః+ అంబుజ నివేశ = మంచివారి పద్మముల వంటి మనస్సులు ఉనికిపట్టైనవాడా!; సత్ + గుణగేహ = మంచిగుణములకు నిలయమైనవాడా!; వాసవనీల, సమ దేహ = ఇంద్రనీల మాణిక్యంతో సమానమైన శరీరము గలవాడా!; బంధుర+ ఉత్సాహ = ఎక్కువ ఉత్సాహము గలవాడా!; సువర్ణవాహ = గరుత్మంతుడు వాహనముగా గలవాడా!; పండితస్తోత్ర చారిత్ర = పండితుల స్తుతులకు పాత్రమైన నడవడి గలవాడా!; పద్మనేత్ర = తమ్మిరేకులవంటి కన్నులు కలవాడా!; మధుర, మంజులభాష = తియ్యనైన, మనోహరమైన, మాటలు కలవాడా!; సమస్త పోష = అన్నిటినీ పోషించువాడా!

తాత్పర్యము:- శ్రీకాకుళాంధ్ర దేవా! గోపాలకా! ముచికుందునిచే సేవింపబడిన వాడా! నీవు శాశ్వతానంద స్వరూపుడవు, విశ్వోదరుడవు, శుభప్రదుడవు, విజయలక్ష్మికి భర్తవు, నిర్మల హృదయుడవు, భక్తరంజకుడవు, పాపనాశకుడవు, కోటి సూర్యుల తేజస్సు కలవాడవు, గొప్ప ప్రభుడవు, ఆశారహితుడవు, మంచివారి మనస్సులలో ఉండేవాడవు, సద్గుణ నిలయుడవు, ఇంద్రనీలముల కాంతి వంటి మేనికాంతి కలవాడవు, గొప్ప ఉత్సాహశక్తి కలవాడవు, నీ వాహనము పక్షి రాజగు గరుత్మంతుడు, నీప్రవర్తన పండితుల స్తోత్రమునకు పాత్రమైనది, నీవు కమలాక్షుడవు, నీమాటలు మధురములు, మనోజ్ఞములు.

5. శ్రీకాకుళము భక్తలోక చింతామణి
శ్రీకాకుళము సుకృతాకరంబు
శ్రీకాకుళము ధరాలోక వైకుంఠంబు
శ్రీకాకుళము మర్త్యసేవితంబు
శ్రీకాకుళము వేదసిద్ధాంత మహిమంబు
శ్రీకాకుళము హతవ్యాకులంబు
శ్రీకాకుళము మహాక్షేత్రావతంసంబు
శ్రీకాకుళము సర్వసిద్ధికరము
తెలియ శ్రీకాకుళంబు నీ దివ్యదేశ
మాంధ్రనాయక నీవె శ్రీహరివి నిజము, చిత్ర...

అర్థములు :- శ్రీకాకుళము = శ్రీకాకుళ క్షేత్రము; భక్తలోక, చింతామణి = భక్తుల సమూహమునకు కోరిన కోర్కెలు ఇచ్చే దేవతామణి; సుకృత + ఆకరంబు = పుణ్యములకు చోటు; ధరాలోక, వైకుంఠంబు = భూలోకంలో వైకుంఠమువంటిది; మర్త్యసేవితంబు = మానవులచే కొలువబడునది; వేద సిద్ధాంత = వేదములలోని సిద్ధాంతముల యొక్క; మహిమంబు = గొప్పతనము కలది; హతవ్యాకులంబు = మానవుల కలతలను పోగొట్టునది; మహాక్షేత్ర + అవతంసంబు = గొప్ప క్షేత్రములకు శిరోమణి; సర్వసిద్ధికరము = సమస్తమును సమకూర్చునది; తెలియన్ = తెలిసికొనగా; శ్రీకాకుళంబు = శ్రీకాకుళ పుణ్యక్షేత్రము; నీ దివ్యదేశము = నీ యొక్క దివ్యప్రదేశము (వైకుంఠము); ఆంధ్రనాయక = ఆంధ్రనాయకుడనే పేరుగల; నీవె = నీవే!; శ్రీహరివి = శ్రీ విష్ణుదేవుడవు; నిజము = నిక్కము.

తాత్పర్యము :- ఆంధ్రనాయకా! నీవు నివసించు శ్రీకాకుళ పుణ్యక్షేత్రము భక్తులకు చింతామణి. భూలోక వైకుంఠము, మానవ సేవ్యము. వేద సిద్ధాంత మహిమకలది. మానవుల మనోవ్యాకులత్వమును పోగొట్టేది. గొప్పక్షేత్రము. భక్తులయిన వారి కోర్కెలను ఈడేర్చేది. ఆంధ్రనాయకా! తెలిసి కొనగలిగిన వారికి నీవే శ్రీహరివి. శ్రీకాకుళమే వైకుంఠము.

6. ఇంద్రనీలచ్ఛాయ లీను నెమ్మేనిపైఁ
 గనకాంబరప్రభ గ్రందుకొనఁగఁ
బర్వసుధాంశు శోభానముజ్జ్వలవక్త్ర
 మున నూర్ధ్వపుండ్రము ముద్దు గుల్కఁ
నెగుభుజంబుల ధగద్ధగితాంగద ద్యుతుల్
 మూర్ధరత్న కిరీటమునఁ జరింప
వర్ణితోర స్థలి వైజయంతిక, కౌస్తు
 భాంతర శ్రీదేవియంద మమర
రమ్ము దర్శన మిమ్ము ఘోరములఁ జిమ్ము
మభయ మిమ్ము భవత్తత్త్వ మానతిమ్ము, చిత్ర....

అర్థములు: ఇంద్రనీలచ్ఛాయలు = ఇంద్ర నీలములనే మణుల కాంతులు; ఈను = వెలువరించు; నెఱి + మేనిపైన్ = అందమైన శరీరముపై, కనకాంబర ప్రభ = బంగారు వలువ యొక్క కాంతి, క్రందుకొనగాన్ = వ్యాపించగా, పర్వసుధా + అంశు = పున్నమినాటి చంద్రుని; శోభా = కాంతివంటి కాంతిచే; సమ్ + ఉత్ + జ్వల = బాగుగా ప్రకాశించే; వక్త్రమునన్ = ముఖముపై; ఊర్ధ్వపుండ్రము = నిలువుబొట్టు; ముద్దుగుల్కాన్ = ముద్దారగా; ఎగు భుజంబులన్ = ఎత్తైన భుజములందు ధరించే; ధగద్ధగిత = ధగధగమని ప్రకాశించే; అంగద + ద్యుతుల్ = భుజకీర్తులయొక్క కాంతులు; మూర్ధ = తలమీది; రత్న కిరీటమునన్ = రత్నములు పొదుగబడిన కిరీటమునందు; చరింపగాన్ = సంచరింపగా; వర్ణిత = పొగడదగిన; ఉరఃస్థలిన్ = విశాలమైన వక్షమున; వైజయంతిక = వనమాలిక; కౌస్తుభ + అంతర = కౌస్తుభమణి లోపలి; శ్రీదేవి = లక్ష్మీదేవి; అందము + అమరన్ = ఒప్పగా; రమ్ము = రా; దర్శనము + ఇమ్ము = కన్పింపుము; ఘోరములన్ చిమ్ముము = పాపములను తొలగింపుము; అభయము + ఇమ్ము = భయములేదని చెప్పుము; భవత్తత్త్వము = నీకు సంబంధించిన యథార్థ జ్ఞానము; ఆనతి + ఇమ్ము = ఆజ్ఞాపింపుము.

తాత్పర్యము: ఇంద్రనీలముల కాంతుల వంటి కాంతులు కలిగిన నీ నల్లని శరీరముపై పసుపుపచ్చని బంగారు వలువ కాంతులు ప్రసరించగా, పున్నమినాటి చంద్రుని కాంతివంటి కాంతిచే నొప్పు మోముపై ఊర్ధ్వపుండ్రములు ముద్దారగా, ఎత్తు భుజములపై తాల్చిన భుజకీర్తుల జిగేలుమనే కాంతులు పైకి వ్యాపించి శిరసున ధరించిన కిరీటముపై వ్యాపింపగా, వెడద రొమ్మున వనమాల, కౌస్తుభమనే రత్నంలోపల నెలకొన్న లక్ష్మీదేవి అందగింపగా। ప్రత్యక్షమై మా పాపముల బాపుము. అభయదానము చేయుము. నీ రహస్యము మాకు ఎఱుగజేయుము.

7. కలిగినప్పుడె కన్న తలిదండ్రు లెన్న నే
 నిసువు మాటాడంగ నేర్చె జగతి
బయలిజగంబు లంబకు నిజోదరమునం
 దేబిడ్డ చూపించె నిద్ధరిత్రిఁ
దొడలపై ముద్దుగా నిడుకొన్న జనని కే
 పసిపిల్ల కొండంతబరువు దోఁచెఁ
దల్లిచెంగటనుండి యుల్లిల్లుఁ జొచ్చి యే
 కుఱ్ఱఁ డింతుల బల్మిఁ గూడ నేర్చె
నాబుదుత వీవెరా యబ్బ! యబ్బురంపు
కతలమారివి నీ వెఱుంగనివి గలవె? చిత్ర....

**అర్థములు:-** కలిగిన + అప్పుడె = పుట్టిన వెంటనే; కన్న తల్లిదండ్రులు = కన్నది, కన్నయ్య; ఎన్నన్ = కొనియాడగా; ఏ నిసువు = ఏ పసిబిడ్డ; జగతిన్ = భూమిపై; మాటాడంగన్, నేర్చెన్ = పలుక జాలెనో; బయలి జగంబులు = బాహ్య ప్రపంచములు; అంబకున్ = తల్లికి; నిజ + ఉదరమునన్ = తనకడుపులో;-- ఈ ధరిత్రిన్ = ఈభూమిపై; ఏ బిడ్డ = ఏ శిశువు; చూపించెన్ = కనబఱచెనో; తొడలపైన్ = ఒడిలో; ముద్దుగాన్ = ప్రేమతో; ఇడుకొన్న = ఉంచుకొనిన; జననికిన్ = తల్లికి; ఏ పసిపిల్ల = ఏ పసికందు; కొండ + అంత = కొండపాటి; బరువు తోచెన్ = బరువు అనిపించెనో; తల్లి చెంగటన్ = తల్లి దగ్గర; ఉండి = ఉన్నట్లే యుండి; ఇల్లు + ఇల్లు = ప్రతిఇంటిలో; చొచ్చి = ప్రవేశించి; ఏ కుఱ్ఱడు = ఏ పిల్లవాడు; ఇంతులన్ = స్త్రీలను; బల్మిన్ = బలవంతముగా; కూడన్ = రమించుటకు; నేర్చెన్ = సమర్థుడయ్యెనో; అబ్బ = ఔరా; ఆ బుదుతవు = అట్టి బాలుడవు; ఈవెరా = నీవే సుమా; అబ్బురంపు = అచ్చెరువు కలిగించు; కతల మారివి = చేష్టలు కలవాడవు; నీవు + ఎఱుంగనివి = నీకు తెలియనివి; కలవె = ఉన్నవా (లేవు)

**తాత్పర్యము:-** పుట్టిన వెంటనే నీవు కన్నతల్లిదండ్రులైన దేవకీవసుదేవులు అబ్బురపడగా మాటాడితివి. తల్లికి (యశోదకు) నీ కడుపులో బ్రహ్మాండమును చూపితివి. నిన్ను ఒడిలో నిడుకొని లాలించు యశోదమ్మకు కొండంత బరువనిపించితివి. తల్లి దగ్గర ఉన్నట్లే ఉండి, వ్రేపల్లెలో ప్రతి యింట దూరి గోపయువతులను బలాత్కారముగా కూడితివి. నీవువింత గొలుపు పనులు చేసితివి. నీకు తెలియని వింత చేష్టలు లేవు.

ఆంధ్రనాయక శతకమునకు
ఆర్థికసహాయం అందించిన
**శ్రీ కాసుల రామమోహన్‌రాజు** గారి కుటుంబ సభ్యులకు
నా హృదయపూర్వక అభినందనలు.

ఇట్లు
***వడాలి అంజం రాజు***



వంశవృక్షం:- కాసుల శాస్త్రి రాజు - కుమారుడు అచ్యుతరాజు

కుమారుడు సుబ్బరాజు వారి కుమారుడు
శాస్త్రిరాజు వారి కుమారుడు రామమోహన్ రాజు
పై ఫోటోలోనివారు రామమోహన్‌రాజు గారి
తల్లి, తండ్రి, సోదరీ సోదరీమణులు
మరియు కుటుంబ సభ్యులు.



8. వర మిచ్చినట్టి శంకరుని కెగ్గు దలంచు
భస్మాసురుని పేరు బాపినావు
తనయిల్లు గాచు నుగ్రుని బోరుటకు బిల్చు
బాణుచేతులు తెగ బరికినావు
తొలుమిన్కు లజుని మ్రుచ్చిలి గొన్న సోమకు
జంపి విద్యలు ధాత కంపినావు
బలిమి దైత్యులు సుధాకలశము గ్గొన వారి
వంచించి సురలకు బంచినావు
నిఖిలదైవత కార్యముల్ నిర్వహించు
నీకు నిజకార్యము భరంబె నిర్వహింప, చిత్ర....

అర్థములు:- వరము + ఇచ్చిన + అట్టి = తనకు వరము ఇచ్చిన; శంకరునికి = శివునికి; ఎగ్గున్ + తలచు = హాని తలపెట్టిన; భస్మాసురుని = భస్మాసురుడు అనుపేరుగల రాక్షసుని; పేరున్ + పాపినావు = పేరులేకుండ చేసితివి (చంపితివి); తన + ఇల్లున్ + కాచు = తన గుమ్మము దగ్గర కావలి కాయు; ఉగ్రునిన్ = శివుని; పోరుటకున్ = తనతో యుద్ధము చేయుటకు పిలిచిన; బాణు చేతులు = బాణాసురుని వేచేతులు; తెగన్ + బరికినావు = ఖండించినావు; అజునిన్ = బ్రహ్మదేవుని; మ్రుచ్చిలి = మోసగించి; తొలిమిన్కులు = వేదములు; కొన్న = దొంగిలించిన; సోమకున్ = సోమకుడను రక్కసుని; చంపి = చంపి; విద్యలు = వేదములు; ధాతకు + అంపినావు = తిరిగి బ్రహ్మ దగ్గరకు పంపినావు; బలిమిన్ = బలముతో; దైత్యులు = రాక్షసులు; సుధాకలశమున్ = అమృతభాండమును; కొనన్ = తీసుకొనగా; వారిన్ = రాక్షసులను; వంచించి = మోసగించి; సురలకున్ = దేవతలకు; పంచినావు = పంచి పెట్టినావు; నిఖిలదైవత కార్యముల్ = సమస్త దేవతల పనులను; నిర్వహించు = నెరవేర్చు; నీకున్ = నీకు; నిజకార్యము = సొంతపని (దేవాలయోద్ధరణ); నిర్వహింపన్ = నెరవేర్చుట; భరంబు + ఎ = బరువా (కాదుగదా).

తాత్పర్యము:- ఆంధ్రనాయకా! వర మహిమను పరీక్షింపగోరి వరదాతయైన శివుని నెత్తిపై తనచేతులు పెట్టనెంచిన భస్మాసురుని రూపుమాపితివి. తన వాకిట కావలియైన శివుని రణంబునకు ఆహ్వానించిన బాణాసురుని వేయిచేతులను నరికివేసితివి. వేదములు దొంగిలించిన సోమకాసురుని జంపి తిరిగి వాటిని బ్రహ్మకు చేర్చితివి. బలముతో అమృతకలశము వశము చేసికొన్న రాక్షసులను మోహిన్యవతారముతో మోహింపజేసి అమృతమును దేవతలకు పంచితివి. వేల్పులెల్లరి పనులను నిర్విఘ్నముగ చేసిపెట్టు నీకు ఏ సొంతపని బరువు కాదుగదా!

9\. అచట లే వని కదా యరచేత జఱచె గ్రు
ద్ధత సభా స్తంభంబు దానవేంద్రు
డచట లే వని కదా యస్త్రరాజం బేసె
గురుసుతుం డుత్తరోదరమునందు
నచట లే వని కదా యతికోపి ననిచె పాం
డవు లున్నవనికి గౌరవకులేంద్రు
డచట లే వని కదా యాత్మీయసభను ద్రౌ
పదివల్వ లూడ్చె సర్పధ్వజుండు
లేక యచ్చోటులను గల్గలేదె ముందు
కలవు కేవల మిచ్చోట గల్గు టరుదె, చిత్ర...

అర్థములు :- అచటలేవు + అనికదా = అచట లేనేలేవని; దానవ + ఇంద్రుడు = రాక్షసరాజు (హిరణ్యకశిపుడు); క్రుద్ధతన్ = కోపముతో; సభాస్తంభంబున్ = సభలోని స్తంభమును; అరచే తన్ = అరచేతితో; చఱచెన్ = కొట్టెను; అచటలేవని కదా = అక్కడ లేనేలేవని; గురుసు తుండు = ద్రోణాచార్యుని పుత్రుడు (అశ్వత్థామ); ఉత్తరా + ఉదరమునందు = ఉత్తర గర్భములోనికి; అస్త్రరాజంబు = మంత్ర పూర్వకముగా ప్రయోగింపబడు గొప్ప బాణమును (బ్రహ్మాస్త్రమును); ఏసెన్ = ప్రయోగించెను; అచటలేవు + అనికదా = అచ్చటలేనే లేవని; కౌరవకుల + ఇంద్రు డు = కౌరవకులాధిపతి (దుర్యోధనుడు); పాండవులు + ఉన్నవనికిన్ = పాండవులు నివసించే వన ప్రదేశమునకు; కోపిన్ = కోప స్వభావము గల; యతిన్ = మునిని (లేదా); అతికో పిన్ = ఎక్కువ కోప స్వభావము కలవానిని (దుర్వాసో మునీంద్రుని); అనిచెన్ = పంపెను; అచటలేవు + అనికదా = అచట లేనేలేవని; ఆత్మీయసభను = తాను కొలువు తీరిన సభలో; సర్పధ్వజుడు = దుర్యోధనుడు; ద్రౌపది = ద్రౌపదీదేవి శరీరము మీది; వల్వలు = వస్త్రములు; ఊడ్చెన్ = అపహరించెను; అచ్చోటులను = ఆయా చోట్ల; ముందు = మొదట; లేక = లేకపోయినను; కల్గలేదె = ప్రత్యక్షం కాలేదా; ఇచ్చోటన్ = ఇక్కడ; కేవలము = పూర్తిగా; కలవు = వెలసియున్నావు; కల్గుట = ఉండుట; అరుదు + ఎ = ఆశ్చర్యమా (కానేకాదు).

తాత్పర్యము : స్తంభములో ఉండవని హిరణ్యకశిపుడు అరచేతితో స్తంభము కొట్టినాడు. ఉత్తరగర్భంలో ఉండవని బ్రహ్మాస్త్రమును ఉత్తరా గర్భంలోని శిశువుపై అశ్వత్థామ ప్రయోగించెను. అడవిలో ఉండవని దుర్యోధనుడు కోపిష్ఠియైన దుర్వాసముని పాండవులకడకు పంపించెను. సభలో ఉండవనుకొని సుయోధనుడు ద్రౌపదీ వస్త్రాపహరణము చేయించెను. మొదట అక్కడ లేకపోయినను, స్తంభాదులలో నీవు సాక్షాత్కరించినావు. మరి ఈ శ్రీకాకుళములో గుడిలో మొదటి నుండి వెలసియున్న నీవు ఇక్కడ ఉండుట ఆశ్చర్యము కానేకాదు.

10. అంచితాఖండదీపారాధనల చేత
దీపించు నెప్పుడు దేవళంబు
అగరు సాంబ్రాణి ధూపార్పణంబులచేత
భవనంబదెప్పుడు బరిమళించు
నతినృత్యగీత వాద్యస్వనంబులచేత
నెప్పుడు గోవెల యెనక యెనగు
నఖిలోపచార సమర్పణంబులచేత
మెఱయు నెప్పుడు దిరుమేను కళల
నిపు డొకించుక లోభిత్వ మెనసి నట్లు
దోచుచున్నాడ విట్టియద్భుతము గలదె, చిత్ర..

అర్థములు :- దేవళము = నీ గుడి; అంచిత = ఒప్పు; అఖండ = ఎడతెగని; దీపారాధనల చేత = దివ్వెలను వెలిగించుట చేత; ఎప్పుడు = ఏనాడు; దీపించున్ = ప్రకాశించును; భవనంబు, అది = నీ గృహము; అగరు, సాంబ్రాణి = అగరు సాంబ్రాణి మొదలగువాని; ధూప + అర్పణంబులచేతన్ = పొగలు వేయుటచేత; ఎప్పుడు = నిత్యము; పరిమళించున్ = వాసిల్లును ; కోవెల = గుడి; అతినృత్య గీతవాద్య = అధికమైన నర్తనములు, గీతములు, వాద్యముల; స్వనంబులచేతన్ = ధ్వనులచేత; ఎప్పుడు = ఎల్లప్పుడు; ఎనకము + ఎనగున్ = అతిశయించును; తిరుమేను = నీ పవిత్రమైన శరీరము; అఖిల, ఉపచార, సమర్పణంబులచే తన్ = సమస్తమైన సేవలు అందించుటచేత; ఎప్పుడు = ఏ నాడు; కళలన్ = కాంతులతో; మెఱయున్ = ప్రకాశించును; ఇపుడు = ఈనాడు; ఒకించుక = కొంచెము; లోభిత్వము = లోభత్వము; ఎనసినట్లు = పొందినట్లు; తోచుచున్నాడవు = కనిపించుచుంటివి; ఇట్టి అద్భుతము = ఇట్టి ఆశ్చర్యము; కలదె = ఉన్నదా (లేదుకదా).

తాత్పర్యము :- నీ దేవాలయము ఎప్పుడు అఖండ దీపారాధనచేత వెలుగొందేది, అగరు సాంబ్రాణి ధూపములచేత పరిమళించేది, నృత్యగీత వాద్యములతో ఒప్పేది, నీ తిరుమేను షోడశోపచారములతో ప్రకాశించేది? ఇప్పుడు అవి కానరావు. నీవు పిసినిగొట్టు వైనట్లున్నావు.

11. భక్తిజేసిన శిలాప్రతిమ మాత్రమె కాని
హరి యిందు గలుగునా యనెదువారు
స్వామి యిందుండిన సత్యంబు జూపక
యుండునే యని పల్కుచుందువారు
బుద్ధావతారంబు బూనినా డఖిలంబు
గని కనన ట్లుందు ననెదువారు
దేవతామహిమంబు దెలియునో యేమేమి
నడువ నున్నదో యని నుడువువారు
నీకు నిత్యోపచారముల్ లేక యున్న
లోకు లి ట్లాడుకొంద్రు పరా కి దేమి, చిత్ర....

అర్థములు :- భక్తిన్, చేసిన = భక్తితో చెక్కిన; శిలా ప్రతిమ మాత్రమె కాని = కేవలము రాతిబొమ్మ తక్క; ఇందున్ = ఈ రాతి బొమ్మలో; హరి = విష్ణువు; కలుగునా = ఉం దునా ?; అనెదువారు = అని పలుకు వారున్నూ; ఇందున్ = ఈ విగ్రహములో; స్వామి, ఉండినన్ = దేవుడు ఉన్నట్లైతే; సత్యంబున్ = తన మహిమను; చూపక ఉండునే = చూప కుండా ఉండగలడా ?; అని పల్కుచుందువారు = అని పలికే వారునూ; బుద్ధ అవతారంబు = మొద్దు అవతారమును; పూనినాడు = ఎత్తినాడు (అందుకే); అఖిలంబున్ = జరుగుచున్న సమస్తమునూ; కని = చూచియూ; కనని, అట్లు = చూడనట్లు; ఉందున్ = ఉంటున్నాడు; అనెదువారున్ = అనేవారునూ; దేవతా మహిమంబు = దేవుని శక్తి; తెలియునో = మానవులకు స్పష్టమగునోలేదో; ఏమి, ఏమి = ఎట్టివిషయము; నడువన్, ఉన్నదో = జరుగనున్నదో; అని = అంటూ; నుడువువారున్ = పలుకువారునూ; నీకు = దే వుడవైన నీకు; నిత్య + ఉపచారముల్ = ప్రతిదినము జరుగవలసిన సేవలు; లేక, ఉన్నన్ = జరుగకున్నచో; లోకులు = ప్రజలు; ఇట్లు = ఈ విధముగా; ఆడుకొంద్రు = భావి స్తారు; పరాకు + ఇది + ఏమి = ఈ ఫెడ మొగము ఎందుకు ?

తాత్పర్యము :- స్వామీ! నీకు ఇప్పుడు మునుపటి వలె నిత్యోపచారాలు జరగడం లేదు. అందువల్ల ప్రజలు ఈ దేవుడు రాతజేసిన బొమ్మమాత్రమే. ఈ బొమ్మలో విష్ణువు ఎలా ఉంటాడు. ఉంటే, తన మహిమను చూపి సేవలు చేయించు కోకుండా ఉంటాడా ? పట్టి జడావతారము తాల్చినాడేమో! లేకపోతే, తనకు సకల ఉపచారాలు జరగడం లేదని తెలిసికూడా, ఎరుగనట్లు నటిస్తాడా! యేమో దేవుని శక్తి ప్రకటితమగునో లేదో. ఇక ముందు ఏమి జరుగునో! అని అనుకుంటున్నారు. మరినీవు, అందుకు తగినట్లుగానే పరాకు చిత్తగిస్తున్నావు. ఇది నీకు తగదు సుమా!

12. ధర నూటయెనిమిది తిరుపతులందు శ్రీ
కాకుళం బరయ బ్రఖ్యాతమేని
యాంధ్రనాయకుడ వం చఖిలదేశంబుల
నిన్ను గీర్తించుటే నిజమయేని
వైఖానసోక్తికి వంచన రాకుండ
నెరులు చూపినమాట నిజమయేని
వైకుంఠుడవు స్వయంవ్యక్తిగా నర్చావ
తార మొందినమాట తథ్యమేని
వివిధ పూజోత్సవములు నిర్విఘ్నములుగ
జేసికొనకున్న నీకు బ్రసిద్ధి గలదె, చిత్ర...

అర్థములు :- ధరన్ = భూమిపై; నూట, ఎనిమిది, తిరుపతులు + అందున్ = 108 తిరుపతి క్షేత్రములలో; అరయన్ = ఆలోచింపగా; శ్రీకాకుళంబు = శ్రీ కాకుళ క్షేత్రము; ప్రఖ్యాతము + ఏని = ప్రసిద్ధమైనట్లయితే; అఖిల దేశంబులన్ = సమస్త దేశములందు, ప్రజలు; ఆంధ్ర నాయకుడవు + అంచున్ = ఆంధ్రనాయకుడు అనుపేరుతో; నిన్నున్ = నిన్ను; కీర్తించుట + ఏ = పొగడుటయే; నిజము + అ, ఏనిన్ = సత్యమైనట్లయితే; వైఖానస + ఉక్తికి = వైఖానస సూత్రానుసారంగా విష్ణ్వాలయములందు పూజచేసెడి అర్చకుని యొక్క మాటకు; వంచన రాక + ఉండన్ = మోసము రాకుండ (నష్టము కలుగకుండా); నెరులు = శిరోజాలు; చూపిన మాట = చూపిన మాట; నిజమయేని = నిజమైనపక్షాన; వైకుంఠుడవు = విష్ణుదేవుడవైననీవు; స్వయం వ్యక్తిగాన్ = స్వయంవ్యక్తిగా; అర్చావతారమున్ = పూజకు అర్హమైన అవతారమును; ఒందిన మాట = ఎత్తిన మాట; తథ్యము + అ + ఏ నిన్ = నిజమేని; వివిధ = పెక్కురకములైన; పూజా = పూజార్థములైన; ఉత్సవములు = పండుగలు; నిర్విఘ్నములుగన్ = ఎట్టి అడ్డంకులులేకుండా; చేసికొనక + ఉన్నన్ = జరిపించుకోకుండా ఉన్నట్లయితే; నీకున్ = నీకు; ప్రసిద్ధిగలదే = కీర్తి కలుగునా ? (కలుగదు).

తాత్పర్యము :- నీవు వెలసిన శ్రీకాకుళక్షేత్రము భూమిమీది 108 తిరుపతులలో ప్రసిద్ధమైనది అయినట్లయితే, సకల దేశములందును ప్రజలు ఆంధ్రనాయకుడు అని నిన్ను పొగడుట నిజమైనట్లయితే, అర్చకుని మాట మోసపు మాటకాకుండా తలపై కురులు చూపుట నిజమైనట్లయితే, విష్ణుదేవుడవైన నీవు నీయంతటనీవే అర్చావతారంగా వెలసిన మాట నిజమైనట్లయితే, పూర్వంవలె రకరకాల పూజోత్సవాలు నిర్విఘ్నంగా జరిపించుకో. అప్పుడు నీకు ప్రసిద్ధి కలుగుతుంది. పైని చెప్పబడినవన్నీ నిజమే అని నమ్ముతాను. లేకపోతే నమ్మను.

13. మానితంబుగ గరుత్మద్ధ్వజారోహణం
బెప్పు డొనర్తువో చెప్పుమయ్య
గరిమతో నీ తిరుక్కల్యాణ సంభ్రమం
బెప్పు డెప్పుడో వేగ చెప్పు మయ్య
రమతో మహోన్నతరథ మెక్కి తిరువీథు
లెప్పు డేతెంతువో చెప్పు మయ్య
ధరణి నభ్యాగతదాస ప్రజాబృంద
మెప్పుడో బలియునో చెప్పుమయ్య
వత్సరోత్సవ వీక్షణవాంఛ జనుల
కెపుడు ఫలియించునో యానతీ గదయ్య, చిత్ర...

అర్థములు :- మానితంబుగన్ = గౌరవముతో; గరుత్మత్ ధ్వజ + ఆరోహణంబు = గరుడధ్వజము నెత్తుట; ఎప్పుడు + ఒనర్తువు + ఓ = ఎప్పుడు చేసెదవో; చెప్పుము + అయ్య = చెప్పుము; గరిమతో = గొప్పదనముతో; నీ = నీ యొక్క; తిరుక్కళ్యాణ = దేవుని పెండ్లిఅనే; సంభ్రమంబు = సంబరము (వేడుక); ఎప్పుడెప్పుడో = ఎప్పుడు జరుగునో; వేగన్ = తొందరగా; చెప్పుము + అయ్య = చెప్పుము; రమతోన్ = లక్ష్మీదేవితో గూడి; మహా + ఉన్నత = మిక్కిలి ఎత్తైన; రథము + ఎక్కి = రథమునెక్కి; తిరువీధులు = దేవుని వీధులకు; ఎప్పుడు + ఏ తెంతువో = ఎప్పుడు వచ్చెదవో; చెప్పుము + అయ్య = చెప్పుము; ధరణిన్ = భూమిపై; అభ్యాగత = అతిథులైన; దాస ప్రజాబృందము = భక్తుల యొక్క సమూహము; ఎప్పుడు = ఎప్పుడు; బలియునో = వృద్ధి పొందునో (పెరుగునో); చెప్పుము + అయ్య = చెప్పుము; వత్సరోత్సవ = ప్రతి ఏడాది జరుగు తిరునాళ్ల; వీక్షణ = చూడవలెనను; వాంఛ = కోర్కె; జనులకున్ = ప్రజలకు; ఎప్పుడు = ఎప్పుడు; ఫలియించును + ఓ = నెఱవేఱునో; ఆనతి + ఈన్ + కద + అయ్య = సెలవియ్యవయ్యా.

తాత్పర్యము :-గరుడధ్వజమునెప్పుడు ఎత్తించుకొందువో నీ పెండ్లి సంబరమెప్పుడు జరుగునో, లక్ష్మీదేవితో రథమెక్కి ఎప్పుడు తిరువీధులలో ఊరేగెదవో, దూరము నుండివచ్చే భక్తుల సంఖ్య ఎప్పుడు పెరుగునో చెప్పుము. ఈవిధముగా ప్రతియేట జరిగే నీ తిరునాళ్ళు చూడగోరే ప్రజలకోర్కె ఎప్పుడు తీరునో సెలవిమ్ము.

14\. తగునట్లు తిరుమేను తా నామతింపుచు
మిన్న పీతాంబరం బున్న దనుచుఁ
గమలతోఁ బుట్టిన కౌస్తుభం బది పోవఁ
దక్కు సొమ్మది నీకు తక్కె ననుచు
లలితరత్న ద్యుతి మొలచినట్లు కిరీట
ముత్తమాంగముఁ బాయ కున్న దనుచు
మండిత మాణిక్యకుండలంబులు కర్ణ
యుగళితోఁ బుట్టిన ట్లున్న వనుచు
నిందుకొన్నావు గడియించు నేరుపరివె
ప్రావలువ బ్రారువాణముల్ బ్రాతి యేమి? చిత్ర

అర్థములు:- తిరుమేను = నీ పవిత్రమైన దేహము; తగునట్లు = ఒప్పునట్లు; తాను, ఆమతింపుచు = తాను అలంకరించుచు; మిన్న పీతాంబరంబు = శ్రేష్ఠమైన బంగారు వలువ; ఉన్నది + అనుచున్ = ఉన్నదని; కమలతోన్ = లక్ష్మీదేవితో బాటు; పుట్టిన = సముద్రమునుండి వెలువడిన; కౌస్తుభంబు + అది = కౌస్తుభము అను ఆ మణి; పోవన్ = నష్టము కాగా; తక్కు, సొమ్ము + అది = మిగిలిన నగ; నీకున్, దక్కెన్, అనుచున్ = లభించినదని; లలిత రత్నద్యుతి = సొగసైన రత్నముల కాంతి; మొలచిన, అట్లు = పుట్టినట్లు; కిరీటము = మకుటము; ఉత్తమాంగమున్ = శిరసును; పాయక, ఉన్నది, అనుచున్ = విడువక యున్నది అని; మండిత = ప్రకాశించు; మాణిక్య కుండలంబులు = కెంపులు పొదుగబడిన కర్ణభూషణములు; కర్ణయుగళితోన్ = వీనుల జంటలో బాటు; పుట్టిన, అట్లు, ఉన్నవి, అనుచున్ = కలిగినట్లు ఉన్నవి అవి; నిందుకొన్నావు = సంతోషించినావు; గడియించు నేరుపరివె = క్రొత్తవి సంపాదించు శక్తి కలవాడవా?; ప్రావలువ (ప్రాత + వలువ) = చిరకాలము నుండియున్న వస్త్రము; ప్రారువాణముల్ (ప్రాత + రువాణముల్) = మాసిన కాంతులు; బ్రాతి ఏమి = ఇష్టమాయేమి.

తాత్పర్యము:- మేనిపై నీవు తాల్చు పీతాంబరము ఎప్పటిది? నీవు ఎదపై ధరించు కౌస్తుభము ఏది? మరేవో నగలు తాల్చినావు. కిరీటమెప్పటిది? మాణిక్య కుండలములు ఏనాటివి? అన్నీ పాతవే. కొత్తవి సంపాదించు శక్తి లేదా? పాత అలంకారము లంటేనే ఇష్టమా నీకు?

15. వంచన గాదె దివ్యక్షేత్రపతులలో
మంత్రార్థకృత్యము ల్మాని యున్న?
నపకీర్తిగాదె లోకాలోకములయందు
వత్సరోత్సవములు వదలి యున్న?
నగుబాటు గాదె యన్యమతస్థజనులలో
నిజదాసకోటి మన్నింపకున్నC?
బరిపాటి గాదె యల్పజ్ఞానమతులలో
దేవతామహిమంబుC దెలుపకున్న?
నేంటిదా నీప్రతిష్ఠ వర్ణించి చూడం
బాడి దప్పిన బలునిందపాలు గావె? చిత్ర...

**అర్థములు:-** మంత్ర + అర్థ, కృత్యముల్ = మంత్ర పూర్వకముగా చేయు హోమము మొదలగునవి; మాని, ఉన్నన్ = మానివేసినచో; దివ్య క్షేత్రపతులలో = గొప్ప క్షేత్రము లందలి వేల్పులలో; వంచన కాదె = అవమానము కాదా?; వత్సర + ఉత్సవములు = ప్రతియేట చేయు పండుగలు; వదలి ఉన్నన్ = చేయక వదలివేసినచో; లోక + ఆలోకముల యందున్ = లోకులదృష్టిలో; అపకీర్తి కాదె = దుష్కీర్తి కాదా?; నిజదాన కోటిన్ = సొంత భక్తుల సమూహమును; మన్నింప కున్నన్ = ఆదరింపనిచో; అన్య మతస్థజనులలో = ఇతర మతములు అవలంబించిన వారిలో; నగుబాటు కాదె = ఎగతాళి కాదా?; దేవతా మహిమంబు = దేవుని మహిమను; తెలుపకున్నన్ = ప్రకటింపనిచో; అల్పజ్ఞాన మతులలోన్ = కొద్దిపాటి జ్ఞానము కలిగిన వారిలో; పరిపాటి కాదె = అపనిందకాదా?; నీ ప్రతిష్ఠ = నీ పరువు; వర్ణించి చూడన్ = వర్ణింపదలచిన యెడల; నేటిదా = ఇప్పటిదా; పాడి తప్పినన్ = పద్ధతి మీఱినచో; బలునింద పాలుకావె = గొప్పనిందకు వశమగుదువు కాదా?

**తాత్పర్యము:-** మంత్ర పూర్వకంగా జరిగే హోమాదులను మానివేస్తే సాటి దేవుళ్లలో అవమానము. ఏటా జరిగే తిరునాళ్లు జరపకుంటే దుర్యశము. స్వభక్తులను రక్షింపక పోతే అన్యమతాల వారిలో నవ్వుల పాలగుట తప్పదు. నీ మహిమను ప్రదర్శింపకుంటే మూర్ఖులలో నీమీది నమ్మకం పోతుంది. నీ కీర్తి ఈనాటిది కాదు. యుగయుగాల నుండే ఉన్నది. నీవు ఆచారాలను అతిక్రమిస్తే మిక్కిలి నిందకు గురికాకతప్పదు. కాబట్టి తిరునాళ్లు మొదలగు ఆచారాలు మునుపటి వలె జరిపించుకో.

16. తిరునాళ్ళతటి వచ్చె బరిపరివిధముల
నెలమి సామగ్రి జేయింప వేమి ?
సేవకు లందందు సేవింప భావింప
తిరువీథుల రథంబు ద్రిప్పవేమి ?
వృజిన మెల్ల దొలంగు నిజ మంచు బ్రజ లెంచు
పరమప్రసాదంబు బంచవేమి
దివ్య దేశం బిది తీర్థంబు సార్థంబు
చక్రతీర్థము కృప సలుప వేమి ?
హతము గావించి నీయన్వయంబు లెత్తి
కీర్తి నిందగ వర్ణించి గేలిపఱతు, చిత్ర....

అర్థములు :- తిరునాళ్లతటి = ఉత్సవ సమయము; వచ్చెన్ = సమీపించెను; పరివరి విధములన్ = పెక్కు రకముల; సామగ్రిన్ = పదార్థ సంచయము; ఎల మిన్ = సంతోషముతో; చేయింపవు + ఏమి = ఎందుకు సిద్ధము చేయింపవు ?; సేవకులు = భక్తులు; అందున్ + అందున్ = ఆయాప్రదేశములలో; సేవింపన్ = కొలుచుటకును; భావింపన్ = ధ్యానించుటకును; రథంబున్ = తేరును; తిరువీధులన్ = వీధులలో; త్రిప్పవు + ఏమి = ఎందుకు త్రిప్పుట లేదు; వృజినము + ఎల్లన్ = పాపమంతయు; తొలంగున్ = పోవును; నిజము = వాస్తవము; అంచున్ = అనుచు; ప్రజలు = జనులు; ఎంచు = భావించు; పరమ ప్రసాద = గొప్ప నైవేద్యము; పంచవు + ఏమి = పంచిపెట్టవేల; ఇది = ఈ శ్రీకాకుళక్షేత్రము; దివ్యదేశంబు = పుణ్య ప్రదేశము; తీర్థంబు= పుణ్య క్షేత్రమును; స్వార్థంబు = స్వప్రయోజనమును; చక్రతీర్థము = చక్రతీర్థం అనే కొలనును; కృప + చలువవు + ఏమి = దయ చూడవేమి; హతమున్ + కావించి = పీడించి; నీ అన్వయంబులు + ఎత్తి = నీవంశములను బయటపెట్టి; కీర్తినిందగన్ = కీర్తి గర్భితమైన నిందారూపముగా; వర్ణించి = పొగడి; గేలిపఱతును = పరిహసించెదను.

తాత్పర్యము :- నీ తిరునాళ్ల సమయము దగ్గఱపడింది. రకరకాల పదార్థముల రాశులను సిద్ధపఱచవేం ? నీ భక్తులు అయాచోట్ల సేవించుటకు రథమును వీధులలో త్రిప్పవేం. నీ ప్రసాదము పాపములను తొలగించునని ప్రజలు అనుకొందురు, పంచిపెట్టవేం. 108 తిరుపతులలో ఈ శ్రీకాకుళ క్షేత్రము గొప్పది. తీర్థమూ, స్వార్థమూ. ఎండిపోతున్న చక్రతీర్థమనే కొలనును కరుణింపుము. అట్లుచేయనిచో నేను నీ వంశమును బయటపెట్టే నిందా ముఖముగా గేలి చేసెదను.

17. చెల్లింప దగునె వ్రేపల్లెలో గల వెట్టి
గొల్లయిల్లాండ్రను గొల్లగొనగ?
మెక్కంగ దగునె ము న్నెక్కిండ్లలో నుట్ల
కెక్కి పాల్వెన్నలు డొక్క నిండ?
మ్రుచ్చిల దగునె మళ్ళుచ్చి జలక మ్మాడు
మచ్చెకంటుల కోక లిచ్చకముగ?
మ్రొక్కంగ దగునె ముం దొక్కపువ్వునకు దా
గక్కసించినయాలి కక్కజముగ
నిట్టి నగుబాటుపనులు నీ వెన్ని కలుగ
జేసినాదవు మంచిప్రసిద్ధకుడవె చిత్ర....

అర్థములు:- వ్రేపల్లెలోన్, కల = గొల్లపల్లెలో ఉండే; వెట్టి = అమాయికలైన; గొల్ల ఇల్లాండ్రను (ఇల్లు + ఆలు) = గొల్ల స్త్రీలను; కొల్లగొనగన్ = దోచుకొనుట; చెల్లింపన్ + తగునె = నెఱవేర్చుకొనుట న్యాయమగునా?; మున్ = పూర్వము (ద్వాపర యుగములో); ఉట్లకు + ఎక్కి = ఉట్లెక్కి (ఉట్టి + లు); పాల్ + వెన్నలు = పాలువెన్న; డొక్క నిండగాన్ = కడుపునిండేటట్లుగా; మెక్కంగన్ + తగునె = భక్షించుట న్యాయమా; మళ్లు + ఉచ్చి = పరిశుద్ధ వస్త్రములు విడిచి (మడి + లు); జలకమ్ము + ఆడు = స్నానము చేయు; మచ్చెకంటుల = స్త్రీల; కోకలు = చీరలు; ఇచ్చకముగన్ = తలపులో; మ్రుచ్చిల దగునె = దొంగిలించుట న్యాయమా?; ముందు = పూర్వము; ఒక్క పువ్వునకున్ = ఒక్కపువ్వుకోసమై; తాము = తాము; కక్కసించిన = బాధించు; ఆలికిన్ = భార్యకోసం; అక్కజముగన్ = ఆశ్చర్యముగా; మ్రొక్కంగన్ + తగునె = నమస్కరించుట న్యాయమా; ఇట్టి = ఈ రకములైన; నగుబాటు పనులు = నవ్వదగిన చేష్టలు; నీవు = నీవు; ఎన్ని = ఎన్నింటిని; కలుగన్ + చేసినాదవు = చేసినావు; మంచి ప్రసిద్ధకుడవె = మంచి పేరుగలవాడవే.

తాత్పర్యము:- వ్రేపల్లెలో అమాయికలైన గోపస్త్రీల శీలమును దోచుట న్యాయమా? దొంగచాటుగా ఉట్లెక్కి పాలువెన్నలను మెక్కుట తగునా? వలువలూడ్చి స్నానమాడు జవరాండ్ర చీరల నెత్తుకపోయి చెట్టెక్కుట యుక్తమా? పారిజాత పుష్పంకోసం పీడించు భార్య పాదములకు నమస్కరించుట తగునా? ఇట్టి నగుబాట పనులెన్నిటినో చేసినావు. అప్రతిష్ఠపాలయినావు.

18. అబ్బుకో గలవా కాయక్లేశ మొనరించు
దేవాసురు లటుండ దివ్యరమను
దోచుకో గలవా చే పాచి లోకము లాచి
బలిమహాదాత వైభవము లెల్ల
రా దీయగలవా సత్రాజిత్తు డీకున్న
మణిస్యమంతక మొక మమత గొల్పి
నాటించ గలవా సన్నకసన్ననె వనంబు
పెట్టు మ్రా వ్రెకలించి పెరటిలోన
దెమ్ముకొన వేమి వస్త్రాన్న దీపధూప
గంధ తాంబూలములకైన గడన దెలిసె, చిత్ర...

అర్థములు:- కాయక్లేశము + ఒనరించు = శరీరకష్టము చేయు; దేవ + అసురులు + అటు + ఉండన్ = దేవతలు, రాక్షసులు మానివేసినచో; దివ్యరమను = గొప్పదైన లక్ష్మిని; అబ్బుకోగలవా = పొందగలవా?; చే + చాచి = చేతిని చాపి; లోకములు + ఆచి = లోకములను అపహరించి; బలి మహాదాత = బలియను గొప్పదాత యొక్క; వైభవములు + ఎల్లన్ = సమస్త భోగములను; దోచుకోగలవా = కొల్లగొట్టగలవా?; ఒక మమత గొలిపి = ఇష్టము కలుగునట్లు చేసి; సత్రాజిత్తుడు = సత్రాజిత్తు; ఈక + ఉన్నన్ = ఈయకుండినచో; మణిన్స్యమంతకమున్ = మణియైన స్యమంతకమును; రాదీయగలవా = సంపాదించగలవా; వనంబు పెట్టుమ్రాన్ = నందనవనములోని కల్పవృక్షమును; సన్నక సన్ననె = మెల్లమెల్లగా; పెకలించి = పెల్లగించి; పెరటిలో = నీ దొడ్డిలో; నాటించగలవా = నాటించ గలవా?; వస్త్ర + అన్న, దీప, ధూప, గంధ, తాంబూలములకున్ + ఐనన్ = వస్త్రములకు, అన్నమునకు, దీపమునకు, ధూపములకు, చందనమునకు, తాంబూలముంకు కూడ; తెమ్ముకొనవు + ఏమి = సంపాదించుకో లేకున్నావేల?; గడన, తెలిసెన్ = నీ సంపాదన అసలు స్వరూపం అర్థమైనది.

తాత్పర్యము:- దేవాసురులు కష్టపడి పాలసముద్రమును మథించనిచో లక్ష్మిని పొందలేవుకదా. దేహి యని బలిని యాచించి ఆకాశమును భూమిని ఆక్రమించలేవు కదా! సత్రాజిత్తు, సత్యభామతో పాటు ఇవ్వకున్నచో స్యమంతకమణిని పొందలేవుకదా! నందన వనములో పెరిగిన పారిజాత వృక్షమును పెల్లగించి నీ పెరటిలో నాటించలేవుకదా ఇంద్రుడు అంగీకరించకున్నచో. ఇతరుల దయ వలన ఇవన్నీ సాధించినావు. అంతేకాని నీ తెలివికాదు. కనీసం ధూపదీపాదుల ఆర్జించలేవు. నీ సంపాదన శక్తిమాకుతెలియదా యేమి?

19. తలను బింఛెపుదండ ధరియించవలె గాని
మణికిరీటము బెట్ట మనుజపతివె?
గళమున వనమాలికలు పూనవలె గాని
హారము ల్వేయ దేశాధిపతివె?
కరమున మురళి చక్కగ బూనవలెగాని
శాతాసి బూనంగ క్షత్రియుడవె?
తనువు గోక్షీరవాసన గుప్పవలె గాని
చందనం బలద రాజవె తలంప?
నెల్లలోక మెఱింగిన గొల్లవాడ
వేది కుల మింత రాజన మేమి నీకు? చిత్ర...

**అర్థములు:–** తలను = తలపై; పింఛెము + దండ = నెమలిపింఛెము కూర్చిచేసిన దండ; ధరియించవలెగాని = పెట్టుకోవలెను తప్ప; మణి కిరీటమున్ = మణులు కూర్చిన కిరీటమును; పెట్టన్ = పెట్టుటకు; మనుజపతివె = రాజవాయేమి?; గళమునన్ = మెడలో; వనమాలికలు = మోకాళ్ల వరకు వ్రేలాడు పూలదండలు; పూనవలెన్, గాని = ధరించవలెను తప్ప; హారముల్ వేయన్ = ముత్యాల దండలు వేసుకొనుటకు; దేశ + అధిపతివె = ఒక దేశమునకు ప్రభుడవా; కరమునన్ = చేతిలో; మురళిన్ = పిల్లనగ్రోవిని; చక్కగన్ = అందముగా; పూనవలెన్ కాని = ధరింపవలెను తప్ప; శాత + అసి = వాడియైన కత్తిని; పూనంగన్ = ధరించుటకు; క్షత్రియుడవె = రాచవాడవా?; తనువు = శరీరము; గోక్షీర, వాసనన్ = ఆవుపాల సువాసన; గుప్పవలెన్, కాని =వెదచల్లవలెను గాని; చందనంబు + అలదన్ = మంచి గందమును పూసికొనుటకు; తలంపన్ = ఆలోచింపగా; రాజవె = రాజువా; ఎల్లలోకము = లోకమంతయు; ఎఱిగిన = ఎఱిగిన; గొల్లవాడవు = గోపకులజుడవు; ఏది కులము= నీకు కులమెక్కడ?; నీకున్ = నీకు; ఇంత = ఇంతటి; రాజనము = తగని గర్వము (రజో గుణమువలన కలిగినది); ఏమి = ఎందుకు?

**తాత్పర్యము:–** శ్రీకాకుళాంధ్రదేవా! నీవు తలపై నెమలి పింఛెము ధరింపమాని మణికిరీటము ధరించినావు. నీవు ప్రభుడవా యేమి? మెడలో వన మాలలను తాల్చుటకు మారుగా ముత్యాలసరులు తాల్చితివి. దేశాధిపతివాయేమి? చేత పిల్లగ్రోవిని పూనక ఖడ్గమును పూనితివి. క్షత్రియుడవా యేమి? నీ శరీరము ఆవుపాలవాసన కొట్టవలెను కదా. ఒంటికి మంచి గందమును పూసికొంటివి. నీవు రాజవా యేమి? కాదుకదా! నీవు గొల్లవని అందరికినీ తెలియును. నీకుల మెక్కడ? నీ యీ దుర్గర్వమెక్కడ?

20. కన్నవారల మున్ను కారాగృహంబున
విడిచి పాఱితివి నీ కడిమి యేమి ?
పగవాడు పురిటిలో బట్టి నెత్తుకపోవ
దమకించుచున్న నీధైర్య మేమి ?
ముద్దుమన్మని గోప్యముగ వాడు బంధింప
దెలియనట్లున్న నీ తెగువ యేమి ?
వైరిధాటికి నోడి వనధి మధ్యమునందు
నిలు గట్టుకొన్న నీబలిమి యేమి ?
విఱిగి తిరి గెన్నడెన్నడో తఱి యెఱింగి
యొరుల నడచితి వది యేమి భరమునీకు ? చిత్ర...

అర్థములు :- మున్ను = పూర్వము; కన్నవారలన్ = తల్లిదండ్రులను; కారాగృహంబునన్ = చెరసాలలో; విడిచి = విడిచిపెట్టి; పాఱితివి = పరుగిడినావు; నీ కడిమి = నీపరాక్రమము; ఏమి = ఏ మున్నది; పగవాడు = శత్రువు; పురిటి లోన్ = పురిటింటనే; పట్టిన్ = కొడుకును; ఎత్తుకు పోగానే = దొంగిలించుకొని పోగా; తమకించుచున్న = జంకుచున్న; నీ ధైర్యము = నీ దిట్టతనము; ఏమి = ఎటువంటిది ?; ముద్దుమన్మనిన్ = ప్రియమగు మనుమని; గోప్యముగన్ = రహస్యముగా; వాడు = అప్పుడు; బంధింపన్ = చెరబెట్టగా; తెలియనట్లు + ఉన్న = ఏమియు తెలియనట్లు నటించిన; నీ తెగువ = నీ సాహసము; ఏమి = ఎటువంటిది ?; వైరిధాటికిన్ ఓడి = శత్రువుందాడికి భయపడి; వనధి మధ్యమునందున్ = సముద్రమధ్యములో; ఇల్లు కట్టుకొన్న = గృహమును కట్టుకొనిన; నీ బలిమి = నీ బలము; ఏమి = ఎటువంటిది; విఱిగి = పారిపోయి; తిరిగి = మరల; ఎన్నడొ + ఎన్నడో = అప్పుడప్పుడు; తఱి, ఎఱింగి = వీలు చూచుకొని; ఒరులను = శత్రువులను; అడచితివి = చంపితివి; నీకు = నీకు; అది, ఏమి = అది యెట్టి; భరము = బరువు ?

తాత్పర్యము :- కన్న తల్లితండ్రులను చెరలో విడిచిపెట్టి వ్రేపల్లెకు చేరితివి. శంబరా సురుడు పురిటిలోనే నీ పుత్రుడైన ప్రద్యుమ్నుని అపహరించు కొనిపోగా, మనుమడైన అనిరుద్ధుని బాణాసురుడు బంధింపగా తెలియనట్లు నటించితివి. శత్రువుల దాటికి భయపడి సముద్రమధ్యంలో ద్వారకా నగరము నిర్మించుకొంటివి. అంతేకాని ధైర్యసాహస పరాక్రమములను చూపలేదు. ఎప్పుడో అదనుకనిపెట్టి శత్రువులను సంహరించితివి. అది కష్టము కాదుకదా!

21. భిల్లాంగనాదంతపీడిత ఫలభుక్తి
హేయంబు దోఁచలే దింత నీకు
సంక్రందనాత్మజ స్యందన సారథ్య
మెరుసుగాఁ దోఁచలే దింత నీకు
గోపాలకానేక గోవత్సపాలనం
బెగ్గుగాఁదోఁచలే దింత నీకు
వ్రజబాలికా ముక్తవస్త్రాపహరణము
హీనమై తోఁచలే దింత నీకు
నుచ్చనీచంబు లెఱుఁగక యిచ్చఁజేయు
చేష్ట లివి భక్తహితమతిఁ జేసి తండ్రు చిత్ర....

అర్థములు:- భిల్ల + అంగనా = శబర స్త్రీ యొక్క; దంతపీడిత = దంతములచే కొఱుకబడిన; ఫలభక్తి = పండ్లు తినుట; నీకున్ = నీకు; ఇంత = కొంచెమును; హేయంబున్ = నీచముగా (అసహ్యముగా); తోచలేదు = అనిపించలేదు; గోపాలక = గొల్లల; అనేక = పెక్కు; గోవత్స = ఆవు, దూడలను; పాలనంబు = రక్షించుట (మేపుట); నీకున్ = నీకు; ఇంత = కొంచెమును; ఎగ్గుగాన్ = అవమానముగా; తోచలేదు = అనిపించలేదు; వ్రజబాలికా = గోప యువతులచే; ముక్త = విడువబడిన; వస్త్ర = వలువలను; అపహరణము = దొంగిలించుట; నీకున్ = నీకు; ఇంత = కొంచెమును; హీనము + ఐ = నీచముగా, తోచలేదు = అనిపించలేదు; ఉచ్చనీచంబులు = గొప్పవియేవో, కొలదివియేవో; ఎఱుగక = తెలియక; ఇచ్చన్ = ఇష్టముతో; చేయు = చేసినటువంటి; చేష్టలు + ఇవి = పనులివి; భక్త హితమతిన్ = భక్తులకు మేలుజేయు తలపుతో; చేసితి = నీవు చేసితివని; అండ్రు = కొందఱు అందురు.

తాత్పర్యము:- శబరి ఎంగిలి చేసిన పండ్లు తింటివి. అర్జునుని తేరు నడిపితివి. ఆల మందను మేపితివి. గోప స్త్రీల చీరలను దొంగిలించితివి. ఇవి నీవు చేయదగని హీనకార్యములు. నీకు ఉచ్చనీచములు తెలియవు. అయినను కొందరు ఈ పనులు భక్తుల మీది ప్రేమతో చేసినవని సమర్థించుచున్నారు. అది నిజమే అని నిందాముఖమున స్తుతి.

22. విమతభూపతు లెట్లు విముఖులై పాఱిరో
రాజపీఠం బెక్కరాని నీకు
కుంభినీధవు లెట్లు కూతుంద్ర నిచ్చిరో
కుల మెన్నకయె నీకు గోపకునకు
సుందరీమణు లెట్లు చూచి మోహించిరో
క ప్పగు మైచాయ గలుగు నీకు
దాసజనం బెట్లు దాస్యంబు నలిపిరో
తిరియువానిని మారు తిరియు నీకు
మమత నీలీల లటు సూచి భ్రమసి రేమొ
తగుదువే యిట్టిఘనతకు దంభరూప చిత్ర...

అర్థములు :- దంభరూప = లీలామానవా!; రాజపీఠంబు + ఎక్కరాని = సింహాసనమెక్కుటకు అర్హతలేని; నీకున్ = నీకు; విముఖులు + ఐ = పెడ మొగముపెట్టి; విమతభూపతులు = శత్రురాజులు; ఎట్లు = ఏ విధముగా; పాఱిరో = యుద్ధభూమినుండి పరుగెత్తి పోయినారో; కులము + ఎన్నకయె = కులమును పట్టించుకొనకుండనే; గోపకునకున్ = గొల్లడవైన; నీకున్ = నీకు; కుంభనీధవులు = ధరాధిపతులు; కూతుంద్రను = తమ కుమార్తెలను; ఎట్లు = ఎట్లు; ఇచ్చిరో = ఇచ్చినారో; కప్పు + అగు = నల్లని; మైచాయ = శరీర వర్ణము; కలుగు = కల; నీకున్ = నిన్ను; చూచి = చూచి; సుందరీ మణులు = అందగత్తెలలో మిన్నలైనవారు; ఎట్లు = ఎట్లు; మోహించిరో = వలచినారో; తిరియువానిని = బిచ్చమెత్తువానిని; మారు = తిరిగి; తిరియు = యాచించు; నీకున్ = నీకు; దాసజనంబు = భక్తులు; ఎట్లు = ఎట్లు; దాస్యంబు = సేవ; నలిపిరో = చేసిరో; మమతన్ = అనురాగముతో; నీ లీలలు + అటు, చూచి = నీ మాయలు ఆవిధముగా చూచి; భ్రమసిరి + ఏమొ = పొరపాటు పడినారేమొ (అంతేకాని); ఇట్టి ఘనతకు = ఇట్టి హోదాకు; తగుదువు + ఏ = నీకు అర్హుడవా (కాదు).

తాత్పర్యము :- మాయామానుష విగ్రహా! క్షత్రియుడవు కాని నీకు శత్రురాజులు వెన్నుచూపిరి. అల కాపరివైన నీకు రాజులు కుమార్తెల నిచ్చి పెండ్లిచేసిరి. నల్లని వాడవైన నిన్ను సుందరీమణులు మోహించిరి. భిక్షుకుడగు కుచేలుని అటుకులకై యాచించిన నీకు భక్తులు, దాస్యముచేసినారు. కారణమేమో తెలియదు. నీ నటనను చూచి నీవు గొప్పవాడవని భ్రమ పడియుందురు. అంతేకాని ఇట్టి హోదాకు నీవు తగవుసుమా!

23. విక్రమాక్రమిత భూచక్రుడౌ హేమాక్షు
పొంగణంచుటలు కోణంగితనము
కరగతామృతకుంభ గర్వితాసురకోటి
దూలగొట్టుటలు గయ్యాళితనము
కుచపూర్ణ విషదుగ్ధకుటిల యౌ పూతన
పేరు మాయించుట పిల్లతనము
కంసపురీ ద్వారగమనావరోధి యౌ
మదకరి నీడ్చుట మకురుతనము
వడిగలతనంబులా యివి? గడన యేమి
కొర్దిపను లివి నీ కిది పెద్దతనమె? చిత్ర...

అర్థములు :- విక్రమ = పరాక్రమముచేత; ఆక్రమిత = ఆక్రమింపబడిన; భూచక్రుడు + ఔ = భూచక్రము కలిగిన; హేమాక్షు = హిరణ్యాక్షుని యొక్క; పొంగు = గర్వమును; అణంచుటలు = అణచుట; కోణంగితనము = కొంటెతనము; కరగత = చేతిలోని; అమృతకుంభ = అమృతములో నిండిన కలశము చేత; గర్విత = గర్వించిన; అసురకోటిన్ = రాక్షస సమూహమును; తూలన్, కొట్టుటలు = పాఱద్రోలుట; గయ్యాళితనము = జగడగొండితనము (ధూర్తత్వము); కుచ = పాలిండ్లలో; పూర్ణ = నిండిన;విష= విషముతో గూడిన;దుగ్ధ = పాలచేత; కుటిల + ఔ = కపటబుద్ధికల; పూతన = పూతనయను రాక్షస స్త్రీ యొక్క; పేరు మాయించుట = చంపుట; పిల్లతనము = చిన్నపిల్లపని; కంసపురీ = కంసుని రాజధానియైన మధురానగరము యొక్క; ద్వార = సింహద్వారమును; గమన = ప్రవేశించుట; అవరోధి, ఔ = అడ్డుకొనిన; మదకరిన్ = మదపు టేనుగును; ఈడ్చుట = పట్టిలాగుట; మకురుతనము = మొండితనము; వడి గల తనంబులా, ఇవి = ఇవి శూరుని గుణాలా?; గడన, ఏమి = వీటిలెక్కయేమి; కొర్దిపనులు + ఇవి = ఇవి చిన్నపనులు; నీకున్ = నీకు; ఇది = ఇట్టి చిన్నపనులు చేయుట; పెద్దతనమె = గొప్పతనమా?

తాత్పర్యము :- భూమిని చుట్టగా చుట్టిన హిరణ్యాక్షుని వరాహావతారము దాల్చిచంపితివి. మోహిని రూపము ధరించి రాక్షసుల చేతికిచిక్కిన అమృత భాండమును వారికి కాకుండ చేసితివి. నీకు విసపుబాలొసగ వచ్చిన పూతనయను రక్కసిని చంపితివి. కంసుని పట్టణములోనికి వెళ్లనీకుండ నిన్ను అడ్డగించిన కువలయాపీడము అను మత్తగజమును నేలపై ఈడ్చిచంపితివి. ఇవి నీ పౌరుషమును ప్రకటించు పనులు కానేకావు. అల్పకార్యములు. పంది మొదలగు రూపములు ధరించి చేసిన పనులు నీకు గౌరవాపాదకములు గావు.

24. కెరలి కంసుదు నిన్ను నఱక గాచినవాని
బారి సోదరి ద్రోచి పాఱినావు
సరిపోర నరకు నొంచగ లేక చేతివి
ల్లాలిచే నిడి దండ నలరినావు
తెగడి బంధువు లాజి దిట్టి కొట్టగ నోర్చి
వైదర్భి జేపట్టి వచ్చినావు
దర్పకోద్ధతి కెంతొ తత్తరపడి నిజ
స్త్రీ పదాబ్జముల జే మోపినావు
నీపరాక్రమ మిట్టిది నిఖిలజగము
లాజ్ఞ మీఱక నిల్చుట యద్భుతంబు, చిత్ర...

అర్థములు :- కెరలి = కోపించి; కంసుదు = కంసరాజు; నిన్నున్ = నిన్ను; నరకన్ = చంపుటకు; కాచినన్ = కాచుకొని యుండగా; వానిబారిన్ = వానివల్ల కలిగే హింసకు; సోదరిన్ = తోబుట్టువును; ద్రోచి = అప్పగించి నెట్టివేసి; పాఱినావు = పరుగెత్తితివి; సరిపోరన్ = సమయుద్ధములో; నరకున్ = నరకుని; నొంచగలేక = చంపజాలక; చేతివిల్లు = చేతియందలి ధనుస్సును; ఆలిచేన్, ఇడి = భార్యచేతికి ఇచ్చి; దండ = దగ్గర; అలరినావు = ఉన్నావు; తెగడి = నిందించి; బంధువులు = చుట్టములు; ఆజిన్ = యుద్ధములో; తిట్టి = దూషించి; కొట్టగన్ = పైబడి కొట్టగా; ఓర్చి = సహించి; వై దర్భిన్ = రుక్మిణిని; చేపట్టి = చేతితో పట్టుకొని; వచ్చినావు = ద్వారకకు చేరినావు; దర్పక + ఉద్ధతికిన్ = మన్మథుని పొగరునకు; ఎంతో = మిక్కిలి; తత్తరపడి = కలతపడి; నిజస్త్రీ = భార్యయొక్క; పద + అబ్జములన్ = పద్మములవంటి కాళ్లపై; చేన్ = చేతిని; మోపినావు = చేర్చినావు; నీ పరాక్రమము = నీ పౌరుషము; ఇట్టిది = ఇటువంటిది; నిఖిలజగము = లోక మంతయు; ఆజ్ఞన్ = నీ ఆనతిని; మీరక = దాటకుండ; నిలుచుట = నడచుకొనుట; అద్భుతము = ఆశ్చర్యకరము.

తాత్పర్యము : కంసుదు నీవు పుట్టగానే చంపివేయుటకు ఎదురుచూచు చుండగా నీవు వ్రేపల్లెకు పారిపోయి నీ సోదరి (యోగమాయ)ని కంసుని బారికి విడిచిపెట్టినావు. యుద్ధములో నరకుని సంహరింప లేక చేతివిల్లును భార్య కందించి ప్రాణాలను రక్షించు కొంటివి. చుట్టములు యుద్ధములో తిట్టినను, కొట్టినను సహించి రుక్మిణిని తెచ్చుకొన్నావు. మదన తాపమునకు తాళలేక అనుగ్రహింపమని భార్య కాళ్లపై బడినావు. నీ పౌరుషము ఇటువంటిది. నీవు పిరికివాడవని తేలినది. అయినను లోకులు నిన్నే కొల్తురు. వింత!.

25. వ్రేపల్లెలో గొల్లవెలదులు గొట్టరా
దాడిదాడి యుల్లిల్లు దూఱలేదా
రాసకేళిక యందు రమణులా యెందఱో
చుట్టి పట్టిన బాఱ జూడలేదా
పదియాఱు వేల భూపకుమారికలు తేఱి
పాఱ జూచిన మతి భ్రమయలేదా
ప్రణయవాదంబున భార్య లా యెనమండ్రు
గసరివేసిన గూర్మి గొసరలేదా
తలిరుబోడుల యెదుట దత్తరము గలుగ
నీవు పరరాజముఖమున నిలువ గలవె, చిత్ర...

అర్థములు :- వ్రేపల్లెలోన్ = గొల్లపల్లెలో; గొల్లవెలదులు = గొల్లభామలు; కొట్టన్, రాన్ = కొట్టుటకు రాగా; దాడిదాడి = తొందరగా; ఇల్లిల్లు (ఇల్లు+ఇల్లు) = ప్రతియింటిలోను; దూఱన్ లేదా = దూరబడలేదా ?; రాసకేళికయందున్ = రాసక్రీడలో; రమణులు + ఆ = గొల్లభామలు ఎందరో; చుట్టి, పట్టినన్ = మండలాకారముగ నేర్పడి బంధింపగా; పాఱజూడలేదా = పరుగెత్తిపోవ ప్రయత్నింపలేదా ?; పది యాఱువేల = పదహారు వేలమంది; భూపకుమారికలు = రాజ కన్యలు; తేఱి పాఱన్ + చూచినన్ = బాగుగా చూచినప్పుడు; మతిభ్రమయలేదా = మనస్సులో మోహింపలేదా ?; ప్రణయవాదంబునన్ = ప్రణయకలహంలో; భార్యలు = పత్నులు; ఆ, ఎనమండ్రు = ఆ రుక్మిణి మొదలగు అష్టమహిషులు; కసరివేసినన్ = విసుక్కొనగా; కూర్మిన్ = వారి ప్రేమను; కొసరలేదా = వేడలేదా ?; తలిరుబోడుల యెదుట = స్త్రీల ముందట; తత్తరము కలుగన్ = కలత (కంగారు) కలుగగా; నీవు = నీవు; పరరాజముఖమునన్ = శత్రురాజుల యెదుట; నిలువగలవె = నిలబడ జాలుదువా (చాలవు).

తాత్పర్యము :- నీ కొంటె చేష్టలకు గోపికలు నిన్ను కొట్టరాగా ఇంటింట దూరి తప్పించుకొంటివి. రాసక్రీడలో (మండలాకారముగ నిలబడి చేయు నృత్యము) ఎందరో స్త్రీలు చుట్టుముట్టగా పారిపోవుటకు ప్రయత్నించితివి. పదియారువేల రాచకన్నెలు నీవైపు తేఱిచూడగా, వలపునకు లోనైతివి. నెయ్యపుటల్కలో అష్ట మహిషులు కసరికొట్టగా వారిప్రేమకోసము ప్రాకులాడితివి. చిగురుటాకులవలె మృదువైన మేనులు గల స్త్రీల ముందే కంగారు పడునీవు యుద్ధములో శత్రురాజుల ముందు నిలబడలేవని స్పష్టమైనది.

26. ఆలు నిర్వాహకురాలు భూదేవి యై
యఖిలభారకుఁ డనునాఖ్యఁ దెచ్చె
నిష్టసంపన్నురా లిందిర భార్య యై
కామితార్థదుఁ డన్న ఘనతఁ దెచ్చెఁ
గమలగర్భుండు సృష్టికర్త తనూజుఁడై
బహుకుటుంబకుఁ డన్న బలిమిఁదెచ్చెఁ
గలుష విధ్వంసిని గంగ కుమారి యై
బతిత పావనుఁ డన్న ప్రతిభఁ దెచ్చె
నాండ్రు బిడ్డలు దెచ్చుప్రఖ్యాతి గాని
మొదటినుండియు నీవు దామోదరుఁడవె. చిత్ర..

అర్థములు :- నిర్వాహకురాలు = సమర్థురాలై భరించు; భూదేవి = భూమి; ఆలు + ఐ = ఒక భార్య అగుటచేత; అఖిల భారకుడు = సమస్తమును మోయువాడు; అను = అను; ఆఖ్యన్ = పేరును (కీర్తిని); తెచ్చెన్ = నీకు తెచ్చెను; ఇష్టసంపన్నురాలు కోరిన సంపదకలిగిన; ఇందిర = లక్ష్మీదేవి; భార్యయై = భార్య అగుటచేత; కామితార్థదుడు = కోర్కెలను ఇచ్చువాడు; అన్న = అను; ఘనతన్ = గొప్పతనమును; తెచ్చెన్ = నీకు తీసికొని వచ్చెను; సృష్టికర్త = సకలమును సృజించినవాడు; తనూజుడై = కన్నకొడుకగుటచేత; కమలగర్భుడు = బ్రహ్మ; బహుకుటుంబకుడు = పెద్ద సంసారము గలవాడు; అన్న = అను; బలిమిన్ = బలమును (అతిశయమును); తెచ్చెన్ = నీకు కలిగించెను; కలుష విధ్వంసిని = పాపములను నశింపజేయు; గంగ = గంగానది; కుమారియై = కూతురు అగుటచేత; పతిత పావనుడు = పాపులను పవిత్రులను జేయువాడు; అన్న = అను; ప్రతిభన్ = ఉన్నతిని; తెచ్చెన్ = నీకు తెప్పించెను; ఆండ్రు = భార్యలును; బిడ్డలు = సంతానమును; తెచ్చు = సంపాదించు; ప్రఖ్యాతి = ప్రతిష్ఠ; కాని = తక్క; మొదటినుండియున్ = ఆది నుండియు; నీవు = నీవు; దామోదరుడవె = నిష్ప్రయోజకుడవేసుమా.

తాత్పర్యము :- సర్వాన్నీ మోసే భూదేవి అనే భార్యవల్ల అఖిల భారకుడనీ, గొప్ప సంపద కలిగిన లక్ష్మీదేవి అనే మరో భార్యవల్ల కామితార్థ ప్రదాయకుడనీ, సృష్టికర్త అయిన బ్రహ్మ అనే కొడుకువల్ల పెద్ద సంసారి అనీ, పతిత పావని అయిన గంగానది అనే కూతురువల్ల పతిత పావనుడనీ, ఇలా భార్యవల్లా, పిల్లలవల్లా నీకు ప్రఖ్యాతి కలిగింది. అంతే గాని స్వయంగా నీవు ఏమీ చేతగానివాడవే. కష్టమొకరిది ఖ్యాతినీది. నీవే కాదు నీ కుటుంబమంతా గొప్పదే అనే స్తుతి ఈ నిందా పద్యంలో గర్భితంగా ఉన్నది.

దామోధరుడు = ఉదరంపై వనమాల కలవాడని అర్థం (విష్ణుదేవుడు) లోకంలో నిష్ప్రయోజకుడు అనే అర్థంలో కూడా వాడతారు.

27. కడలి రాయనిముద్దుకన్నియ బెండ్లాడి
యూచగా నిల్లట ముందు టేమి
సహజ నొక్కర్తెను షండ పాండవునకు
బెండ్లి జేసితి వీవు పెద్ద వేమి
చిరరతిప్రౌఢను జిన్నబిడ్డని కీవు
గూర్చితి వారీతి గూదు నేమి
యుగములనాటి పెన్మగువను ముసలన్న
కొగి చేసితివి తగుం దగు మఱేమి
తెలియ నవ్యక్తుడవు గావు తెలిసికొన్న
నిట్టివాడని తెలియలే దెవ్వరికిని చిత్ర...

అర్థములు :- కడలి రాయని = సముద్రరాజు యొక్క; ముద్దు కన్నియన్ = ప్రియపుత్రికను; పెండ్లి + ఆడి = చేపట్టి; ఊచగాన్ = పూర్తిగా; ఇల్లటము, ఉండుట + ఏమి = ఇల్లరిక ముంటివి అది మర్యాదకాదుగదా; సహజను + ఒక్కర్తెను = ఒకే ఒక చెల్లెలిని; షండ పాండవునకు = నపుంసకుడైన అర్జునునకు ఇచ్చి; పెండ్లిచేసితివి = వివాహము చేసితివి; నీవు పెద్దవు + ఏమి = నీవు గొప్పవాడవా ?; చిరరతిప్రౌఢను = చిరకాలమునుండి రతిలో నేర్పరియైన రతీదేవిని; చిన్నబిడ్డనికి = ఆమె కంటె వయస్సులో చిన్నవాడైన ప్రద్యుమ్నునకు; ఈవు = నీవు; కూర్చితివి = సంధానము చేసితివి (కలిపితివి, చేర్చితివి); ఆరీతి = ఆ పద్ధతి; కూడున్ + ఏమి = తగునాయేమి; యుగములనాటి = పెక్కుయుగముల నాటిదైన; పెన్ + మగువను = పెద్దదైన స్త్రీని; ముసలి + అన్నకు = ముసలివాడైన అన్నకు; ఒగిన్ = చక్కగా; చేసితివి = పెండ్లిచేసితివి; తగున్ + తగున్, మఱేమి = ఇంకేమి చక్కగా తగియే ఉన్నది; తెలియన్ = తెలిసికొనుటకు; అవ్యక్తుడవు కావు = తెలియని వాడవుకావు; తెలిసికొన్నన్ = తెలిసికొన్నప్పటికీ; ఎవ్వరికిని = ఏ ఒక్కరికి కూడ; ఇట్టివాడు + అని = ఇట్టివాడు, అట్టివాడు అని; తెలియలేదు = నీవు తెలియలేదు.

తాత్పర్యము :- సముద్రుని కూతురైన లక్ష్మీదేవిని పెండ్లాడి అక్కడే శాశ్వతముగా ఇల్లరిక ముంటివి. ఏకైక సోదరియైన సుభద్రను నపుంసకుడుగా శపింపబడిన అర్జునునకు ఇచ్చి పెండ్లిచేసితివి. వయస్సులో పెద్దదైన రతిదేవిని (మాయావతి) వయస్సులో చాలా చిన్నవాడైన నీ కొడుకు ప్రద్యుమ్నునకు కూర్చితివి. బహుకాలమునాటి రేవతిని నీముసలి అన్న బలరామునికిచ్చి పెండ్లి జరిపించితివి. ఇవి నీకు తగినవి కావు. నీపనులు అర్థముచేసి కొనుట కష్టము.

28. నీజ్యేష్ఠపుత్రు డెన్నికకు రాని యశాశ్వ
తపు బను లేస్రియు సంతతము జగతి
వేరొక ముద్దుకుమారు డందఱిమోహ
లతల స్త్రీపురుషుల లంకె బెట్టు
నీతలోదరి లోకమాత పక్షాపక్ష
దృష్టి జంచలవృత్తి దిరుగుచుండు
నీ వనన్యకృతాది నిబిడమాయావిధా
నుల జేయు దెవ్వరి దొలగనీక
నొకరికంటె గుణాధికు లొకరు మీరు
ఇంత చక్కన దెలిసె మీయింటివరున, చిత్ర...

అర్థములు:- నీ = నీ యొక్క; జ్యేష్ఠపుత్రుడు = పెద్దకొడుకు బ్రహ్మ; జగతిన్ = లోకములో; సంతతము = ఎల్లప్పుడు; అశాశ్వతపు + పనుల్ = శాశ్వతముకాని పనులు; చేయున్ = చేయుచుండును; వేఱొక = మరియొక; ముద్దుకుమారుడు = ప్రియపుత్రుడు; అందఱిన్ = ప్రజలందరిని; మోహలతలన్ = వలపు తీగలతో; స్త్రీ పురుషులన్ = స్త్రీలను, పురుషులను; లంకె పెట్టున్ = బంధించును; లోకమాత = లోకములకు తల్లియైన; నీ తలోదరి = నీ స్త్రీ (భార్యయైన లక్ష్మి); పక్ష + అపక్ష, దృష్టిన్ = ప్రేమ ఉన్న, ప్రేమలేని దృష్టితో; చంచల వృత్తిన్ = నిలుకడలేని స్వభావముతో; తిరుగుచుండున్ = తిరుగుచుండును; నీవు = నీవు; ఎవ్వరిన్ = ఎవ్వరినీ (అందరినీ); తొలగనీక = తప్పించుకొని పోకుండా; అనన్యకృత = సాటిలేనిదిగా చేయబడిన; అతి నిబిడ = మిక్కిలి దట్టమైన; మాయావిధానులన్ = మాయా పద్ధతి కలవారినిగా; చేయుదు = చేస్తావు; మీరు = మీ కుటుంబములోనివారు; ఒకరి కంటెన్, ఒకరు = ఒకరికన్న మరియొకరు; గుణ + అధికులు = గుణములలో గొప్పవారు; ఇంత చక్కన = ఇంత చక్కనిది; మీ ఇంటి వరున = మీ కుటుంబ మర్యాద; తెలిసెన్ = తెలిసినది.

తాత్పర్యము:- నీ పెద్దకొడుకైన బ్రహ్మ ఊరూపేరూలేని అశాశ్వతపు పనులు చేయుచుండును. నీ చిన్నకొడుకు మన్మథుడు స్త్రీ, పురుషులను మోహముతో బంధించును. జగన్మాతయైన నీ భార్య లక్ష్మి పక్షపాతముగలదై చంచల స్వభావముతో సంచరించును. ఇక నీవో అందరినీ సాటిలేని మాయకు లోబడునట్లు చేయుదువు. మీ కుటుంబములోని వారందరు ఒకరినిమించిన వారు మరొకరు. చక్కనైన మీ ఇంటి మర్యాద మాకు అర్థమైనదిలే.

29. సకలంబు నీవ యై యొకమఱ్ఱియాకుపై
నిచ్చఁ బరుండునాఁ డెంత గలవొ!
తన బిడ్డఁ డని యశోదాదేవి పొత్తుల
నిడుక ముద్దాడునాఁ డెంత గలవొ!
తక్కులమారత్త దక్కించుకొనఁగ ని
న్నెత్తుక పెంచునాఁడెంత గలవొ!
భయలేశ మెఱుఁగక బల్పాము పడగపై
గంతులు వైచునాఁ డెంత గలవొ!
పరువు గలవాఁడ వేమి ప్రాఁబల్కు లందుఁ
దెలియ వరిముక్కు ముల్లంత గలవొ! లేవొ! చిత్ర

అర్థములు :- సకలంబున్ = సర్వమును; నీవు + ఐ = నీవే యై; ఒక మఱ్ఱియాకుపైన్ = మఱ్ఱి ఆకుమీద; ఇచ్ఛన్ = కోరికతో; పరుండు నాడు = పండుకొని యున్నవేళ; ఎంత కలవొ = ఎంత పరిమాణము గల శరీరము కలిగియుంటివో తన బిడ్డదు + అని = సొంత కొడుకని; యశోదాదేవి = యశోద యనుపేరుగల గోపకాంత; పొత్తులన్ = మెత్తని గుడ్డముక్కల సెజ్జపై; ఇదుక = ఉంచి; ముద్దాదు నాడు = ముద్దుపెట్టుకొని లాలించినపుడు; ఎంత కలవొ = ఎంత ఉన్నావో; తక్కులమారి అత్త = టక్కులాడియైన మేనత్త; దక్కించుకొనగన్ = వశపఱచుకొనుటకు; నిన్నున్ = నిన్ను; ఎత్తుక పెంచునాడు = తనచంక బెట్టుకొని పెంచినప్పుడు; ఎంత కలవొ = ఎంత ఉన్నావో; భయలేశము ఎఱుగక = భయము యొక్క అల్పమైన తెలియక; బల్ పాము పడగపైన్ = పెద్దపాము పడగమీద; గంతులు వైచునాడు = నాట్యము చేసిన వేళ; ఎంత కలవొ = ఎంత ఉన్నావో; పరువు కలవాడవు, ఏమి = నీవు ప్రతిష్ఠ గలవాడవా (కాదు); ప్రాబల్కులందున్ (ప్రాత + పల్కులు) = వేదములందు; తెలియన్ = యోచింపగా; వరిముల్లు ముక్కు + అంత; కలవొలేవొ = వరిముల్లు అంత పరిమాణము కలిగి ఉంటివో లేదో.

తాత్పర్యము : ప్రళయకాలంలో శూన్యమైన ప్రపంచములో సముద్రం మీద వటపత్రంపై శిశురూపంలో పరున్నావు. యశోదాదేవి పొత్తులలో పరుండబెట్టి ముద్దాడిన నాడు పసికందువే. మేనత్తయైన రాధ నిన్ను లోగొనుటకు చంక నెత్తుకొని పెంచిననాడు నీవు పసిబిడ్డవు. నిర్భయంగా కాళియఫణిఫణాగ్రమున నర్తించినపుడు, నినుగువే. ఇక వేదములలో మరీ సూక్ష్మరూపుడుగా అంటే శూకాగ్రమంత ఉందువని వర్ణింపబడ్డావు కదా.

30. కల్లరు ల్గాని వ్రేపల్లెవా రందఱు
హర్షింప నచట నీయాట సాగె
మధురాపురీవరమనుజు లామోదించి
మన్నింప నచట నీమాట సాగె
ద్వారకాపట్టణధన్యులు నిను గోరి
కొల్వగ నచట నీకొల్వు సాగె
గరిపురధర్మజుం డురురాజసభ నిన్ను
భూషింప నచట నీముచ్చు సాగె
నెఱుక మాలినవారు నీవరువు దలతు
రేమి నీపొంకములు సాగు నేమి యచట? చిత్ర...

అర్థములు :- కల్లరుల్ కాని = అసత్యవాదులుగాని; వ్రేపల్లెవారు + అందఱు = వ్రేపల్లెలో నివసించువారు అందరు; హర్షింపన్ = సంతోషించుటచేత; అచటన్ = అక్కడ (ఆ వ్రేపల్లెలో); నీ ఆట సాగెన్ = నీవు చేసిన పనులు చెల్లినవి; మధురాపురీ = మధురా నగరమునందలి; వరమనుజులు = శ్రేష్ఠులైన మనుష్యులు; ఆమోదించి = అంగీకరించి; మన్నింపన్ = గౌరవించుటచే; అచటన్ = అక్కడ (ఆ పట్టణములో); నీమాట సాగెన్ = నీ మాట చెల్లినది; ద్వారకాపట్టణ ధన్యులు = ద్వారకా నగరములోని అదృష్టవంతులు; నిను కోరి = నిన్ను కోరి; కొల్వగన్ = సేవించుటచేత; అచటన్ = అక్కడ; నీ కొల్వుసాగెన్ = నీ సభ చెల్లినది; కరిపుర ధర్మజుండు = హస్తినాపురమునేలు ధర్మరాజు; ఉరు రాజసభన్ = పెద్దదైన రాజసభలో; నిన్నున్ = నిన్ను; భూషింపన్ = గౌరవించుటచేత; అచటన్ = ఆ సభలో; నీ ముచ్చు సాగెన్ = నీ ముచ్చట చెల్లినది; ఎఱుకమాలిన వారు = అజ్ఞానులు; నీ వరువున్ = నీ ప్రతిష్ఠను; తలతురు + ఏమి = తలచుకొందురాయేమిటి (తలచుకోరు); అచటన్ = అక్కడ (వారి దగ్గర); నీ పొంకములు సాగునేమి = నీ బింకములు సాగువాయేమిటి (సాగవు).

తాత్పర్యము :- వ్రేపల్లెలోని గోపకులు అమాయికులగుటచేత అచట నీవేమి చేసినను చెల్లినది. మధురాపురము వారు సమ్మతించి గౌరవించుట చేత అచట నీ మాట చెల్లినది. ద్వారకలోని ప్రజలు నిన్నుకోరి కొలుచుటచేత అచట నీవు కొలువు సేయుటకు వీలయినది. ధర్మరాజు రాజసూయ యాగాంతమున నిన్ను సత్కరించుట చేత నీ ముచ్చట చెల్లినది. అమాయికులైన గోపకులు మున్నగువారు తప్ప అజ్ఞానులు నీ వరువును లెక్కసేయరు. వారి దగ్గర నీ పప్పులుడకవు.

31. దూడలలోఁ బెరదూడ మేయఁగఁజూచి
 యట్టె పట్టుక చావగొట్టవలెనె
పొడవ రా వేగ నాబోఁతుకొమ్ములు పట్టి
 విడువక దానిపే రుడుపవలెనె
ముక్కుతోఁ జెనకిన కొక్కరాయినిఁబట్టి
 వెర వొప్పఁగా మెడ విఱువవలెనె
తన్ను బో తని మృగాధమ మంచు నెంచక
 తొడరి గార్ధభమును త్రుంపవలెనె
యేమి ఘనకార్యములు చేసి తిద్ధరిత్రి
నెన్నటికి నీ వొనర్చిన విట్టిపనులె చిత్ర...

**అర్థములు:-** దూడలలో = నీవుమేపే దూడల నడుమ దూరి; పెఱదూడ = పరుల దూడ; మేయగన్, చూచి = మేయు చుండుట చూచి; అట్టె = వెంటనే; పట్టుక = దానిని పట్టుకొని; చావన్, కొట్టవలెనె = చంపుట న్యాయమా?; పొడవన్ రాన్ = పొడుచుటకై మీదికిరాగా; వేగన్ = వేగముగా; ఆ బోతు = అచ్చుబెర్దు; కొమ్ములు పట్టి = రెండు కొమ్ములు పట్టుకొని; విడువక = విడిచి పెట్టకుండ; దాని పేరు = దాని యొక్క నామమును; ఉడుపవలెనె = అణచుట న్యాయమా?; ముక్కుతోన్ = ముక్కుతో; చెనకిన = తాకిన; కొక్కరాయినిన్, పట్టి = పెద్ద కొంగను పట్టుకొని; వెరవు = ఉపాయము; ఒప్పగాన్ = తగియుండగా; మెడన్ = మెడను; విఱువవలెనె = విఱిచివేయుట న్యాయమా?; తన్నుబోతు + అని = కాలితో తన్ను స్వభావము కలది అని; మృగాధమము = జంతువులలో నీచమైనది; అంచున్, ఎంచక = అని తలపక; తొడరి = పట్టుకొని; గార్ధభమును = గాడిదను; త్రుంపవలెనె = వధించుట న్యాయమా?; ఈ ధరిత్రిన్ = ఈ భూమిపై; ఏమి ఘనకార్యములు = ఎట్టి గొప్పపనులు; చేసితి = చేసితివి; ఎన్నటికిన్ = ఎల్లప్పుడు; నీవు, ఒనర్చినవి = నీవు చేసినవి; ఇట్టి పనులె = ఇటువంటి పనులే కదా.

**తాత్పర్యము:-** నీవు వత్సాసురుని, వృషభాసురుని, బకాసురుని, గార్ధభాకారమును ధరించిన ధేనుకాసురుని చంపితివి. దూడను, ఆబోతును, కొంగను, గాడిదను చంపుట పరాక్రమమగునా? ఇవి గొప్ప పనులగునా? కానే కాదు. నీ వెప్పుడూ ఇట్టి ఊరూ, పేరూలేని పనులే చేసితివి. అంతే కాని గొప్ప కార్యములు ఏమీ చేయలేదు కదా.

32. కవ్వడి కెంత చక్కగ బోధ చేసిన
నితరహింసాకర్మ మిష్టపఱుప
రాయబారం బెంత రసికత నడిపిన
ననికి భారతుల నాయత్త పఱుప
విశ్వరూపం బెంత విమలత జూపిన
నోర్వని కురురాజు నులుకు పఱుప
విలుబట్ట నని యెంత చెలిమిగ బలికిన
నవల సుయోధను నాసపఱుప
పోరు చంపక చుట్టముల్ పోర నీల్గ
జూచుచుంటివి యేనాటి చుట్ట మీవు? చిత్ర....

అర్థములు:- కవ్వడికిన్ = సవ్యసాచియైన అర్జునునకు; ఎంత చక్కగన్ = ఎంత చక్కని రీతిలో; బోధ చేసినన్ = హితోపదేశము చేసినను; ఇతర హింసాకర్మము = ఇతరులను చంపుటకు; ఇష్టపఱుపన్ = ఇష్టపడునట్లు చేయుటకు; రాయబారంబు = పాండవుల పక్షమున దూతకృత్యము; ఎంత రసికతన్ = ఎంత ప్రీతితో; నడపినన్ = నెఱపినను; భారతులన్ = భరత వంశ్యులైన కౌరవపాండవులను; అనికిన్ = యుద్ధమునకు; ఆయత్త పఱుపన్ = సిద్ధపడునట్లు చేయుటకు; విశ్వరూపంబు = విశ్వరూపమును; ఎంత విమలతన్ = స్వచ్ఛముగా; చూపినను = చూపించినను; ఓర్వని = సహించని; కురురాజున్ = దుర్యోధనుని; ఉలుకు పఱుపన్ = భయపెట్టుటకు; విలున్ = విల్లును; పట్టను, అని = ధరింపను అని; ఎంత చెలిమిగన్ = ఎంత స్నేహముతో; పలికినన్ = పలికినను; అవల = ఆ తరువాత; సుయోధనున్ = దుర్యోధనుని; ఆస పఱుపన్ = నమ్మించుటకు; పోరు = యుద్ధమును; చంపక = ఆపక; చుట్టముల్ = బంధువులు; పోరన్ = రణములో; నీల్గన్ = చచ్చుచుండగా; చూచుచు + ఉంటివి = ఊరకే చూచుచుంటివి. ఈవు = నీవు; ఏనాటి చుట్టము = వారికి ఎప్పటి బంధుగుడవు? (బంధుగుడవుకాదు).

తాత్పర్యము:- శత్రువులను చంపుటకు సమ్మతింప జేయుటకే అర్జునునకు గీత బోధించినావు. కౌరవ పాండవులను యుద్ధమునకు సిద్ధముచేయుటకే రాయబారమును సంతోషముగా నడిపినట్లు నటించినావు. దుర్యోధనుని భయపెట్టుటకే కురుసభలో విశ్వరూపమును చూపించినావు. సుయోధనుని నమ్మించుటకే ఆయుధమును ధరింపనని ప్రతిజ్ఞ చేసినావు. పగ అడగింపనైతివి. బంధువులు యుద్ధములో మరణించుచుండ ఏమియు పట్టనట్లు చూచుచుంటివి. నీవు నిజముగ వారికి బంధుగుడవేనా? బంధువు వినాశనమును కోరడు గదా.

33. శ్రీమద్వికుంఠపురీ వరేశుఁడ వయ్యు,
గొల్లపల్లెల నుండ గోరు టేమి?
యక్షీణలక్ష్మీ కటాక్షవీక్షుఁడ వయ్యు
త్రోవ లే కింటింట దోచ నేమి
భూరి చతుర్దశ భువనావనుఁడ వయ్యు
గడువేడ్కఁ దొల్జుల గాయ నేమి
సన్మునిదేవతా సంభావితుఁడ వయ్యు
నాలకాపరులతో నాడ నేమి?
గొప్పలో గొప్పవాఁడవు కొలదిలోన
గొలదివాఁడవు నిన్నెట్లు గొలువ వచ్చు? చిత్ర...

అర్థములు:- శ్రీమత్ = శుభప్రదమైన; వికుంఠ = వైకుంఠము అను పేరు కలిగిన; పురీవర = శ్రేష్ఠమైన పట్టణమునకు; ఈశుఁడవు + అయ్యున్ = ప్రభుఁడవైయుండియును; గొల్లపల్లెలన్ + ఉండన్ వ్రేపల్లెలలో నివసించుటకు; కోరుట + ఏమి = కోరుటకు కారణము ఏమి?; అక్షీణ = తఱుగని; లక్ష్మీ = లక్ష్మీదేవి యొక్క; కటాక్ష వీక్షుఁడవు + అయ్యున్ = కడకంటి చూపులు కలిగి యుండియు; త్రోవలేక = దారిలేక; ఇంటన్ + ఇంటన్ = ప్రతిగృహము నందును; దోచన్, ఏమి = దొంగిలించుట యెందుకు; భూరి = పెద్దదైన; చతుర్దశ భువన = పదునాల్గులోకములను; అవనుఁడవు + అయ్యున్ = రక్షించువాఁడవైనప్పటికిన్; కడువేడ్కన్ = మిక్కిలి కోర్కెతో; తొల్జులన్ = ఆవులను; కాయన్, ఏమి = కాయుట ఎందులకు; సత్, ముని = గొప్పమునులచేతను; దేవతా = వేల్పులచేతను; సంభావితుఁడవు + అయ్యున్ = గౌరవింపబడువాఁడవు అయినప్పటికిని; ఆలకాపరులతోన్ = పసులను గాచువారితో; ఆడన్, ఏమి = ఆటలాడుట ఎందులకు; గొప్పలోన్ = గొప్పవారిలో; గొప్పవాఁడవు = ఘనుడవు; కొలదిలోవన్ = తక్కువవారిలో; కొలదివాఁడవు = తక్కువవాఁడవు; నిన్నున్ = నిన్ను; ఎట్లు = ఏ విధముగా; కొలువ వచ్చున్ = సేవించుట శక్యమగును? (శక్యముకాదు)

తాత్పర్యము:- నీవు గొప్పదైన వైకుంఠపురమునకు ఏలికవు. అయినను వ్రే పల్లెలో కాపురముందువు. లక్ష్మీదేవి నిన్ను ఎల్లప్పుడును ప్రేమించును. అయినను పేదవారి ఇంటింటికి బోయి పాలువెన్న దొంగిలింతువు. నీవు పదునాల్గులోకములను పోషింతువు. అయినను మక్కువతో ఆలమందలను కాయుదువు. నిన్ను సనకసనందనాది మునులు, ఇంద్రాదిదేవతలు పూజింతురు. అయినను గోపాలకులతో కలసి క్రీడింతువు. నీవు గొప్పవారిలో గొప్పవాడవు. కొద్దివారిలో కొద్దివాడవు. నీకు కొద్ది, గొప్ప భేదములేదు. నీకు అందరును సమానమే. నిన్ను సేవించుట ఎట్లో మాకు తెలియుటలేదు.

34. దుర్యోధనుం డవధ్యుడ వంచు మానె గా
కలుక బంధింపగా దలప లేదె?
గోపాలుడవు పూజ గొందువేరా యని
సభ నిన్ను దిట్టడే చైద్యుడెదిరి?
నీలాంఛనంబుల బోలు చిహ్నలు దాల్చి
తానె నీ వనడె యుద్ధతివి పౌండ్రు
డెవ్వరు బట్టలే రేను బట్టెద నంచు
యవనుండు దరుమడే యాహవమున
నృపులు కొందఱు వెఱచిరే నీకు మున్ను
ప్రాణముల కాసపడరేని భండనమున, చిత్ర...

**అర్థములు:-** దుర్యోధనుండు = దుర్యోధనుడు; అవధ్యుడవు, అంచున్ = రాయబారి చంపదగనివాడు అని భావించి; మానెన్, కాక = చంపుటకు ప్రయత్నించుట మానివేసినాడు కాని; అలుకన్ = కోపముతో; బంధింపగాన్ = త్రాళ్ళతో గట్టివేయుటకు; తలపన్, లేదె = సంకల్పింపలేదా?; గోపాలుడవు = ఆలకాపరివి; పూజన్ = పూజను; కొందువు= అందుకొంటివి; ఏరా (ఏమి + రా) = నీచుడా!; అని = అని పలుకుచు; సభలోన్ = కొలువులో; నిన్నున్ = నిన్ను; ఎదిరి = ఎదిరించి; చైద్యుడు = శిశుపాలుడు; తిట్టడే = దూషించలేదా?; నీ = నీవు ధరించు; లాంఛనంబులన్ = చిహ్నములను; పోలు = పోలిన; చిహ్నలు = చిహ్నములను; తాల్చి = ధరించి; పౌండ్రుడు = పౌండ్రక వాసుదేవుడు; ఉద్ధతిన్ = పొగరుతో; తానె = తానే; నీవు + అనడె = నీవు అనలేదా?; ఎవ్వరున్ = ఎవ్వరును; పట్టలేరు = పట్టుకొనలేరు; ఏను = నేను; పట్టెదను, అంచున్ = బంధించెదనని; ఆహవమునన్ = యుద్ధభూమిలో; యవనుండు = కాలయవనుడు; తఱుమడే = పరుగెత్తింపలేదా?; మున్ను = పూర్వము; నృపులు కొందఱు = కొంతమంది రాజులు; భండనమునన్ = పోరాటంలో; ప్రాణములకు, ఆసపడరేని = తమ ప్రాణాలపై వారికి కోర్కెలేనిచో; నీకున్ = నీకు; వెఱచిరే = భయపడి యుండెడి వారా?

**తాత్పర్యము:-** దుర్యోధనుడు అవధ్యుడవైన నిన్ను త్రాళ్లతో గట్టనెంచెను. ఆలకాపరియైన నీవు పూజకు అనర్హుడవు అని శిశుపాలుడు తిట్టెను. నీ చిహ్నములైన చక్రము మొదలగునవి ధరించి నేనే నిజమైన వాసుదేవుడనని పౌండ్రక వాసుదేవుడు పలికెను. నేను శ్రీకృష్ణుని బంధించెదను అని పలికి కాలయవనుడు నిన్ను యుద్ధభూమి నుండి తరిమెను. ప్రాణాలపై తీపి లేకపోయినచో యుద్ధములో నీకు కొంతమంది రాజులు భయపడి యుండెడి వారుకారు. వారు ఊరికే భయపడినారు. అంతే.

35. రాజు లెవ్వరు బంక్తి భోజన మిడకున్న
దాసునింట భుజించి తనియలేదా ?
బంధువు లెవ్వరు గంధ మీ కుండిన
ముప్వంకలది పూయ మురియలేదా ?
దొర లెవ్వరును బూలసరము లీకుండిన
దెలిసి మాలికు డీగ నలరలేదా ?
ప్రభువు లెవ్వరు వస్త్రబహుమాన మీ కున్న
దెచ్చి యిచ్చిన చాకి మెచ్చలేదా ?
పాటి సేయంగ నేరాజు బందుగుడవొ?
మున్నె నీపస దెలిసిన దెన్న నేమి? చిత్ర...

అర్థములు :- రాజులు + ఎవ్వరున్ = క్షత్రియులెవరును; పంక్తి భోజనము = తమపంక్తిలో భోజనము; ఇడకున్నన్ = పెట్టించక పోవుటచే; దాసుని + ఇంటన్ = శూద్రుడైన విదురుని ఇంటిలో; భుజించి = సాపడి; తనియలేదా = తృప్తి పొందలేదా; బంధువులు + ఎవ్వరున్ = మధురానగరములో చుట్టములెవ్వరును; గంధము + ఈకుండినన్ = విలేపనములు ఈకుండుటచే; ముప్వంకలది = (మూడు + వంకలు + అది) త్రివక్ర; పూయన్ = మేన అలదగా; మురియలేదా = సంతోషింపలేదా; దొరలు + ఎవ్వరును = రాజు లెవ్వరును; పూలసరములు + ఈకుండినన్ = పూలదండలు ఇవ్వకపోవుటచేత; తెలిసి = నీవెవరవో గ్రహించి; మాలికుడు = మాలాకరుడైన సుదాముడు; ఈగన్ = ఇవ్వగా; అలరలేదా = సంతోషింపలేదా; ప్రభువులు + ఎవ్వరున్ = రాజులెవ్వరును; వస్త్ర బహుమానము + ఈకున్నన్ = కానుకగా వలువలు ఇవ్వకపోవుటచేత; తెచ్చి+ ఇచ్చిన = తెచ్చియిచ్చిన; చాకిన్ = చాకలివానిని; మెచ్చలేదా = మెచ్చుకొనలేదా? పాటి చేయంగవ్ = మర్యాదచేయుటకు; ఏ రాజు బందుగుడవొ = నీవు ఏ రాజునకయినను చుట్టమువా ?; మున్నె = ముందే; నీ పస = నీ శక్తి; తెలిసినది = అర్థమైనది; ఎన్నన్ +ఏమి = తలంచుట ఎందుకు ?

తాత్పర్యము :-రాజులెవ్వరును పంక్తిభోజనమునకు పిలువకుండుటచే విదురుని యింట భోజనము చేసి తృప్తి చెందితివి. చుట్టము లెవ్వరును మైపూతలు ఇవ్వకుండుటచే కుబ్జ పూజింపగా మురిసిపోయితివి. రాజులెవ్వరును పుష్పములు ఈకుండుటచే సుదాముడు అను మాలాకారుడివ్వగా సంతోషించితివి. ప్రభువులెవ్వరు వలువలు కానుకగా ఇవ్వకుండుటచే తెచ్చి యిచ్చిన చాకలిని మెచ్చుకొంటివి! నీకు రాజులు మర్యాద చేయుటకు వారి చుట్టమవు కావుకదా. ముందే నీశక్తి తెలిసినది. మరల తలపనేల? బలరామకృష్ణులకు వలువలిచ్చినవాడు సాలెవాడు. అంతేకాని రజకుడుగాదు. రజకుడు ఇవ్వకుండుటచే అతనిని చంపినారు. కవి పొరపడినాడు, చూ. భాగవతం దశమస్కంధము. ఇచ్చిన సాలీని మెచ్చలేదొ అని సవరించిన సరిపోవును.

36. నాగలి రోక లన్నకు నిచ్చి శంఖాది
పంచాయుధము లీవు పట్టినావు
తాటిటెక్కెంబు కోల్తల పెద్ద కెత్తించి
గరుడధ్వజం బీవు గట్టినావు
వెలరాని కఱవోని వలువ జ్యేష్ఠున కిచ్చి
కనకాంబరం బీవు గట్టినావు
మద్య మగ్రజునకు మత్తిల ద్రావించి
జున్ను బాల్ పెరు గీవు జుర్రినావు
తగవరివె యన్నదమ్ముల ధర్మ మీవె
తీర్చవలె గాని మఱియొండు తీర్పగలడె? చిత్ర...

అర్థములు:- నాగలి, రోకలి = నాగలిని, రోకలిని; అన్నకున్ = అన్నయైన బలరామునకు; ఇచ్చి = ఇచ్చి; శంఖ + ఆది = శంఖము మొదలైన; పంచా యుధములు = ఐదు ఆయుధములు (శంఖము, గద, ఖడ్గము, చక్రము, ధనుస్సు); నీవు = నీవు; పట్టినావు = స్వీకరించినావు; కోల్తలన్ = యుద్ధమునందు; తాటి టెక్కెంబు తాళధ్వజమును; పెద్దకు = అన్నకు; ఎత్తించి = పైని ఉంచి; గరుడధ్వజము = గరుడి టెక్కెము; నీవు కట్టినావు = నీవు ధరించినావు; వెలరాని = విలువలేని; కఱవోని = నల్లని; వలువ = వస్త్రమును; జ్యేష్ఠునకున్ = అన్నకు; ఇచ్చి = ఇచ్చి; కనక + అంబరంబు = బంగారు వలువ; ఈవు = నీవు; కట్టినావు = ధరించినావు; అగ్రజునకున్ = అన్నకు; మత్తిల = మత్తు గొనునట్లు; మద్యమున్ = మద్యమును; త్రావించి = త్రాగించి; ఈవు = నీవు; జున్ను = జున్ను; పాల్ = పాలు; పెరుగు = పెరుగు; జుర్రినావు = పీల్చినావు; తగవరివి + ఎ = నేర్పరివే; అన్నదమ్ముల ధర్మము = అన్నదమ్ముల మధ్య న్యాయము; ఈవె = నీవే; తీర్చవలెన్, కాని = చక్కబఱచవలెను అంతేగాని; మఱియొండు = మఱొకడు; తీర్పన్ కలడె = సరిచేయగలడా?

తాత్పర్యము:- నాగలి, రోకలి అన్నయైన బలరామునకు ఇచ్చి, శంఖచక్రాది పంచాయుధములను నీవు తీసికొన్నావు. యుద్ధములో తాళధ్వజము అన్నకు ఎత్తించి, గరుడ ధ్వజము నీవు ధరించినావు. విలువలేని నీలాంబరమును అన్నకు ఇచ్చి, పీతాంబరమును నీవు ధరించినావు. అన్నకు మద్యపానమును అలవాటు చేసి మత్తు గొనునట్లుచేసి, పాలు, పెరుగు, జున్ను నీవు జుర్రినావు. అన్నదమ్ముల నడుమ ఉండవలసిన న్యాయము నీవే దిద్దవలెను గాక మరియొకడు తీర్చలేడు.

37. అప్పనంబులు గొను నఖిలదిగ్మండలే
శ్వరులచే వేంకటాచలనివాసు
దరుదుగా నటువదా అగు రసంబులు మహా
భోగంబు గొనునీలంభూధ్రవరుదు
పానకం బంది సాబాలు భక్తుల కిచ్చి
యెనగును మంగళాద్రీశ్వరుండు
పుట్లకొలంది మైపూతగా గొను మంచి
గందంబు సింహనగ ప్రభుండు
సాటిసాములరీతి నిచ్చోట నీవు
మూర్తిమత్వంబు జూపక కీర్తి గలదె? చిత్ర...

అర్థములు :- వేంకట + అచల, నివాసుదు = వేంకటగిరిపై కాపురముండు దేవుడు; అఖిలదిక్, మండల + ఈశ్వరులచే = సమస్త దిక్కులయందున్న ప్రభువులచే; అప్పనంబులు, కొనున్ = కానుకలు అందుకొనును; నీలభూధవరుదు = నీలాచలముపై నివసించు దేవుడు; అరుదుగాన్ = ఆశ్చర్యముగా; అటువది+ ఆఱగు, రసంబులు = అరవై ఆరు రుచులు; మహా భోగంబున్ = గొప్పభోగముగా; కొనున్ = స్వీకరించును; మంగళ + అద్రి + ఈశ్వరుదు = మంగళగిరి దేవుడు; పానకంబంది = పానకముగొని; సాబాలు = సగభాగము; భక్తులకు = భక్తులకు; ఇచ్చి = ఇచ్చి; ఎనగును = అతిశయించును; సింహనగ ప్రభుండు = సింహాద్రి అప్పన్నదేవుడు; మంచిగందంబున్ = మంచి గందమును; పుట్లకొంది = పుట్లకొలంది; మై పూతగాన్ = మేని పూతగా; కొనున్ = గ్రహించును; సాటి సాముల రీతిన్ = ఇరుగు పొరుగు వేల్పుల వలె; నీవు = నీవు; ఇచ్చోటన్ = ఇక్కడ; మూర్తిమత్వంబు = గొప్పతనము; చూపక = చూపకుండ; కీర్తి కలదె = కీర్తి కలదా।

తాత్పర్యము :- తిరుపతి వేంకటేశ్వరుదు సమస్త దిక్పాలుర నుండి కానుకలు స్వీకరించును. జగన్నాథస్వామి అరవై ఆరు రుచుల మహాభోగమును అందుకొనును. మంగళగిరి నరసింహస్వామి భక్తులు అర్పించు పానకములో సగము తిరిగి భక్తులకు ఇచ్చివేయును. సింహాద్రి అప్పన్నదేవుదు పుట్లకొంది మంచి గందము మైపూతకు గ్రహించును. సాటి వేల్పుల వలె నీవు కూడా నీ వైభవమును చూపకుండా కీర్తిరాదు కదా.

38. బొచ్చెచేపకు నైన మచ్చరం బున్నది
తాబేటి కైన సత్త్వంబు గలదు
ఢీకొన్న నడవిపందికి గల్గు రోసంబు
తెలినోటినరు డైన దెగువ సేయు
బొట్టివానికి నైన దిట్టతనం బుండు
బాపని కైన దర్పంబు గలదు
చుంచురాజున కైన శూరత్వ మున్నది
మునలికి నైన జేవుష్టి గలదు
సిద్ధ మాభీరుడవు నీవె బుద్ధి నెంచ
గలికి నై యేమి సేయగ గలవొ కాని, చిత్ర...

అర్థములు :- బొచ్చెచేపకునైనన్ = మత్స్యమునగు కూడ; మచ్చరంబు, ఉన్నది = రోషము ఉన్నది; తాబేటికి + ఐనన్ = కూర్మమునకైనను; సత్త్వంబు, కలదు = బలమున్నది; ఢీకొన్న = ఎదిరించిన; అడవి పందికి = వనవరాహమునకు; రోసంబు = పౌరుషంబు; కల్గున్ = కలదు; తెలినోటి నరుడైనన్ = నరసింహుడయినను; తెగువ, చేయున్ = సాహసించును; పొట్టివానికిన్, ఐనన్ = వామనున కయినను; దిట్టతనంబు ఉండున్ = ధైర్యము ఉండును; బాపని కైనన్ = బ్రాహ్మణునకయినను; దర్పంబు కలదు = గర్వము కలదు; చుంచురాజునకున్ + ఐనన్ = సిగగల్గు క్షత్రియునకు గూడ; శూరత్వము ఉన్నది = శౌర్యము కలదు; మునలికిన్ + ఐనన్ = ముసలివానికైనను; చే పుష్టి కలదు = చేతి బలము కలదు; సిద్ధము = నిజము; ఆభీరుడవు = గోపాలకుడవు; నీవె = నీవే; బుద్ధినెంచన్ = మనస్సులో ఆలోచింపగా; కలికినై = కల్కి అవతారమెత్తి; ఏమి చేయగన్, కలవొకాని = ఏమి చేయగలవో మరి.

తాత్పర్యము :- నీవు మత్స్యావతారములో రోషము చూపినావు, కూర్మావతారములో బలము చూపినావు, వరాహావతారములో రోసము చూపినావు, నరసింహావతారములో ధైర్యము చూపినావు, పరశురామావతారములో ఠీవి చూపించినావు, శ్రీ రామావతారములో శౌర్యము చూపినావు, బలరామావతారములో (రోకలి చేత ధరించి) చేతి బలము చూపినావు, ఇప్పుడు గోపాలక అవతారములో మన్నావు నీవు. అవగా పిరికివాడవు. ఇకముందు కల్కి అవతారములో నీవు ఏమిచేయగలవు. ఏమియు చేయలేవు అని నాకనిపించుచున్నది.

39. మును నందగోవత్సముల గాయునప్పుడు
    ననునయించిరె కంజజాది సురలు?
విటచోర చేష్టల వ్రేపల్లె దిరుగు నీ
    దగుమ్రోల నచ్చర లాడినారె?
నరరథాశ్వముల సంగరవీథి దోలునా
    డెంచి దిక్పతులు భావించినారె?
మగధేశుదాడికి మధుర వీడిననాడు
    దేవర్షులెల్ల గీర్తించినారె?
యల్పునిగ నెంచినారె? లోకైకనాథ
నాథునిగ నెంచినారె మున్ధరణి? జెపుము, చిత్ర...

**అర్థములు:-** మును = పూర్వము; నంద = నందుని యొక్క; గోవత్సములన్ = ఆవు దూడలను; కాయునపుడు = మేపునప్పుడు; కంజజ + ఆది సురలు = బ్రహ్మమొదలైన దేవతలు; అనునయించిరె = ఓదార్చినారా; విట చోర చేష్టలన్ = శృంగారచర్యలతో, దొంగతనములతో; వ్రేపల్లెన్ = వ్రేపల్లెలో; తిరుగు = సంచరించు; నీదగు = నీ; మ్రోలన్ = ముందు; అచ్చరల్ = అప్సరసలు; ఆడినారె = నాట్యము చేసినారా; నర = అర్జునుని యొక్క; రథ, అశ్వములన్ = రథమునకు పూన్చిన గుఱ్ఱములను; సంగరవీథిలోన్ = యుద్ధభూమిలో; తోలునాడు = తోలునాడు; ఎంచి = ఆలోచించి; దిక్పతులు = దిక్పాలకులు; భావించినారె = గౌరవించినారా; మగధ+ఈశు, ధాటికిన్ = జరాసంధుని దాడికి; మధుర = మధురా నగరమును వీడిననాడు = విడిచిపెట్టిననాడు; దేవ + ఋషులు + ఎల్లన్ = దేవమునులు అందరును; కీర్తించినారె = పొగడినారా; మున్ = పూర్వము; ధరణిన్ = లోకములో; అల్పునిగన్ ఎంచినారె = తక్కువ వాడుగా తలచినారా; లోక, ఏకనాథ నాథుని గన్ = లోకమునకు ఒకడే ప్రభువుగా; ఎంచినారె = భావించినారా; చెపుమా = చెప్పుమా.

**తాత్పర్యము:-** పూర్వము నీవు ఆలమందను కాసినప్పుడు బ్రహ్మాదిదేవతలు నిన్ను ఓదార్చలేదు. వ్రేపల్లెలో నీవు శృంగార చేష్టలు చేయుచు, దొంగతనములు చేయుచు తిరిగినప్పుడు నీముందు అప్సరసలు నాట్యము చేయలేదు. యుద్ధములో నీవు అర్జునుని రథమును తోలినప్పుడు ఇంద్రాది దిక్పాలకులు నిన్ను గౌరవించలేదు. జరాసంధునకు భయపడినీవు మధురానగరమును విడిచిబెట్టినప్పుడు దేవమునులు పొగడలేదు. అల్పునిగా భావించినారో - జగన్నాథునిగ భావించినారో తెలియదు. అల్పుని గానే భావించినారు. లోకాధిపతిగా భావించితే నీకు తగిన మర్యాదచేసి ఉండెడివారు.

40. పూతనాకుచ కుంభపూర్ణ విషస్తన్య
పాయివై బ్రదికిన భాగ్య మేమి ?
కాళియాశీ విషగ్రసన ప్రమాదంబు
గడచి జీవించిన ఘనత యేమి ?
చాణూరమల్లదోః స్తంభ ఘట్టన కోర్చి
లబ్ధజయుడ వైన లాభ మేమి ?
సాళ్వరాజామోఘ శక్తిప్రయోగంబు
మరలించుకొనిన సామర్థ్యమేమి ?
బడుగుదాసరివలె నన్న వస్త్రములకు
బరుల కాశింతు విచట నీవంత మేమి ? చిత్ర....

**అర్థములు :–** పూతనా = పూతన అనురాక్షస స్త్రీ యొక్క; కుచకుంభ = కడవల వంటి చన్నులలో; పూర్ణ = నిండిన; విషస్తన్య, పాయివి + ఐ = విషముకలిపిన చనుబాలు త్రాగిన వాడవై; బ్రతికిన = జీవించిన; భాగ్యము, ఏటమి = అదృష్టమేమిటి; కాళియ = కాళియుని; ఆశీవిష = సర్పముయొక్క; గ్రసన = మ్రింగుట అను; ప్రమాదము = కష్టము; కడచి = దాటి; జీవించిన = బ్రతికిన; ఘనత, ఏమి = గొప్పతనమేమిటి ?; చాణూరమల్ల = చాణూరుడను మల్లుని; దోః, స్తంభ = స్తంభముల వంటి బాహువుల; ఘట్టనకు, ఓర్చి = రాపిడికి సహించి; లబ్ధజయుడవు + ఐన = పొందినజయము గలవాడైనందుకు; లాభము, ఏమి = లాభమేమిటి ?; సాళ్వరాజ = సాళ్వరాజాయొక్క; అమోఘ = వ్యర్థముగాని; శక్తి = శక్తి యొక్క; ప్రయోగంబు = ప్రయోగించుటను; మరలించు కొనిన = వెనుకకుబోవునట్లు చేసిన; సామర్థ్యము + ఏమి = బలముఏమి ?; ఇచట = ఇక్కడ; బడుగు = పేదవాడైన; దాసరివలె = భక్తునివలె; అన్నవస్త్రములకున్ = అన్నమునకు, వలువలకు; పరులకున్ ఇతరులను; ఆశింతువు = కోరెదవు; నీవంతము, ఏమి = నీ పట్టుదల యేమిటి ?

**తాత్పర్యము :–** పూతన విషపు చనుబాలు త్రావి బ్రతికితివి. కాళియుని కోఱ నుండి ప్రమాదమును దాటుకొని బ్రతికితివి. చాణూరుడను మల్లుని జయించితివి. సాళ్వరాజా అను శిశుపాలుని తమ్ముడు విసరిన శక్తి అను ఆయుధ విశేషమును మరలించితివి. ఇన్ని ప్రమాదములను దాటి నీవు బ్రతికినందులకు లాభమేమిటి ? పేదభక్తునివలె అన్నవస్త్రములకొఱకు ఇతరులను వేడుకొనుటకేనా ? ఇక నీకుపట్టుదల ఏమున్నది ?

41\. పట్టి గొల్లది రోట గట్ట నోపిననీకు
రోసంబు లే దన్న నీసు గలదె?
జారచోరాదిచేష్టల బ్రవర్తిల్లు నీ
కపకీర్తి యన్న భయంబు గలదె?
భార్యచే దన్నులు బడ్డవానికి నీకు
లజ్జ లేదని యన్న లాఘవంబె?
కుందంటు లే దని కొసరి మెక్కిన నీకు
హీనత లెంచిన న్యూన మగునె?
కోరి దాసులు ని న్నెంత దూరుచున్న
బంత మున్నదె నీ కిసుమంత యైన? చిత్ర...

అర్థములు:- గొల్లది = గొల్లభామ (యశోద); పట్టి = నిన్ను పట్టుకొని; రోటన్ = రోటికి; కట్టన్ = కట్టుటకు; ఓపిన = సహించిన; నీకున్ = నీకు; రోసంబు = కోపము; లేదు+అన్నన్ = లేదని అన్నచో; ఈసుకలదె = కోపము ఉన్నదా?; జార, చోర, ఆది, చేష్టలన్ = వ్యభిచారము, దొంగతనము మొదలగు పనులతో; ప్రవర్తిల్లు = నడచుకొను; నీకున్ = నీకు; అపకీర్తి, అన్నన్ = నిందఅని అన్నచో; భయంబు కలదె = భీతి కలదా?; భార్యచేన్ = భార్యచేత; తన్నులుబడ్డ వానికిన్ = తాపులు తిన్నవాడవైన నీకు; లజ్జలేదు = సిగ్గులేదు; అని అన్నన్ = అని అన్నచో; లాఘవంబె = తక్కువ తనమా?; కుండ+అంటు = కుండదోషము; లేదు అని = లేదని; కొసరి = మరిమరి; మెక్కిన = తిన్న; హీనతలు, ఎంచినన్ = తక్కువలు; ఎంచినన్ = లెక్కించినచో; నీకున్ = నీకు; న్యూనము, అగునె = తక్కువయగునె?; కోరి = తామైకోరి; దాసులు = భక్తులు; నిన్నున్, ఎంత = నిన్నుఎంతగా; దూరుచున్నన్ = తిట్టుచున్నను; నీకున్ = నీకు; ఇసుమంత యైనన్ = కొంచమైనను; పంతము ఉన్నదె = పట్టుదల ఉన్నదా? (లేదుకదా)

తాత్పర్యము:- గొల్లపడతి అయిన యశోద నిన్ను రోటికి కట్టివేయగా సహించితివి. నీకు రోసము లేదు. నీవు జారత్వము చేసితివి. చౌర్యము చేసితివి. నీకు అపకీర్తి భయములేదు. సత్యభామనిన్ను కాలితో దన్నినది. అయినను నీకు సిగ్గులేదు. కుండంటు లేదని పరుల ఇంట పాలు, పెరుగు, వెన్న, నేయి మెక్కితివి. నీకు హైన్యము లేదు. నీ భక్తులు పలువిధములుగా దూషించినను నీకు కొంచెము కూడ పట్టుదల లేదు.

42. కదు దొంగతనమున గని తల్లి వైచిన
దనబిడ్డనిగ బెంచె నిను యశోద
జనని గర్భము దింమకొనిన వేఱొకతల్లి
కడుపు జేసికొనంగ గలిగెనన్న
తండ్రి వివాహయత్నము సేయ నొల్లక
తగులుక వచ్చె నీధర్మపత్ని
యన్న రారాజు కీనున్న నీసోదరి
యింటికి జోగిరా నంటుకొనియె
నిట్టి నీసంప్రదాయంబు గుట్టు బెట్టు
రట్టు సేయుదు గనుము నాబట్టుతనము, చిత్ర....

**అర్థములు:-** కదు దొంగతనమునన్ = కదు రహస్యముగా; కని = కని; తల్లి = తల్లియైన దేవకీదేవి; వైచినన్ = పారవేయగా; యశోద = నందుని భార్య అయిన యశోద; నినున్ = నిన్ను; తనబిడ్డనిగన్ = సొంతబిడ్డగా; పెంచెన్ = పెంచెను; జనని గర్భము దింమకొనినన్ = తల్లియైన దేవకి గర్భము దిగిపోగా; వేఱొక తల్లి = మరొకతల్లి రోహిణి; కడుపుజేసి కొనంగన్ = కడుపును మోయగా; అన్న = నీ యన్న బలరాముడు; కలిగెన్ = పుట్టెను. నీ ధర్మపత్ని = నీ భార్య రుక్మిణి; తండ్రి వివాహయత్నము, చేయన్ = తండ్రి పెండ్లి ప్రయత్నము చేయగా; ఒల్లక = అంగీకరింపక; తగులుక వచ్చెన్ = నీ వెంటవచ్చెను; అన్న = అన్న బలరాముడు; రారాజుకు = దుర్యోధనునకు; ఈ నున్నన్ = ఇచ్చుటకు సిద్ధముగా నుండగా; నీ సోదరి = నీచెల్లెలైన సుభద్ర; ఇంటికిన్ = గృహమునకు; జోగిరాన్ = సన్యాసి రాగా; అంటుకొనియెన్ = వలచెను; ఇట్టి = ఇటువంటి; నీ సంప్రదాయము = నీ ఆచారము యొక్క; గుట్టు = రహస్యము; బెట్టు = హోదా; రట్టు చేయుదున్ = బయలు పరచెదను; నా బట్టుతనము = నా బట్టుతనము; కనుము = చూడుము.

**తాత్పర్యము:-** నిన్ను తల్లియైన దేవకి రహస్యముగా కనగా యశోద నిన్ను తనబిడ్డగా పెంచినది. నీ తల్లి ఏడవ గర్భము దిగిపోగా, మరొకతల్లి రోహిణి గర్భమున మోయగా నీ అన్న బలరాముడు పుట్టినాడు. తండ్రి వివాహప్రయత్నము చేయుచుండగా రుక్మిణి నీ వెంట బడివచ్చి నిన్ను పెండ్లాడినది. నీ అన్న బలభద్రుడు దుర్యోధనునకు ఇచ్చి పెండ్లి చేయదలచగా నీ చెల్లెలు సుభద్ర ఇంటికి వచ్చిన దొంగ సన్యాసిని (అర్జునుని) ప్రేమించినది. నీ కుటుంబ మర్యాద ఇటువంటిది. నీ కుటుంబ మర్యాదను అందరికీ తెలియబరచి నా బట్టుతనపు గొప్పతనము చూపెదను.

43. పక్షంబు గల దంద్రు పాండుపుత్రులయందు
పాండవుల్ పడినట్టి పాటు లేమి!
పూర్వజన్మ మునందు బూజించె గజ మంద్రు
గజరాజు పొందిన గాసి యేమి!
యల కుచేలునకు బాల్యస్నేహితుడ వంద్రు
నెఱి గుచేలుదు పడ్డనెవ్వ లేమి!
ప్రహ్లాదు దాజన్మ భక్తియుక్తుం డంద్రు
ప్రహ్లాదు డొందిన బాధ లేమి:
యెంతయాలస్యమున వారి నేలివాడ
విట్టిదే నీదయారసం బెంచి చూడ, చిత్ర....

**అర్థములు:-** పాండుపుత్రుల యందున్ = పాండవులపై; పక్షంబు = అనురాగము; కలదు = నీకు ఉన్నది అని; అంద్రు = నీ భక్తులు అందురు; పాండవుల్ = ఆ పాండవులు; పడిన, అట్టి = పొందిన; పాటులు, ఏమి = కష్టములు ఏమిటి?; గజము = ఏనుగు; పూర్వజన్మమునందున్ = గత జన్మలో; పూజించెన్ = నిన్ను పూజించెను అని; అంద్రు = అని అందురు; గజరాజు = గజేంద్రుడు; పొందిన్ = పొందిన; గాసి, ఏమి = కష్టమేమిటి; అల = ప్రసిద్ధుడైన; కుచేలునకున్ = సుదామునకు; బాల్య స్నేహితుడవు = చిన్ననాటి చెలికాడవు అని; అంద్రు = అందురు; కుచేలుడు = కుచేలుడు; నెఱిన్ = నిజముగా; పడ్డ = పడిన; నెవ్వలు ఏమి = బాధలేమిటి; ప్రహ్లాదుడు = ప్రహ్లాదుడు; ఆజన్మ భక్తియుక్తుండు = పుట్టుకనుండీ భక్తితో గూడిన; అంద్రు = అని అందురు; ప్రహ్లాదుడు ఒందిన = పొందిన; బాధలు ఏమి = బాధలేమిటి?; ఎంత ఆలస్యమునన్ = ఎంతయో ఆలస్యముగా; వారిన్ = పాండవులు మొదలగు వారిని; ఏలినాడవు = రక్షించినావు; ఎంచి, చూడన్ = ఆలోచించి చూడగా; నీ దయారసము = నీ దయ అనెడి అమృతము; ఇట్టిది+ఏ = ఇటువంటిది కదా.

**తాత్పర్యము:-** పాండవులపై నీకు పక్షపాతమందురు. వారు పడిన పాట్లు ఎటువంటివి? గజరాజు నీకు భక్తుడందురు. అతడు పొందిన కష్టము ఎటువంటిది? కుచేలుడు నీకు బాల్య సఖుడందురు. అతడు పడ్డకష్టము లెటువంటివి? ప్రహ్లాదుడు జన్మతః నీకు భక్తుడందురు. అతడెటువంటి బాధలు పొందెను? పాండవులు మున్నగువారు పడినపాట్లు మితిలేనివి. వారిపై నీకు నిజముగా ప్రేమ ఉన్నచో ఆలస్యముగా వారిని రక్షింతువా? నీకు ప్రేమ లేదు. భక్తులపై నీదయ ఇటువంటిది.

44. అనఘ మౌ విప్రసత్రాన్న మెంగిలి జేసి
తీవె మున్ క్రతుభోక్త నేనే యనుచు
సవతి తల్లికొమాళ్ల సమయించి తందఱి
దరుగని రాక్షసాంతకుడ ననుచు
బంధువు లన్యోన్య వైరానహతులుగా
నడచితి భూభారహారి ననుచు
బలిమి నన్యస్త్రీల బట్టితి వెందఱి
నస్ఖలద్బ్రహ్మ చర్యమతి ననుచు
లోకమున నడ్డ మెవ్వరు లేకయునికి
హద్దు లే కిట్లు నడచితి వళుకు మాలి, చిత్ర...

అర్థములు :- క్రతుభోక్తన్ = యజ్ఞమును భుజించువాడను; ఏను + ఎ = నే నే; అనుచున్ = అని పలుకుచు; మున్ = పూర్వము; ఈవె = నీవె; న + అఘము + ఔ = దోషరహితమైన; విప్రసత్ర + అన్నము = బ్రాహ్మణులు చేసిన యజ్ఞమునకు సంబంధించిన అన్నమును; ఎంగిలి జేసితివి = ఎంగిలిచేసితివి; తరుగని = అక్షయుడైన; రాక్షస + అంతకుడన్ = రాక్షస సంహారకుడను; అనుచున్ = నే నే అని చాటుచు; సవతి తల్లి = దితి యొక్క; కొమాళ్లన్ = కొడుకులను; అందఱిన్ = అందరిని; సమయించితి = చంపితివి; బంధువులు = చుట్టములైన కౌరవపాండవులు; అన్య + అన్య = పరస్పరము; వైరానన్ = యుద్ధములో; హతులుగాన్ = చంపబడగా; భూభారహారిన్ = భూభారమును తగ్గించువాడను; అనుచున్ = అని పలుకుచు; నడచితి = ప్రవర్తించితివి; అస్ఖలత్ బ్రహ్మచర్య మతిన్ = చెడని బ్రహ్మచర్యము అవలంబించు మనస్సు కలవాడను; అనుచున్ = అని చెప్పుచు; ఎందఱిన్ = ఎందఱినో; బలిమిన్ = బలాత్కారముగా; అన్యస్త్రీలను = పరస్త్రీలను; పట్టితివి = గ్రహించితివి; లోకమునన్ = లోకములో; అడ్డము, ఎవరు = నీకు ఎదురు; లేక యునికి = లేకుండుట చేత; అళుకుమాలి = భయము విడిచి; ఇట్లు = ఈవిధముగా; హద్దులేక = మితిలేకుండా; నడచితివి = ప్రవర్తించితివి.

తాత్పర్యము :- పవిత్రమైన బ్రాహ్మణ యజ్ఞము నందలి హవిరన్నమును నేనే యజ్ఞభోక్తను అని ఎంగిలి చేసితివి. రాక్షససంహారకుడనని పేరు పెట్టుకొని దేవతల సవతితల్లియైన దితికొడుకులను (రక్కసులను) నిశ్శేషముగా వధించితివి. బంధువులు పరస్పరము చంపుకొనగా భూభారము తగ్గించితినని చెప్పితివి. పరస్త్రీలను బలవంతంగా పట్టితివి, నేను అస్ఖలిత బ్రహ్మచారిని అని చెప్పుచు. లోకములో ఎవ్వరు నిన్ను కాదను వారు లేకుండుటచే అపుఅడ్డము లేకుండ భయము వీడి ప్రవర్తించితివి.

45. ఆది యోగ్యంతరం గాలానబంధంబు
వదలించుకొన నీకు వశము గాదో!
వేదాంత సకృద చుంబితల మంత్రావర్ణ
నల గుహలుండి రా నలవి గాదో!
నిమి షార్ధనిమిషాదినిత్యవేళాచక్ర
గతి నిరోధించి రాం గ్రమము గాదో!
వక్రకంటక పంకవత్క్రూరజనమనః
కాపథంబులను గా ల్మోపరాదో!
యేమి యాలస్య మిది నీకు నేల సకల
జంతుసంతాన రక్షావిచక్షణునకు చిత్ర....

అర్థములు :- ఆదియోగి + అంతరంగాల = ఆదియోగుల యొక్క మనస్సుల యందు; ఆనబంధము = ఆజ్ఞాబంధములు; వదిలించుకొన = వదల్చుకొనుటకు; వశముకాదో = శక్యముకాదా ?; వేదాంత = వేదవేదాంగముల భాష్యసంబంధమైన (ఉపనిషదాదుల); సకృత్ + అచుంబితల = సకృదచుంబితల = సకృత్తుగానైన స్పృశించబడనటువంటి; మంత్రా వర్ణనల = మంత్రములచేత పరివృతమైన వర్ణనలనెడి; గుహలు = రహస్యమైన ప్రదేశముం మండి; రానలవిగాదో = వచ్చుటకువీలులేదో; నిమిషార్థ నిమిషాద = కాలముయొక్క ప్రతిభాగములుగల; నిత్యవేళాచక్ర = కాల చక్రములోని వేళాచక్రముయొక్క; గతి = వేగమును; నిరోధించి = ఆపి; రాన్ + క్రమము = వచ్చుటకు పద్ధతి; కాదో = లేదో; వక్ర = వంకరలుగల; కంటక = ముళ్లతో నిండిన; పంకవత్ = బురదనిండిన; క్రూర = కర్కశమైన; జన = జనులయొక్క; మనః = మనస్సులనెడి; కాపథముల = మార్గములందు; కాల్మోపరాదో = కాలుపెట్టుటకు వీలులేదో; సకల = సమస్తమైన; జంతు = ప్రాణులయొక్క; సంతాన = సమూహములయొక్క; రక్ష = రక్షించుటయందు; విచక్షణునకున్, నీకున్ = నేర్పరివైన నీకు; ఏలన్ = రక్షింపగా; ఇది ఏమి ఆలస్యము = ఈ జాగు ఎటువంటిది ?

తాత్పర్యము :- ఆది మహర్షులయొక్క యోగశక్తిచే నిన్ను వారు తమ అంతరంగములయందు బంధించుకున్నారు. వానిని వదల్చుకొని వచ్చుట నీకు శక్యమగుటలేదేమో! వేద వేదాంతములలో చెప్పబడనటువంటి రహస్యములైన మంత్రములచేత పరివృతమైన వర్ణనలనెడి రహస్యములనుండి వెలువడుటకు శక్యము కాదేమో. కాలచక్రములోని వేళాచక్రము వేగమును ఆపి లేదా కాలమునందలి వెనులుబాటును చూచికొని వచ్చుటకు వీలులేదో. వంకర తిరిగిన ముళ్లు, బురద నిండిన క్రూరులైన జనుల మనస్సులనెడి మార్గములందు కాలుపెట్టుటకు వీలులేదో. సర్వ ప్రాణులను రక్షించుటయందు నేర్పరివైన నీవు మమ్ము రక్షించుటకు ఏల ఆలస్యము చేయుచున్నావు ? కారణము మాకు తెలియుటలేదు.

46. కఠిన స్తనంబుల ఘట్టించి దట్టించి
జడలచే మోది నున్దొడల నదిమి
పలుగంట్లు చేసి గోరుల నాటి దొమ్మిగా
యువతీసహస్రంబు లుపరతాది
బంధనంబుల నిన్ను బైకొని తమి రేచి
రమియింప నిదురింప రాక నాటి
బడలిక దీఱ నాపగ రాని సుఖనిద్ర
బవళించియున్నట్టి భావ మిచట
దోచుచున్నది సంపుల్లతోయజాక్ష!
మేల్ బళా! యింక జాగేమి మేలుకొనవె! చిత్ర...

అర్థములు :– కఠిన స్తనంబులన్ = గట్టి చన్నులచేత; ఘట్టించి = పొడిచి; దట్టించి = అదలించి; జడలచేన్, మోది = జడలతో కొట్టి; నున్, తొడలన్ = నునుపైన తొడలతో; అదిమి = దగ్గరగా నొక్కి; పలుగంట్లు చేసి = పంటితో గాయములు చేసి; గోరులన్ నాటి = గోళ్లను నాటించి; దొమ్మిగాన్ = అందఱును కలిసి; యువతీ సహస్రంబులు = జవరాండ్ర యొక్క వేలు; ఉపరత, ఆది = పురుషాయితము మొదలైన; బంధనంబులన్ = సురత బంధములచేత; నిన్నున్, పైకొని = నీ పైబడి; తమిన్, రేచి = మోహమును రేపి; రమియింపన్ = సంభోగింపగా; నిదురింపన్, రాక = నిద్రపోవ సాధ్యముగాక; నాటి బడలిక తీఱన్ = ఆనాటి అలసట తీరునట్లుగా; ఆపగన్ రాని = ఆపుకొనలేని; సుఖనిద్రన్ = సుఖము కలిగించు నిద్రచేత; పవళించి యున్నట్టి భావము = పండుకొనియున్న పద్ధతి; ఇచటన్ = ఇక్కడ; తోచుచున్నది = కనిపించుచున్నది; సంపుల్లతోయజ, అక్ష = బాగుగా వికసించిన తామర రేకులవంటి కన్నులు గలవాడా; మేల్ = బాగు; బళా = బళీ; ఇంకన్ = ఇక; జాగు, ఏమి = ఆలస్యము ఎందుకు; మేలుకొనవె = మేలుకొనుము.

తాత్పర్యము :– స్వామీ! వేలకొలది యువతులు తమగట్టి స్తనములచే నీవక్షమును రాచి, జడలతో నిన్ను విలాసముగా కొట్టి మెరుగారు తొడలతో అదిమిపట్టి దంతక్షతములు, నఖక్షతములు చేసి నీపై చేరి పురుషాయితము మున్నగు రతబంధములతో నిన్ను రమించినారు. అందుచేత నీకు నిద్ర కరువైనది. ఆ బడలిక తీరునట్లుగా సుఖముగా నిద్రించుచున్నావు కాబోలు. ఇక మేలు కొనుము. ఈ నిద్రచాలు.

47. నీబొడ్డుదమ్మిలోనికి జొచ్చి చూచిన
నలువకు నీలోతు దెలియకున్నె?
బహుసహస్రాంగనా గృహముల నినుగన్న
మునిరాజు నీమాయ గనకయున్నె?
నీ విశ్వరూప మెన్నిక జేసి పొడగన్న
నరుడు నీ యురువు దా నెఱుగకున్నె?
తనమనఃపీఠి ని న్ననిశ మారాధించు
హరుదు భవత్తత్త్వ మరయకున్నె?
గరువ మేటికి నీమర్మ మెఱుగ రనుచు
దెలిసిన మహాత్ములకు నైన దెలియకున్నె, చిత్ర....

**అర్థములు:–** నీ బొడ్డు తమ్మిలోనికిన్ = నీ బొడ్డులోని పద్మములోనికి; చొచ్చి, చూచిన = ప్రవేశించి, పరికించిన; నలువకున్ = బ్రహ్మకు; నీలోతు = నీ గుట్టు; తెలియక, ఉన్నె = తెలియకుండునా?; బహుసహస్ర + అంగనా గృహములన్ = పెక్కువేల గోప యువతుల ఇండ్లలో; నినున్ కన్న = నిన్ను దర్శించిన; మునిరాజు = మునిశ్రేష్ఠుడగు నారదుడు; నీ మాయన్ = నీ లీలను; కనక, ఉన్నె = గ్రహించకుండునా; నీ విశ్వరూపమున్ = నీ యొక్క విశ్వరూపమును; ఎన్నికన్ చేసి = కోరి; పొడగన్న = చూచిన; నరుడు = అర్జునుడు; నీ ఉరువున్ = నీ స్వరూపమును; తాన్ ఎఱుగకున్నె = తాను తెలిసికొనకుండునా; తన మనఃపీఠిన్ = తన మనస్సను గద్దెపై నిలిపి; నిన్నున్ = నిన్ను; అనిశమున్ = నిత్యమును; ఆరాధించు = పూజించు; హరుదు = శివుడు; భవత్ తత్త్వమున్ = నీమర్మమును; అరయకున్నె = గ్రహించకుండునా; నీ మర్మమున్ = నీ రహస్యమును (ఎవ్వరును); ఎఱుగరు, అనుచున్ = తెలియలేరు; అనుచున్ = అని; గరువము, ఏటికిన్ = గర్వమెందుకు?; తెలిసిన మహాత్ములకున్ ఐనన్ = జ్ఞానులకు సైతము; తెలియకున్నె = తెలియకుండునా?

**తాత్పర్యము:–** బ్రహ్మ నీ అంతు తెలిసి కొనవలెనని నీ నాభిపద్మములోనికి ప్రవేశించినాడు కదా! అతనికి నీ లోతు తెలిసియే యుండును. నారదుడు పెక్కువేల గోపస్త్రీల ఇండ్లలో నిన్ను చూచినాడు. అతడు నీ మాయ గ్రహించియే యుండును. నీ విశ్వరూపమును కోరి దర్శించిన అర్జునునకు నీ గొప్పతనము తెలిసియే యుండును.

తమ మనస్సులో నిన్ను నిలుపుకొని పూజించు శివునకు నీ తత్త్వము తెలిసియే యుండును. నీ మర్మమెవ్వరును తెలిసికొనలేరని గర్వించకుము. జ్ఞానులకు నీ మాయ తెలియును సుమా!

48. పురుషాకృతిగ నిన్ను గుఱుతు బట్టగ రాదు
స్త్రీమూర్తి వనుచును జెప్ప రాదు
పరగ నపుంసకభావ మెన్నగ రాదు
రూపంబు గల్గు టెఱుంగ రాదు
గుణవంతుడ వటంచు గణుతింపగా రాదు
మర్యాద దెలియ నేమతికి రాదు
కులజుడ వనుచు నిక్కువము జెప్పగ రాదు
స్థల మెక్కడనొ కాని తెలియ రాదు
వస్తునిర్దేశ మొనరింప వశము గాని
నిన్ను వర్ణింపరాదయా నిశ్చయముగ, చిత్ర...

అర్థములు:- నిన్నున్ = నిన్ను; పురుష+ఆకృతి గన్ = పురుషాకారముగా; గుఱుతు పట్టగన్ రాదు = గుర్తింప శక్యముకాదు; స్త్రీ మూర్తివి = స్త్రీ ఆకారము గలవాడవు; అనుచును = అనికూడ; చెప్పరాదు = చెప్పుట సాధ్యముకాదు; పరగన్ = ఒప్పగా; నపుంసక భావము = నపుంసకత్వము; ఎన్నగన్‌రాదు = ఎంచరాదు; రూపంబు కల్గుట = రూపము ఉండుట; ఎఱుంగన్ రాదు = తెలిసి కొనుట సాధ్యము కాదు; గుణవంతుడవు+అటంచున్ = సగుణుడవు అని; గణుతింపగాన్‌రాదు = తలపరాదు; మర్యాద తెలియన్ = ఎల్ల గ్రహించుట; ఏ మతికిన్ రాదు = ఏ బుద్ధికి సాధ్యముకాదు; కులజుడవనుచున్ = ఉత్తమ కులములో పుట్టితివని; నిక్కువమున్ = సత్యమును; చెప్పగన్ రాదు = చెప్పుట కుదురదు; స్థలము, ఎక్కడనొ కాని = నీ ఉండుచోటు ఎక్కడో; తెలియరాదు = తెలిసికొనుట శక్యముకాదు; వస్తు నిర్దేశము ఒనరింపన్ = ఇది ఈ వస్తువు అని చెప్పుట; వశము = తరము; కాని = అంతేకాని; నిశ్చయముగన్ = నిక్కముగా; నిన్నున్ = నిన్ను; వర్ణింపరాదయా = వర్ణించుట తరముకాదు.

తాత్పర్యము:- నీవు పురుషుడవో, స్త్రీవో, లేక రెండును కాని నపుంసకుడవో చెప్పుట శక్యము కాదు. అసలు నీకు రూపము ఉన్నదో లేదో. నీవు సగుణుడవో, నిర్గుణుడవో తెలియదు. నీది ఉత్తమ కులమని చెప్పలేము. నీ నివాసమెక్కడో తెలియదు. నీ అంతు ఎవరికినీ తెలయదు. ఇది ఈ వస్తువు అని ఏదైన వస్తువును వర్ణింపగలము గాని, నిన్ను వర్ణింపజాలము. నీవు వర్ణనకు అతీతుడవు.

49. నమ్మెదు రేరీతి నారదు నాత్మజ్ఞు
మానిని జేసిన మాయవాని ?
దలతు రేరీతి నల్ దలల దయ్యము నోలి
బొడ్డుదమ్మిని గన్న పురుషమణిని ?
భూషింతు రేరీతి పుష్పబాణవిరోధి
విషయభ్రమితు జేయు వేసగాని ?
భాషింతు రేరీతి బ్రహ్మాదిమశకప
ర్యంతంబు గలిగిన వింతవాని ?
విన్నెఱి గెఱింగి యందఱు నన్నుతింతు
రెవ్వరికి నీవు కావలె నెంచి చూడ ? చిత్ర...

అర్థములు:- ఆత్మజ్ఞున్, నారదున్ = తన్నుదానెఱిగిన నారదమహర్షిని; మానినిన్, చేసిన = స్త్రీగా మార్చిన; మాయవానిన్ = మోసకారిని; ఏరీతిన్, నమ్మెదురు = ప్రజలు ఎట్లు నమ్మెదురు; నల్ తలల దయ్యమున్ = నాలుగు తలలు కలిగిన వేల్పును; ఓలిన్ = బాగుగా; బొడ్డు, తమ్మినిన్, కన్న = బొడ్డునందలి పద్మమునందు కనిన; పురుషమణిన్ = పురుషశ్రేష్ఠుని; ఏరీతిన్, తలతురు = ఏవిధముగా భావింతురు ?; పుష్పబాణ విరోధిన్ = మన్మధునకు శత్రువైన శివుని; విషయ భ్రమితున్, చేయు = ఇంద్రియ సుఖములందు కోరిక గలవానినిగా చేసిన; వేసగానిన్ = వేషములు వేయువానిని; ఏరీతిన్, భూషింతురు = ఏవిధముగా గౌరవింతురు ?; బ్రహ్మ, ఆది, మశకపర్యంతంబున్ = బ్రహ్మమండి దోమల వరకు; కలిగిన = ఉండు; వింతవానిన్ = ఆశ్చర్యము కలిగించువానిని; ఏ రీతిన్, భాషింతురు = ఏవిధముగా వర్ణింతురు ?; నిన్నున్ = నిన్ను; ఎఱిగి, ఎఱింగి = బాగుగా తెలిసికొని; అందరున్ = అందరును; నన్నుతింతురు = పొగడుదురు; ఎంచిచూడన్ = ఆలోచించిచూడగా; నీవు, ఎవ్వరికిన్, కావలెన్ = నీవు ఎవరికి కావలయును (ఎవ్వరికీ అక్కరలేదు).

తాత్పర్యము:- తన్నుదాను తెలిసికొనిన నారదమహర్షిని నీవు స్త్రీగా మార్చితివి. చతుర్ముఖ బ్రహ్మను నాభి పద్మమునందు పుట్టించితివి. కాముని దహించిన శివుని కాముకునిగా జేసితివి. దోమనుండి బ్రహ్మాండము వరకు అన్నిటను నీవు ఉందువు. నిన్ను బాగుగా తెలిసికొనిన వారు నిన్ను స్తుతింతురు. అంతే కాని మిగిలిన వారికి నీ గొడవ ఉండదు కదా.

50. ఎక్కడ నీకన్న దిక్కులే నట్ల ని
న్నర్చింతు రబ్జగర్భాది సురలు
మఱి యెందు గతి లేనిమాడ్కి మహామునుల్
నీ యందె లక్ష్యముల్ నిలుపుకొందు
రిల దరణోపాయ మెందున లేనట్లు
సజ్జనుల్ నీకథల్ చదువుకొంద్రు
పగతుర మెయ్యెడ బ్రతికెద మన్నట్లు
దునిసిరి నీచేత దనుజు లెల్ల
దత్త్వ మరసిన శుద్ధబుద్ధస్వరూప
మింత యధికార మెన్నటి దేమి చెపుమ? చిత్ర...

**అర్థములు:-** ఎక్కడన్ = ఎందును; నీకన్న దిక్కులేని, అట్లు + అ = నీ కంటె గతిలేనట్లే; అబ్జగర్భ, ఆది, సురలు = బ్రహ్మ మున్నగు వేల్పులు; నిన్నున్, అర్చింతురు = నిన్ను పూజింతురు; మఱి = అంతేకాదు; ఎందున్ = ఎచ్చటను; మహామునుల్ = గొప్పమునులు; నీ, అందె = నీ మీదనే; లక్ష్యముల్, నిలుపుకొందురు = గుఱి ఉంచుదురు; ఇలన్ = భూమిమీద; ఎందునన్ = ఎక్కడను; తరణ, ఉపాయము = తరించు ఉపాయము; లేని + అట్లు = లేనట్లుగా; సత్‌జనులు = మంచివారు; నీ కథల్ చదువు కొంద్రు = నీ కథలను చదువుదురు; దనుజులు, ఎల్లన్ = రాక్షసులందరును; పగతురము = మేము విష్ణువునకు శత్రువులము; ఏ, ఎడన్ = ఎక్కడ; బ్రతికెదము, అన్నట్లు = జీవింతుము అన్నట్లు; నీ చేతన్ = నీ చేతిలో; తునిసిరి = మరణించిరి; తత్త్వము అరసినన్ = నీ స్వభావము ఆలోచించినచో; శుద్ధ = పూర్తిగా; బుద్ధ స్వరూపము = మొద్దురూపము; ఇంత అధికారము = ఇంతటి గొప్ప; ఎన్నటిది, ఏమి = ... లభించినది; చెపుమ? = చెప్పుమా.

**తాత్పర్యము:-** బ్రహ్మాది దేవతలు మరొక ...లేనట్లు నిన్ను ...తురు. మహామునులు నీ అందే మనస్సు నిల్పుదురు. సజ్జను... నీ కథలే ముక్తిని క...చునని పఠింతురు. రాక్షసులు జీవించుటకు దారి లభింపక నీచే ...నారు. నిజము ...ంచినచో నీవు పూర్తిగా జడ పదార్థము. అటువంటి నీకు ఇట్టి పెత్తనము ఎప్పటిదో కదా.

51. ఆడించెదవు బొమ్మలాటవాఁడును బోలె
సర్వచరాచర జంతువులను
కనుకట్టు గట్టెదు గారడీఁడును బోలె
మిథ్యాప్రపంచంబు తథ్యముగను
వేర్వేఱఁదోఁతువు వేషధారియుఁ బోలెఁ
బహువిధదేవతాభద్రకళలఁ
దెలివి మాన్పెదువు జక్కులవాని చందానఁ
బ్రజల సంపద్రంగవల్లిఁ జేర్చి
యిట్టివే కద నీవిద్య లెన్నియైన
నింక నేమిట ఘనుఁడవో యెఱుఁగరాదు. చిత్ర....

అర్థములు :- సర్వ = సమస్తమైన;చర + అచర, జంతువులను = నడచునవి, నడవనివి అను రెండు రకముల ప్రాణులను; బొమ్మలాటవాడును, పోలెన్ = తోలు బొమ్మలనాడించు వానివలె; ఆడించెదవు = నటింపజేసెదవు; మిథ్యా ప్రపంచంబున్ = అసత్యమైన భూలోక మును; తథ్యముగను = సత్యముగా కనిపించునట్లు; గారడీడును, పోలెన్ = ఇంద్రజాలికుని వలె; కనుకట్టు కట్టెదు = మాయచేసెదవు; బహువిధదేవతా = పెక్కు తెరంగుల వేల్పుల యొక్క; భద్రకళలన్ = శుభమును కలిగించు అంశములతో; వేషధారియు పోలెన్ = పెక్కు రూపములను ధరించునటునివలె; వేర్వేఱన్ + తోతువు = ప్రత్యేకముగా, గోచరింతువు; ప్రజలన్ = మానవులను; సంపత్, రంగవల్లి = సంపదయను ముగ్గులో; చేర్చి = నిలిపి, జక్కుల వాని చందానన్ = మాంత్రికునివలె; తెలివిమాన్పెదు = వివేకమును పోగొట్టుదువు; నీ విద్యలు = నీవు చూపువిద్దెలు; ఎన్ని ఐనన్ = ఎన్నయినననసరే; ఇట్టివే కదా = నిశ్చయ ముగా ఇటువంటివే; ఇంకన్ = ఇవిగాక; ఏమిటన్ = ఏయే విద్యలయందు; ఘనుడవో = నీవు గొప్పవాడవో; ఎఱుగరాదు = తెలియుట శక్యముకాదు.

తాత్పర్యము :- జంగమస్థావరాత్మకమైన జీవకోటిని తోలుబొమ్మ లాడించువానివలె ఆడిస్తావు. మిథ్యా జగత్తును కనుకట్టు వానివలె తథ్యమనునట్లుగా కనిపింపజేస్తావు. వేసగానివలె వివిధ దేవతల అంశములతో గోచరిస్తావు. మాంత్రికుని వలె లోకులను సంపత్తి అనే ముగ్గు వదుమకు ఆకర్షించి వివేకాన్ని నశింపజేస్తావు. అసంఖ్యాకములైన నీ విద్యలన్నీ ఇలాగే మోసపు విద్దెలు. ఇంకా ఏయే విద్యలందునీవునేర్పరివో తెలిసికొనుట మాతరముకాదు.

52. కూరిమి నల తంతిగొట్టు సన్యాసితో
ముచ్చటించెద వేమి పుణ్యమూర్తి
సాటిగా వెలిగొండవీటి జంగము చెల్మిఁ
బచరింతు వేనాఁటి బాంధవుండు
వెలిపాపపాన్పుపైవేడ్కతోఁ బవలింతు
వది యేమి భోగిభోగాంతరంబు
పొరుగిండ్ల కేప్రొద్దుఁబోరాఁదలఁచునింతిఁ
బాయకుండెద వేమి భాగ్యలక్ష్మి
మంచి సహవాసములు గల్గె నెంచి చూడ
నీకె తగు నట్టివారితో నెనరు నెఱప. చిత్ర.

అర్థములు :- కూరిమిన్ = ప్రేమతో; అల = ఆ; తంతిగొట్టు సన్యాసితోన్ = తంత్రులను మీటు యతితో; ముచ్చటించెదవు = సల్లాపములాడెదవు; ఏమి పుణ్యమూర్తి = (అతడు) ఎట్టి పుణ్యశాలి; సాటిగాన్ = సమానముగా; వెలిగొండవీటి = వెండికొండ పట్టనమున కాపురముండు; జంగము చెల్మిన్ = దేవుని స్నేహమును; పచరింతువు = చేసెదవు; ఏనాటి బాంధవుండు = (అతడు) ఎప్పటి చుట్టము; వెలిపాపపాన్పు (పాము + పాన్పు) పైన్ = తెల్లని పాముపడగపై; వేడ్కతోన్ = ఉబలాటముతో; పవళింతువు = పరుందువు; అదియేమి భోగిభోగాంతరంబు = భోగములననుభవించువారి మఱొక్క భోగమా అది; పొరుగిండ్లకు = దగ్గరలో నున్న యిండ్లకు; ఏప్రొద్దున్ = ప్రతిదినము; పోన్, రాన్, తలచు = పోవగా, రాగా, ఎంచు; ఇంతిన్ = స్త్రీని; పాయకుండెదవు - విడిచిపెట్టకుండ ఉండెదవు; ఏమి భాగ్యలక్ష్మి = ఆమె ఎటువంటి అదృష్టలక్ష్మి; మంచి సహవాసములు కల్గెన్ = నీకు మంచి స్నేహములు ఏర్పడెను; ఎంచి చూడన్ = తలచిచూడగా; అట్టివారితోన్ = అటువంటివారితో; నెనరు, నెఱపన్ = స్నేహము చేయగా; నీకే, తగున్ = నీకుమాత్రమే తగియున్నది;

తాత్పర్యము :- వీణ మీటుకుంటూ తిరిగే సన్యాసితో ముచ్చట్లాడతావుకదా. అతడేమి పుణ్యం చేశాడయ్యా. వెండి కొండపై కాపురముండే జంగందేవరతో స్నేహంచేస్తావు. అతడు నీకు పూర్వపు చుట్టమా ? సర్పరాజైన శేషునిపై శయనిస్తావు. అదొక భోగవిశేషమా యేమిటి ? ఒక్క క్షణం ఇంట్లో నిలవకుండా చంచల స్వభావంతో ఇంటింటికీ తిరుగుతుంది నీ ఇల్లాలు లక్ష్మీదేవి. అయినా ఆమెను విడిచిపెట్టకుండా ఏలుకుంటున్నావు కదా. ఆమె భాగ్యలక్ష్మియా యేమిటి ? స్నేహమునకు తగని వారితో స్నేహం చెయ్యటం నీకే తగునయ్యా.

53. అఖిల పోషకుఁడవ న్నాఖ్యమాత్రమె కాని
కర్తవు నీవె భోక్తవును నీవె
యక్షరుండ వను ప్రఖ్యాతి మాత్రమె కాని
చర్చింప వేఱొండు సాక్షి గలఁడె?
సుగుణాబ్ధి వని నిన్ను స్తుతి యొనర్చుటెకాని
నిర్గుణుం డెవ్వఁడు నీకు మించ?
విశ్వాత్ముఁడ వటంచు వినుతించుటయె కాని
చొచ్చి నిన్నెవ్వఁడు చూచినాఁడు?
వినికిడియెగాని నిన్ను నీ విశ్వములను
మొదలెఱుంగదురే నిజంబునకుఁ జెపుమ. చిత్ర...

అర్థములు : అఖిల పోషకుడవు = అందఱిని పోషించువాడవు; అన్ = అను; ఆఖ్యమాత్రమె కాని = పేరు మాత్రమే కాని; కర్తవు నీవే = చేయువాడవు నీవే; భోక్తవును నీవె = అనుభవించువాడవు నీవే; అక్షరుండవు, అను = నశించనివాడవు అనే; ప్రఖ్యాతి మాత్రమె కాని = కీర్తి మాత్రమే కాని; చర్చింపన్ = ఆలోచింపగా; వేఱొండు = మఱియొక; సాక్షికలడె = చూచువాడు ఉన్నాడా?; సుగుణాబ్ధివి + అని = సద్గుణ సముద్రుడవు అని; నిన్నున్, స్తుతి, ఒనర్చుటె, కాని = నిన్ను పొగడుటయేకాని; నీకు మించన్ = నిన్నుమించు; నిర్గుణుండు + ఎవ్వడు = గుణములేనివాడు ఎవడున్నాడు?; విశ్వ + ఆత్ముడవు, అటంచున్ = విశ్వస్వరూపుడు అని; వినుతించుటయెకాని = కీర్తించుటే తప్ప; నిన్ను చొచ్చి = నీలో ప్రవేశించి; ఎవ్వడు, చూచినాడు = ఎవడు తెలిసికొనినాడు?; వినికిడియె కాని = వినుటయే తప్ప; నిజంబునకున్ = నిక్కముగా; నిన్నున్, నీ విశ్వములను = నిన్నూ, ఈ విశ్వమునూ; మొదలు, ఎఱుంగుదురే = ఆది, ఎరుగుదురా?; చెపుమ = తెలియజెప్పుమా!

తాత్పర్యము : అఖిలపోషకుడు అని పేరేకాని, నీవే కర్తవు, నీవే భోక్తవు. శాశ్వతుడు అను కీర్తి మాత్రమే కాని అందుకు మఱొక సాక్షిలేదు కదా. సగుణుడు అని నిన్ను స్తుతిస్తారు. కాని నిన్ను మించిన నిర్గుణుడు ఎవరు?. విశ్వాత్ముడు అని నిన్ను వినుతిస్తారు. కాని అవునో కాదో ఎవరికి తెలుసు? ఇదంతా ఎవరో చెప్పగా విన్నది మాత్రమే. నిజానికి నిన్ను గురించి ఈ విశ్వమును గురించి అసలు ఎవరికీ తెలియదు కదా.

54. ఒక గుణంబున నీవె సకల ప్రపంచంబుఁ
గల్పించిని వభూత కల్పనముగ
వేఱొక గుణముచే విశ్వవిశ్వప్రాణ
రక్షణం బొనరింతు వక్షయముగ
మఱి యొందు గుణముచే మండలంబులు గూడఁ
జెఱిపి వేయుదువు నిశ్శేషముగను
నిర్గుణంబున నీవె నిరవకాశంబుగాఁ
బట్టకయుందువు బయలు మెఱిసి
గుణ మొకటిగాదు తెలిసిన గుణములేదు
చేరి నినుఁగొల్వరాదు, వచింపరాదు, చిత్ర...

అర్థములు: ఒక గుణంబునన్ = ఒక గుణముచేత; అభూత కల్పనముగన్ = లేని దానిని చేసినట్లుగా; సకల ప్రపంచబున్ = సమస్త లోకమును; నీవె కల్పించితివి = నీవే సృష్టించినావు; వేఱొక గుణముచేన్ = మఱొక గుణముచే; విశ్వ, విశ్వప్రాణ, రక్షణంబున్ = ప్రపంచము నందలి సమస్త ప్రాణముల ను కాపాడుట; ఒనరింతువు = చేసె దవు; మఱియొందు గుణముచేన్ = మఱొక్క గుణముచే; మండలంబులు కూడన్ = సూ ర్యచంద్రాదుల బింబములను కూడ; నిశ్శేషముగను = మిగులకుండ; చెరిపి వేయుదువు = ధ్వంసము చేస్తావు; నిర్గుణంబునన్ నీవె = గుణశూన్యతచే; నిరవకాశంబుగాన్ = ఎడము లేకుండునట్లు; బయలు మెఱిసి = బయలుపడి; పట్టక యుందువు = ; గుణము, ఒకటికాదు = నీగుణము ఒక్కటి మాత్రమే కాదు; తెలిసిన గుణము లేదు = అయినను మాకు ఒక్క గుణమైనను స్పష్టపడలేదు; చేరినిమన్, కొల్వరాదు = నిన్ను ఆశ్రయించి సేవించుట శక్యము కాదు; వచింపరాదు = నిన్ను వర్ణించుట సాధ్యము కాదు;

తాత్పర్యము:- సత్త్వ గుణముచేత నీవే సమస్త మాయా ప్రపంచమును కల్పించావు. రజోగుణముచే చరాచర ప్రాణికోటిని పోషిస్తావు. రజోగుణముచే సూర్యచంద్రాది మండలాలను కూడా పూర్తిగా ధ్వంసం చేస్తావు. నీవు గుణశూన్యుడవై ఎడము లేకుండా అంతటా వ్యాపిస్తావు. నీవు బహుగుణములు కలవాడవు. అయినా మాకు ఒక్క గుణమును గురించి కూడా తెలియదు. అందుకే నిన్ను సేవించుట వర్ణించుట శక్యము కాదు.

55. జీవిని జీవి భక్షింపఁ జేసితి వింతె
కొని పెట్టినావె చేతనుల కెల్లఁ?
జేసినంత భుజింపఁ జేసినా వింతె కా
కెక్కువ లెవ్వరి కిచ్చినావు?
కర్మసూత్రంబునఁ గట్టి త్రిప్పెదవు గా
కిచ్ఛ నొక్కనిఁ బోవనిచ్చినావె?
వెసఁబృథక్ప్రకృతుల వేఱుఁబెట్టితివి గా
కందఱి కైకమత్య మిడినావె?
తెలిసె నీరక్షకత్వంబు దేవదేవ!
వేఱె గతి లేక నిన్ను సేవింప వలసె. చిత్ర....

అర్థములు :- జీవినిన్, జీవి = ఒక ప్రాణిని మఱొక ప్రాణి; భక్షింపన్, చేసితివి = తినునట్లు చేసినావు; ఇంతె = ఇంత మాత్రమే; చేతనులకు, ఎల్లన్ = ప్రాణులందరికి, కొనిపెట్టినావె = నీ సొమ్ముతో కొని ఆహారము ఇచ్చినావె?; చేసినంత = ఎంతచేసినారో అంత; భుజింపన్, చేసినావు = అనుభవించునట్లు చేసినావు; ఇంతెకాక = అంతేకాని; ఎక్కువలు = పెక్కువలు; ఎవ్వరికి, ఇచ్చినావు = ఏ జీవులకు ఇచ్చినావు; కర్మసూత్రంబునన్, కట్టి = పాపపుణ్యములను త్రాడుతో బంధించి; త్రిప్పెదవు కాక = తిరుగునట్లుచేసెదవు అంతేకాని; ఒక్కనిన్ = ఒక్కనినైన, ఇచ్ఛన్ = తాను కోరినట్లు, పోవన్, ఇచ్చినావె = పోవుటకు అంగీకరించితివా?; వెసన్ = వేగముగా; పృథక్, ప్రకృతులన్ = వేఱువేఱు స్వభావము కలవారిని, వేఱు పెట్టితివికాక = వేఱు చేసితివి, అంతేకాని; అందఱికిన్ = వారందఱికి; ఐకమత్యము, ఇడినావె = ఒక అభిప్రాయము కలిగియుండునట్లు చేసినావా?; దేవదేవ = దేవతలకు దేవుడవైన వాడా!; నీరక్షకత్వంబు = నీయొక్క రక్షించు గుణము; తెలిసెన్ = తేటపడినది, వేఱెగతిలేక = మఱియొక దిక్కు లేకపోవుటచేత; నిన్నున్, సేవింపవలసెన్ = నిన్నుకొలువవలసివచ్చినది.

తాత్పర్యము :- ఒక జీవికి మఱొక జీవిని ఆహారంగా ఏర్పాటుచేశావు. అంతేకాని శ్రమపడి ఎవ్వరినీ నీవు పోషింపలేదుకదా. 'చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవ'! అన్నట్లు జీవులు చేసిన పాపపుణ్యముల కొలది వారు కష్ట సుఖములను అనుభవించేటట్లు చేశావు. అంతేకాని అంతకు మించి వారికి నీవు ఏమీ ఇవ్వలేదు కదా! ప్రాణులను కర్మ సూత్రమునకు కట్టివేసి దానికిలోబడి జీవించేటట్లు చేశావు. అంతేకాని ఒక్కడినైనా యథేచ్ఛముగా బ్రతుకనీయవు కదా. మానవులను భిన్న ప్రకృతులుగా సృష్టించి వేఱుపఱచినావు. అంతేకాని వారిని ఏకాభిప్రాయులుగా చేయలేదు కదా. దేవదేవ! నీవు ప్రాణులను రక్షించు విధము మాకు విశదమైనది. నీవల్ల మాకు ఒరిగే దేమీలేదు. అయినా గతిలేక నిన్నే కొలుస్తున్నాము.

56. నీరుపట్టుగ నుంట నారాయణుండ వండ్రు
నారాయణాఖ్యాధికార మేమి ?
బలిసి యంతట నీవె గలుగ విష్ణుండ వందు
రావిష్ణునామప్రభావ మేమి ?
ముగురు నీవై వెలుంగcగc గేశవుcడ వండ్రు
కేశవాభిఖ్యాప్రకాశ మేమి ?
సిరికి మగండవై మెరయ శ్రీపతి వండ్రు
శ్రీపతి నామప్రసిద్ధి యేమి ?
పెట్టుపేరు లనేకముల్ పుట్టుపేరు
గుఱుతు తెఱింగిన నీమూల మెఱుఁగవచ్చు. చిత్ర....

అర్థములు :- నీరు, పట్టుగన్, ఉంటన్ = నీరు ఉనికిపట్టుగా ఉండుటవల్ల; నారాయణుడవు, అండ్రు = నీవు నారాయణుడవు అని అంటారు; నారాయణ + ఆఖ్యా + అధికారము, ఏమి ? = నారాయణుడు అనే పేరు యొక్క దొరతనమేమిటి ?; బలిసి = వ్యాపించి; అంతటన్, నీవె కలుగన్ = అన్నిచోట్ల ఉండుటవల్ల; విష్ణుడవు, అందురు = నీవు విష్ణుడవు అని అంటారు; ఆ విష్ణునామ ప్రభావము, ఏమి? = ఆ విష్ణునామం యొక్క గొప్పతనమేమిటి ?; ముగురు నీవు, ఐ, వెలుంగగన్ = ముగ్గురూ నీవై ప్రకాశించుటచేత; కేశవుడవు, అండ్రు = నీవు కేశవుడవు అని అంటారు; కేశవ + అభిఖ్యా ప్రకాశము ఏమి ? కేశవనామం యొక్క కాంతి యేమిటి ?; సిరికిన్ = శ్రీదేవికి; మగండవు, ఐ = భర్తవై; మెఱయన్ = ప్రకాశించుటచేత; శ్రీపతివి, అండ్రు = శ్రీపతివి అని అంటారు; శ్రీపతినామ ప్రసిద్ధి, ఏమి ? శ్రీపతినామం యొక్క ఖ్యాతియేమిటి ?; పెట్టుపేరులు = నీకు పెట్టుడుపేర్లు; అనేకముల్ = పెక్కు; పుట్టుపేరు = పుట్టుకతోనే వచ్చిన పేరు; గుఱుతు, ఎఱింగినన్ = తెలిసికొన్నచో; నీ మూలము = నీ మొదలు; ఎఱుగవచ్చున్ = బాగుగా తెలిసికొనుట శక్యమగును.

తాత్పర్యము :- జలధిశాయి వగుటచేత నారాయణుడవనీ, సర్వవ్యాపివి అగుటచేత విష్ణుడవనీ, బ్రహ్మవిష్ణుమహేశ్వరులనే మూర్తిత్రయం నీవే అగుటచేత కేశవుడవనీ, లక్ష్మీదేవికి మగడ వగుటచేత శ్రీపతివనీ భక్తులు నిన్నుకీర్తిస్తూ ఉంటారు. వాస్తవానికి ఇవన్నీ నీకు భక్తులు పెట్టిన పేర్లు. అసలు నీపుట్టుపేరు ఏదో తెలిస్తే నీ మూలం తెలిసికొనుట సాధ్యమయ్యేది. నారాయణాది నామములు నీ మూలం తెలుసుకోవటానికి పనికివచ్చేవి కావు సుమా.

57. వేఁడని చూడక విపినవహ్ని జ్వాలఁ
        ద్రావెదో తేనియఁ ద్రావినట్లు
    భారమంచనక గోవర్ధనపర్వతం
        బెత్తెదో పూబంతి యెత్తినట్లు
    విషపుంజమనక నాభీలాజగర జిహ్వఁ
        జింపెదో ప్రాబట్టఁజింపినట్లు
    వెస నసాధ్యుండని వెఱవక నరకుని
        నఱకెదో పార్వేఁట నఱికినట్లు
    భక్త సంరక్షణ త్వరా పరవశతను
    జేసినావేమొ యూరక సేయఁగలవె? చిత్ర...

అర్థములు: వేడి + అని, చూడక = వేడిగా ఉన్నప్పటికీ, లెక్కచేయకుండా; విపినవహ్ని జ్వాలన్ = కార్చిచ్చుమంటను; తేనియన్, త్రావిన అట్లు - తేనెను త్రాగి వేసినట్లు; త్రావెదో = జంకకుండా త్రాగెదవా ?; భారమంచు, అనక = బరువు అని తలపకుండా; పూబంతి ఎత్తినట్ల = పూలబంతిని ఎత్తినట్లు; గోవర్ధన పర్వతంబు = 'గోవర్ధనము' అనుకొండను; ఎత్తెదో = తేలికగా ఎత్తెదవా; విషపుంజము అనక = విషసమూహము అని భయపడకుండ; ఆభీల = భయంకరమైన; అజగర, జిహ్వన్ = కొండచిలువ నాలుకను; ప్రాత - బట్టన్ = పాతవలువను; చింపినట్లు = చింపినట్లు; చింపెదో = చింపివేస్తావా ?; అసాధ్యుండు, అని, వెఱవక = జయింపరానివాడు అని భయపడకుండ; నరకుని = నరకాసురుని; పార్వేటన్ = వేటలో; నఱికినట్లు = నఱికివేసినట్లు; వెసన్ = వేగముగా; నఱకెదో = నఱికివేస్తావా ?; భక్త సంరక్షణ త్వరా పరవశతను = భక్తులను క్షమించు త్వరకు లోనై; చేసినావు, ఏమొ = చేసియుందువు; ఊరక = తగినకారణములేకుండా; చేయన్ కలవె = చేయగలవా ?

తాత్పర్యము: దుస్సహమైన వేడిని సరకు చేయకుండా దావాగ్నిని తేనెవలె మింగినావు. బరువు లెక్కచేయకుండా గోవర్ధన పర్వతమును పూబంతి ఎత్తినట్లు అవలీలగా ఎత్తినావు. ఏ మాత్రం భయపడకుండా విసపు పుట్టయైన కొండచిలువ నాలుకను పాతబట్టనువలె చింపి వేసినావు. అసాధ్యుడైన నరకుని వేటాడినావు. భక్తులను రక్షించాలనే తొందరలో ఇటువంటి సాహస కార్యములు చేసినావు కాబోలు.

58. వత్సాపహరణ గర్వము మాని యజుండు దా
నపరాధి ననుచు సాష్టాంగ మెఱఁగె
భవుఁడు బాణున కాజి బాసట యై వచ్చి
భక్తునిఁబట్టిచ్చి ప్రణుతిఁ జేసె
వజ్రి శిలావృష్టి వర్షించి లజ్జించి
తప్పుఁ జేసితి నంచు దండ మిడియె
సమవర్తి భీతి నంజలిఁజేసి యాత్మలో
కస్థితు గురుపుత్త్రుఁగాను కిచ్చె
క్షోణిఁ బుట్టుక మాలిన గొల్లవాని
నిన్ను నావేల్పు లోడింప నేరరేమి? చిత్ర....

అర్థములు :- వత్స + అపహరణ, గర్వమున్ = లేగలను దొంగిలించిన కావరమును; మాని = విడిచిపెట్టి; అజుడు, తాన్ = బ్రహ్మనేను; అపరాధిన్, అనుచున్ = తప్పుచేసినాను అని పలుకుచు; స + అష్ట + అంగము = ఎనిమిది అంగములు నేలకు తగులునట్లుగా; ఎఱగెన్ = నమస్కరించెను; భవుడు = శివుడు; బాణునకున్ = బాణాసురునకు; ఆజిన్ = యుద్ధములో; బాసటయైవచ్చి = తోడై వచ్చి; భక్తునిన్, పట్టి, ఇచ్చి = తన భక్తుని ఒప్పగించి; ప్రణుతి చేసెన్ = నమస్కరించెను; వజ్రి = ఇంద్రుడు; శిలావృష్టిన్ = రాళ్లవానను; వర్షించి = కురిపించి; లజ్జించి = సిగ్గుపడి; తప్పున్, చేసితిన్, అంచున్ = నేరము చేసినాను అని పల్కుచు; దండము + ఇడియెన్ = నమస్కరించెను; సమవర్తి = యముడు; భీతిన్ = భయముతో; అంజలిన్ చేసి = దోసిలి యొగ్గి; ఆత్మలోకస్థితున్ = తన లోకములోనున్న; గురుపుత్రున్ = గురువు యొక్క కొడుకును; కాన్క, ఇచ్చెన్ = కానుకగా సమర్పించెను; క్షోణిన్ = భూమిపై; పుట్టుకమాలిన = పుట్టుకలేని; గొల్లవానిన్ నిన్నున్ = గొల్లజాతి వాడవైన నిన్ను; ఆ వేల్పులు = బ్రహ్మ మొదలైన దేవతలు; ఓడింపన్ = ఓడింపగా; నేరర, ఏమి ? = చాలరా యేమిటి ?

తాత్పర్యము :- క్రేపులను, గోపాల బాలకులను దాచి భంగ పడిన బ్రహ్మదేవుడు గర్వము సర్వము ఖర్వము కాగా తప్పును ఒప్పుకొని నీకాళ్లపై పడినాడు. తన భక్తుడైన బాణాసురునకు సాయముచేయ వచ్చి శివుడు అనిలో ఓడి తన భక్తుని నీకు ఒప్పగించి . నమస్కరించినాడు. ఇంద్రుడు రాళ్లవాన సృష్టించి గోవర్ధనమెత్తినీవు గోగోపకులను రక్షింపగా, సిగ్గుపడి నేరము చేసినాను మన్నింపుమని నీకు దండము పెట్టినాడు. నీకు భయపడి యముడు తన లోకములోనున్న గురుపుత్రుని నీకు సమర్పించినాడు. ఊరుపేరు లేని గోపాలకులములో పుట్టిన నిన్ను బ్రహ్మాది దేవతలు ఓడింపలేరా ? నిన్ను కనికరించినారు. అంతే సుమా. నీ గొప్పతనం కాదు.

59



కౌసముట్ట హెచ్చుతగ్గుల ప్రాంతసుద్దుల
తాత పుస్తక మొకండాతతాయి
ప్రుచ్చిలి నీటిలోఁజొచ్చిడాఁగిన వాని
పావనతేమి? వెంబడిగఁబెద్ద
కోలమీనంబవైయాఱొందు సంద్రముల్
నిముసంబులో నీది నెమకి వాని
డొక్కప్రక్కలుగాఁ గలుక్కన బరిఁగోసి
కడలేనిసుదువు లెక్కటికి నోట
మాటవెళ్లని వానికి మగుడనిచ్చి
యింతపనికిని నవతారమెత్తితీవు! ॥చిత్ర॥

అర్థములు: కౌసముట్టన్ = చివరదాకగా; హెచ్చుతగ్గుల = ఎక్కువ తక్కువ స్వరములు కలిగిన; ప్రాంతసుద్దుల = ప్రాత పలుకుల; తాత పుస్తకము = ధాత గ్రంథమును; ఆతతాయి ఒకడు = దొంగయొకడు; ప్రుచ్చిలి = దొంగిలించి; నీటిలోన్ = సముద్రపునీటిలో; చొచ్చి = చొరబడి; డాగినన్ = దాగుకొనగా; వాని = వాటియొక్క; పావనత+ఏమి?=పవిత్రత యెటువంటిదోకాని; పెద్ద = శ్రేష్ఠమైన; కోలమీనంబవై = వేయి కోలలచేపవై; వెంబడిగన్ = వానివెంట; ఆఱొందు (ఆరు+ఒందు) సంద్రముల్ = ఏడు సముద్రములు; నిముసంబులోన్, ఈది = రెప్పపాటు కాలములో ఈది; నెమకి = వెదకి; వాని = ఆ దొంగ; డొక్క = పొట్ట; ప్రక్కలుగాన్ = ముక్కలగునట్లు; కలుక్కనన్ = కలుక్కుమని ధ్వని కలుగునట్లుగా; బరిన్, కోసి = ప్రక్కను సఱకి; కడలేని సుదువులు = అనంతములైన పలుకులు (వేదములు); ఎక్కటికిన్ = ఒంటరికి; నోటి నుండి; మాట వెళ్లని వానికిన్=మాటరాని వానికి; మగుడన్, ఇచ్చి = మరల ఒసగి; ఇంత పనికి = ఇంత పని చేయుటకు, ఈవు = నీవు; అవతారము, ఎత్తితివి = మత్స్యావతారము ఎత్తినావు.

తాత్పర్యము: ఆద్యంతమూ ఉదాత్త అనుదాత్త స్వరాలతో ఉచ్చరింపదగిన వేదాలను బ్రహ్మముఖం నుండి హరించి సోమకుడు అనే రాక్షసుడు మున్నీటి నీటిలో దాగుకోగా, వాటి పవిత్రత ఎటువంటిదోకాని కొఱ్ఱమీనై వెంటపడినావు. సప్త సముద్రాలు క్షణమాత్రంలో వెదకి వేదచోరుని పట్టుకొని డొక్క చించి వేదాలను చతుర్ముఖునకు మరల ఇచ్చి మాట్లాడే శక్తిని కల్గించినావు. ఇందుకోసమే కదయ్యా నీవు మత్స్యావతారమెత్తినది.

60. అబ్ధిపయఃపాత్ర మద్రిరాణ్మంథాన
మహిరాజ గుణము దారమరఁ గూర్చి
యమృతాభిలాష దేవాసురుల్ మథియింప
గిరి మున్గఁ గచ్ఛపాకృతి వహించి
నిర్వహించుట గాని సర్వకాశ్యపులలోఁ
బంక్తి భేదముఁ జేసి పల్మఱాస
కొల్పి దైత్యులనోరు గొట్టి యాదిత్యుల
కమృతాన్న మిడితివా యమరులందుఁ
బక్షపాతివి గావె ? యీపాటివాని
నమ్మెదురె యానిశాటు లెన్నఁటికి నిన్ను ? చిత్ర...

అర్థములు : అబ్ధి = సంద్రము; పయః పాత్రము = పాలకుండగా; అద్రిరాట్ = పర్వత రాజమైన మందరగిరి; మంథానము = కవ్వముగా; అహిరాజు = సర్పరాజైన వాసుకి; గుణము = కవ్వపుదాడుగా; తారు = తాము; అమరన్, కూర్చి = ఒప్పునట్లుచేసి; అమృత + అభిలాషన్ = అమృతమునందలి కోరికతో; దేవ + అసురుల్ = దేవతలు, రాక్షసులు; మథియింపన్ = త్రచ్చుచుండగా; గిరి = కవ్వపుగొండ; మున్గన్ = సముద్రములో క్రుంగిపోగా; కచ్ఛప + ఆకృతిన్ = తాబేలు రూపముతో; వహించి = మోసి; నిర్వహించుట, కాని = పంచుకొనుట చేతగాని; సర్వ కాశ్యపులలోన్ = సమస్త దేవతల; దానవులలో; పంక్తి భేదమున్ = బంతిలో, విభాగమును; చేసి = కల్పించి; పల్మఱు (పలు + మాఱులు) = మాటిమాటికి; ఆసకొల్పి = కోరిక కలిగించి; దైత్యుల నోరు, కొట్టి = రాక్షసులను తినకుండ జేసి; ఆదిత్యులకు = వేల్పులకు; అమృత - అన్నము = అమృతమను ఆహారమును; ఇడితివి = ఇచ్చినావు; ఆ అమరుల, అందున్ = దేవతల యెడ; పక్షపాతివికావె = అభిమానము కలవాడవు కావా ?; ఈపాటి వానిన్, నిన్నున్ = ఇట్టివాడవైన నిన్ను; ఎన్నటికిన్ = ఎప్పుడును; ఆ నిశాటులు = ఆ, రక్కసులు; నమ్మెదురె = నమ్మువారా ?

తాత్పర్యము : కృతయుగంలో, క్షీర సముద్రమును పాలకుండగా, మందరగిరిని కవ్వముగా, వాసుకిని కవ్వపు త్రాడుగా అమర్చి, అమృతమును సంపాదింపవలెను అను కోర్కెతో దేవదానవులు చిలుకు సమయమున మందరగిరి సముద్రజలములో మునిగిపోయెను. అప్పుడు నీవు కూర్మ రూపము ధరించి మందరగిరిని పైకెత్తి వీపుపై మోసితివి. మోహినీ రూపము దాల్చి, కశ్యప మహర్షి పుత్రులైన దేవతలను రాక్షసులను వేఱువేఱు వరుసలలో కూర్చుండబెట్టి పెక్కుసార్లు ఊరించి రాక్షసులకు దక్కకుండ జేసి వేల్పులకు అమృత భోజనమును ప్రసాదించినావు. నీకు దేవతలంటే పక్షపాతము. మోసకారివైన నిన్ను ఆ రాక్షసులు ఎప్పటికీ నమ్మరుకదా.

61 ఉక్కునఁబసిఁడికన్ రక్కసుఁ డొకఁడుపల్
దిక్కులోరిచి బొళ్లి పక్కిమావు
నెక్కు రౌతెక్కడఁ జిక్కెడు? నంచునీ
యిక్కువ లరయంగఁ గిక్కురించి
నక్కితి విలఁక్రిందఁ జొక్కపుఁబందివై;
కొక్కరింపుచు నాతఁడక్కడికిని
మొక్కరింపఁగఁ జొర బొక్కలేకట వాని
డొక్కఁగటుక్కునఁ జెక్కివట్టి
నొక్కిపుడ మింతనీటిపై కెక్కఁదీయ
మక్కువ దనర్పనది యేమి రక్కరింపు? ॥ చిత్ర ॥

అర్థములు: పసిడికన్ రక్కసుడు, ఒకడు = హిరణ్యాక్షుడనే రాక్షసుడొకడు; ఉక్కునన్=మదములో; బొళ్లిపక్కిమావున్ = తెల్లని పక్షి గుఱ్ఱమును; ఎక్కు = ఎక్కితిరుగు; రౌతు = రవుతు; ఎక్కడ చిక్కెడున్, అంచున్ = ఎక్కడ దొరకును? అని; పల్ + దిక్కులు, ఓరిచి = అన్ని దెసలు జయించుచు; నీ ఇక్కువలు = నీ నివాస స్థానములు; అరయంగన్ = వెదకగా; కిక్కురించి = మోసగించి, చొక్కపు బందివై (చొక్కము + పందివై) =చక్కని వరాహావతారమెత్తి, ఇలక్రిందన్ = భూమిలో; నక్కితివి = దాగుకొంటివి; కొక్కరింపుచున్ = గేలిచేయుచు; ఆతడు = ఆ హిరణ్యాక్షుడు; మొక్కరింపగన్ = కావరము చూపుట కొఱకు; చొరన్ = ప్రవేశింపగా; అటన్ బొక్కలేక = అక్కడ కన్నము లేక పోవుట చేత; వానిడొక్కన్ = హిరణ్యాక్షుని ఉదర పార్శ్వమును; కటుక్కునన్ = కటుక్కుమనే ధ్వని కలుగునట్లు; చెక్కి = నఱకి; పట్టి = పట్టుకొని, నొక్కి = అదిమి; పుడమి = భూమిని; ఇంత = అపరిమితమైన; నీటి పైకిన్ = సముద్రపు నీళ్లపైకి; మక్కువన్ = ప్రీతిలో; తనర్పన్ = ఒప్పగా; ఎక్కదీయన్ = లేవనెత్తగా; అది = ఆ ఉద్ధరణ; ఏమి రక్కరింపు? = ఎటువంటి రక్షణ?

తాత్పర్యము: హిరణ్యాక్షుడను రాక్షసుడు వైకుంఠుడెక్కడనున్నాడు? అని అడుగుచు నలుదెసలందు నీవు ఉన్నచోటు వెదకసాగెను. నీవు అతనికి భయపడి వరాహ రూపము ధరించి రసాతలమున నక్కియుంటివి. హిరణ్యాక్షుడు అక్కడకు వచ్చి, నీతో యుద్ధమునకు తలపడెను. అంతట నీవు తప్పించుకుకొను వెఱవు లేక రక్కసుని డొక్క బద్దలు చేసి, నీటిలో మునిగిన భూమిని పైకి తేర్చినావు. ఇది శౌర్యమనిపించుకొనునా స్వామీ!

62. అయవారు చదివించినట్లుగాఁ జదువక
మఱికొట్టి తిట్టఁగ వెఱపుఁ గొనక
తనయుఁడెంతో పరధ్యానంబుగా నున్నఁ
దండ్రి వల్దని చెప్పఁదగఁడె ధాత్రి?
నీకు గోపం బేమి? నృహరిరూపంబున
స్తంభంబులోఁ బుట్టి చటులనేత్ర
దంష్ట్రానఖ ప్రభ దహన కీలలఁ బోలి
భగ్గు రనంగఁ బైఁ బడి హిరణ్య
కశిపుఁ దునుమాడి ప్రహ్లాదుఁ గరుణనేలి
తండఱి కసహ్యమయ్యె నిన్నపుడె కనఁగ, చిత్ర...

అర్థములు : అయవారు = గురువు; చదివించిన, అట్లు, కాన్ = చదువు చెప్పిన విధముగా; చదువక = చదువకుండా; మఱి = పిమ్మట; కొట్టి, తిట్టగన్ = కొట్టితిట్టగా; వెఱపున్, కొనక = భయపడక; తనయుడు = కొడుకు; ఎంతో = మిక్కిలి; పరధ్యానంబుగాన్, ఉన్నన్ = మఱియొక దానియందు మనస్సు నిల్పగా; ధాత్రిన్ = భూమిపై; తండ్రి = కన్నతండ్రి; వల్దని, చెప్పన్, తగడె = వద్దు అని చెప్పుటకు చాలదా; నీకున్, కోపంబు, ఏమి = నీకు కోపమెందుకు?; నృహరి రూపంబునన్ = నరసింహ రూపముతో; స్తంభంబులోన్, పుట్టి = స్తంభములో పుట్టి; చటుల = అందమైన; నేత్ర, దంష్ట్ర, నఖప్రభ = కనుల, కోఱల, గోళ్లకాంతి; దహన కీలలన్, పోలి = అగ్నిజ్వాలలకు సాటియై; భగ్గురనంగన్ = బగ్గుమని మండుచుండగా; పైన్, పడి = మీదపడి; హిరణ్యకశిపున్ = హిరణ్యకశిపుని; తునుమాడి = చీల్చి; ప్రహ్లాదున్ = ప్రహ్లాదుని; కరుణన్, ఏలితి = దయతో కాపాడినావు; నిన్నున్ అపుడె = ఆ సమయమునందున్నట్టి; కనగన్ = చూడగా; అందఱికిన్ = ఎల్లరకును; అసహ్యమయ్యెన్ = సహింపరాని దయ్యెను.

తాత్పర్యము : గురువైన చండామార్కుడు చెప్పినది చదువకుండా, కొట్టినా తిట్టినా భయపడకుండా కన్నకొడుకు పరధ్యానంగా ఉంటే కన్నతండ్రి అదికూడదు అని నివారించుట తప్పా? మధ్య నీకెందుకు కోపం? నరసింహరూపము దాల్చి స్తంభమునుండి వెలువడి అగ్ని శిఖలవలె కాంతులెగజిమ్మే గోళ్లతో హిరణ్య కశిపుని పొట్టచీల్చి, ప్రహ్లాదుని రక్షించినావు. అప్పుడు నీ రూపము చూచి అందరు భయపడినారు.

63. కశ్యపుఁడదితి నిన్గన్న వారలు గారె
పెంచిరే మరుగుజ్జుబిడ్డ వనుచుఁ
గుండిక దండంబు గోఁచితో వచ్చిన
కపటవటుండు నిక్కముగ భూమి
సురుడు గాఁడని యాత్మగురుఁడీయ వలదనఁ
గరుణించి బలిదాత కామితార్థ
మొసఁగంగ నభివృద్ధి నొంది మే లోర్వక
ధర్మంబు నాల్గుపాదముల జరుపు
నట్టిదాతను దిగఁద్రొక్కి యతని సిరులు
దెచ్చి కులగోత్ర భేదికీ నిచ్చకంబా? చిత్ర...

అర్థములు: కశ్యపుడు = కశ్యపమహర్షి; అదితి = అదితిదేవి; నిన్, కన్నవారల కారె = నిన్ను కన్న తల్లిదండ్రులు కారా?; మరుగుజ్జు బిడ్డవు, అనుచున్ = వామనుడైన కొడుకు అని; పెంచిరే = సాకినారా?; కుండిక, దండంబు, గోచి, తోన్ = కమండలువు, దండము, గోచి తాల్చి; వచ్చిన = అరుదెంచిన; కపటవటుండు = దొంగవడుగు; నిక్కముగన్ = నిజముగా; భూమి సురుడుకాడు = బ్రాహ్మణుడు కాడు; అని = అంటూ; ఆత్మ గురుడు = తన కులగురువు; ఈయవలదు, అనన్ - ఇవ్వవద్దు అనిపలుకగా; కరుణించి = దయకలవాడై; బలిదాత = బలి అనేదాత; కామిత + అర్థము = కోరిన వస్తువు, ఒసగంగన్ = ఇవ్వగా; అభివృద్ధిన్, ఒంది = పెంపునుపొంది; మేలు, ఓర్వక = గొప్పతన మును ఓర్వలేక; ధర్మంబున్ = న్యాయమును; నాల్గుపాదములన్ = నాలుగు పాదములతో జరుపునట్టి = నడపునటువంటి; దాతను, దిగద్రొక్కి = దాతను అడుగునకు త్రొక్కివేసి అతని, సిరులు, తెచ్చి = వానిసంపదలు తీసికొనివచ్చి; కులగోత్ర భేదికిన్ = ఇంద్రునకు ఈన్ = ఇవ్వగా; ఇచ్చకంబా? = ప్రియమా?

తాత్పర్యము: అదితి కశ్యపులు నిన్ను కన్నవారైనను మరుగుజ్జు బిడ్డవైన నిన్ను దయతో పెంచలేదు. అందుకే బలిచక్రవర్తిని యాచించుటకు వెళ్లినావు. 'ఇతడు కపటవటువు. ఇతడు అడిగినది ఇవ్వవద్దు సుమా'. అని కుల గురువైన శుక్రాచార్యుడు హెచ్చరించినను చెవిబెట్టక నీవు అడిగిన మూడు అడుగులచోటు బలి నీకు దారపోసెను. కానినీవో, దాతను పాతాళమునకు త్రొక్కివేసి, అతని సంపదలు ఇంద్రునకు ఇచ్చినావు కదా. ఇంతకంటే మోసము కలదా? ఇట్టి పనులు నీకు ఇష్టము కాబోలు.

64. జపతపోనిష్ఠుఁ డౌ జమదగ్ని కుదయించి
కరము దారుణవృత్తిఁ గత్తి కట్టి
కినుక రాజద్రోహమునకు శంకింపక
సకల భూపతుల గొంతుకలు గోసి
కార్తవీర్యార్జును కరసహస్రం బొందు
తఱి గండగొడ్డంట నఱికివైచి
వసుధపై రక్తప్రవాహంబు లొనరించి
తజ్జలంబులఁ బితృతర్పణములు
సేసి యిల విప్రులకు ధారపోసినట్టి
కీర్తియే కాని బ్రాహ్మణకృత్య మగునె. చిత్ర....

అర్థములు :- జప = మంత్రాదులను ఉచ్చరించుట యందు; తపస్ = తపము చేయుట యందు; నిష్ఠుడు + ఔ = ఎడతెగని శ్రద్ధకలిగిన; జమదగ్నికి = జమదగ్ని అనే మునికి; ఉదయించి = పుట్టి; కరము = మిక్కిలి; దారుణవృత్తిన్ = భయంకరమైన రీతితో; కత్తికట్టి = పగగొని; కినుకన్ = కోపముతో; రాజద్రోహమునకున్ = క్షత్రియులకు కీడు చేయుటకు; శంకింపక = సందేహింపకుండ; సకల భూపతుల = ఎల్ల రాజుల యొక్క; గొంతుకలు, కోసి = కంఠములు ఖండించి; కార్తవీర్యార్జును = కార్త వీర్యార్జునుడనే రాజు యొక్క; కరసహస్రంబు = చేతుల యొక్క వేయింటిని; ఒందు తఱిన్ = ఒక సమయమున; గండ గొడ్డంటన్ = పరశువుతో; నఱికివైచి = ఖండించి; వసుధపైన్ = భూమిపై; రక్తప్రవాహంబులు = నెత్తురు వెల్లువలు; ఒనరించి = కావించి; తత్, జలంబులన్ = ఆ నీళ్లతో; పితృ తర్పణములు = పితరులనుద్దేశించి విడుచుటలు; చేసి = కావించి; ఇలన్ = నేలను; విప్రులకున్ = బ్రాహ్మణులకు; ధార పోసిన, అట్టి = దానము చేసినటువంటి; కీర్తియే కాని = పేరు మాత్రమే తక్క; బ్రాహ్మణకృత్యము, అగునె ? = బ్రాహ్మణుడు చేయదగిన పని అవుతుందా ?

తాత్పర్యము :- తపస్వియైన జమదగ్ని మహర్షి కడుపున రాముడను పేరుతో పుట్టినావు. క్షత్రియజాతిపై కత్తి కట్టి సమస్తరాజుల కుత్తుకలను కోసినావు. కార్తవీర్యార్జునుని సహస్ర బాహువులను పరశువుతో తెగనఱికి భూమిపై రక్తమును ప్రవహింపజేసినావు. ఆ రక్తముతో తండ్రికి తర్పణము ఇచ్చినావు. భూమిని బ్రాహ్మణులకు ధార పోసినావు. ఇట్టి హింసా కృత్యములు చేయుట వల్ల నీకు కీర్తి వచ్చిన మాట నిజమే కాని, ఇవి బ్రాహ్మణుడు చేయదగిన పనులు కావు కదా.

65 సీ. తా వచ్చెద నటంచు ధైర్యలక్ష్మి మహీజ
వెంట రా నడవికి వెడలినావు
సుగ్రీవుఁ డున్నచో సొమ్ముఁ దా నిడ సీత
యాజాడ నతనిపొం దతికినావు
ముందు జానకి లంక మూర్ఛించి చొచ్చినిన్
దెచ్చిన రిపుల సాధించినావు
వైదేహి భవదంకవసతిఁ గూర్చున్నచో
భువనసామ్రాజ్యముల్ పొందినావు
తే. గట్టిగా మైథిలిని జెట్టఁబట్ట నట్టి
పౌరుషము లబ్బె నేనాఁటిపూరుషుఁడవొ, చిత్ర.

అర్థములు: వచ్చెదను, అట, అంచున్ = నీ వెంట వచ్చెదనని అంటూ; ధైర్యలక్ష్మి = ధైర్య సంపద మూర్తీభవించిన; మహీజ = సీతాదేవి; తాన్ = తాను; వెంటన్, రాన్ = అనుసరింపగా; అడవికిన్ - అరణ్యమునకు; వెడలినావు = వెళ్లినావు; సుగ్రీవుడు + ఉన్నచోన్ = సుగ్రీవుడు నివసించే చోట; సీత = జానకీదేవి; తాన్ = తాను; సొమ్మున్ = నగలమూటను; ఇడన్ = జారవిడువగా; ఆ, జాడన్ = ఆ గుఱుతును బట్టి; అతని పొందున్ = వాని మైత్రిని; అతికినావు= అంటుకొనినావు; ముందు = ముందుగా; జానకి = సీతాదేవి; మూర్ఛించి = పట్టుదలతో; లంకన్ = లంకానగరంలో; చొచ్చి = ప్రవేశించి; నిన్, తెచ్చినన్ = నిన్ను రప్పించుటవల్ల; రిపులన్ = శత్రువులను; సాధించినావు = సంహరించినావు; వైదేహి = జానకి; భవత్, అంకవసతిన్ = నీ ఒడిలో; కూర్చున్నచోన్ = కుర్చుండుటచేత; భువన సామ్రాజ్యముల్ = లోకాధిపత్యమును; పొందినావు = పడసినావు; గట్టిగాన్ = దృఢముగా; మైథిలిన్ = సీతాదేవిని; చెట్టన్, పట్టన్ = కరగ్రహణము చేయుటచేత; అట్టి = అటువంటి; పౌరుషములు, అబ్బెన్ = పరాక్రమము లభించెను (అంతేకాని) ఏనాటి, పూరుషుడవో = ఎప్పటి మగవాడవు.

తాత్పర్యము: ధీరురాలైన సీతాదేవి వెంట వచ్చుట చేత అడవికి వెళ్ళినావు. సుగ్రీవుడు నివసించే ఋశ్యమూకాద్రిపై సీతాదేవి నగలమూటను పై నుండి పడవేయుటచేత అతనితో స్నేహం చేశావు. జానకీ దేవి ముందుగానే హఠంతో లంకలో ప్రవేశించుటచేత ఆమెను తెచ్చుటకై వెళ్లి రావణాది రాక్షసులను వధించినావు. సీతాదేవి నీ అంకప్రదేశమున ఆసీన యగుటచేత అదృష్టము వరించి చక్రవర్తివై నావు. జానకీ దేవిని పెండ్లాడుట వల్ల నీకు ఇట్టి మగటిమి కలిగినది. అంతేకాని స్వయంగా నీవు పరాక్రమశాలివి కాదు సుమా.

66\. ధర్మవిఘాత మిద్ధర నీవొనర్చిన
మూఁడులోకంబులు మ్రోసెనపుడె
జనకునికూఁతు నిచ్చను బెండ్లి యాడంగ
నరనాథకోటులు నవ్వి రపుడె
పుణ్యజనంబులఁ బోర బాధింపంగ
సురలద్భుతము నొంది చూచి రపుడె
సంతతాశ్రిత విభీషణు రాజుఁ జేయంగ
నల రవీందులు సాక్షి నిలిచిరపుడె
మంచినడవడి నడచినా వెంచి చూడఁ
గీర్తి గల మూర్తివే యిట్టి వార్త లరయ, చిత్ర....

అర్థములు :- ఈ, ధరన్ = ఈభూమిపై; ధర్మవిఘాతము = ధనుస్సును విఱుచుట; నీవు, ఒనర్చినన్ = నీవు చేయగా; మూడు లోకంబులు = ముల్లోకములు; అపుడె మ్రోసెన్ = వెంటనే సంతోషమును ప్రకటించెను; జనకుని కూతున్ = జానకిని; ఇచ్చను = కోరికతో; పెండ్లి యాడంగన్ = పెండ్లాడగా; నరనాథ కోటులు = రాజుల సమూహములు; అపుడె నవ్వెన్ = వెంటనే ఆనందించెను; పుణ్యజనంబులన్ = రాక్షసులను; పోరన్ = యుద్ధములో; బాధింపంగన్ = హింసింపగా; సురలు = దేవతలు; అద్భుతమున్, ఒంది = అచ్చెరువు పడి; అపుడె చూచిరి = వెంటనే నీవైపు చూచిరి; సంతత + ఆశ్రిత = ఎల్లప్పుడు ఆశ్రయించుకొని యుండు; విభీషణున్ = విభీషణుని; రాజున్, చేయగన్ = లంకకు రాజును చేయగా; అపుడె = వెంటనే; అల = ప్రసిద్ధులైన; రవి + ఇందులు = సూర్యచంద్రులు; సాక్షి = సాక్షులుగా; నిలిచిరి = వర్తించిరి; ఎంచి, చూడన్ = పరికించి చూడగా; మంచి నడవడి, నడచినావు = మంచి ప్రవర్తనము చూపినావు; ఇట్టి వార్తలు, అరయన్ = ఇటువంటి వృత్తాంతములు పరిశీలింపగా కీర్తి కలమూర్తివే = ఖ్యాతి కలిగిన వాడవే.

తాత్పర్యము :- నీవు శివధనుస్సు విఱిచినప్పుడు ముల్లోకములలోని వారు తమ సంతోషమును వెలిపుచ్చినారు. సీతాదేవిని పెండ్లాడినప్పుడు రాజులందఱూ ఆనందించారు. రాక్షసులను రణరంగములో నేల కూల్చినప్పుడు వేల్పులు నీవైపు ఆశ్చర్యముతో చూచినారు. ఆశ్రితుడైన విభీషణుని లంకకు రాజుగా చేసినప్పుడు సూర్యచంద్రులు సాక్షులుగా నిలిచారు. ఇదంతా పరిశీలించి చూడగా నీ నడవడి లెస్సగానే ఉన్నదనీ, నీవు కీర్తిశాలివే అని అనిపిస్తున్నది.

67. సన్ముని నధ్వరసాఫల్యుఁ గావింప
జానకీ పరిణయోత్సవము గలిగె
రవినందనునిఁ గీశరాజ్యాధిపతిఁ జేయ
సేతుబంధన కీర్తిఁ జెందగలిగె
బహుదేవతా స్త్రీల బందిగంబులఁబాపఁ
జెఱ నున్న వైదేహిఁ జెందఁ గలిగె
నల విభీషణుని లంకాధినాథునిఁ జేయ
నెలమి నయోధ్య నీవేలఁ గలిగె
నబ్బె నీకుఁ బరోపకారైక ఫలము
లంతియే కాక నీచేతనైనదేమి ? చిత్ర...

అర్థములు : సత్ + మునిన్ = గొప్పమునిని; అధ్వర సాఫల్యున్ = యజ్ఞము యొక్క ఫలము పొందిన వానినిగా; కావింపన్ = చేయగా; జానకీ పరిణయ + ఉత్సవము = సీతను పెండ్లాడుట అన పండుగు; కలిగెన్ = ప్రాప్తించెను; రవినందనున్ = సుగ్రీవుని; కీశ రాజ్యాధిపతిన్, చేయన్ = వానర రాజ్యమునకు ఏలికను చేయగా; సేతు బంధన కీర్తిన్ = సముద్రమునకు వంతెన కట్టిన కీర్తిని; చెందన్, కలిగెన్ = పొందుట సంభవించెను; బహుదేవతాస్త్రీల = పెక్కుమంది దేవతాస్త్రీలను; బందిగంబులన్ = చెఱసాలలనుండి; పాపన్ = తప్పించుటచేత; చెఱనున్న వైదేహిన్ = బందీయైన సీతను; చెందన్, కలిగెన్ = పొందుట ఘటిల్లెను; అల, విభీషణునిన్ = ఆ విభీషణుని; లంకా + అధినాథునిన్, చేయన్ = లంకానగరమునకు రాజుగా చేయగా; ఎలమిన్ = సంతోషముతో; అయోధ్యన్ = అయోధ్యానగరమును; నీవు, ఏలన్, కలిగెన్ = నీవు పరిపాలించుట ఘటిల్లెను; పర + ఉపకారఫలము = ఇతరులకు మేలు చేయుట వలన లాభము; అబ్బెన్ = నీకు దొరకెను; అంతియేకాక = అంతేతప్ప; నీ చేతన్, ఐనది, ఏమి ? = నీ చేత సాధింపబడినది ఏమిటి ?

తాత్పర్యము : బ్రహ్మర్షియైన విశ్వామిత్రుని యాగమును రక్షించుటచేత సీతాదేవిని చేపట్ట గలిగినావు. సుగ్రీవుని వానర రాజ్యమునకు రాజుగా చేయుటచేత, సముద్రమునకు సేతువు కట్టగలిగినావు. రావణుడు చెఱగొన్న దేవతాస్త్రీలను విడిపించుటచేత జానకీ దేవిని తిరిగి పొందగలిగినావు. విభీషణుని లంకకు అధిపతిగా జేయుటవల్ల అయోధ్యా నగరమునకు ప్రభువు కాగలిగినావు. ఈ విధంగా ఇతురులకు ఉపకారం చేయటం వల్ల దానికి ప్రతిఫలంగా నీవు ఎన్నో లాభాలు పొందినావు. అంతే కాని నీప్రయోజకత్వం వల్ల కాదు సుమా ?

68 సీ. ఒక పినతల్లి మే లోర్వలే కనిచిన
విపినంబులకుఁ బోవువెట్టి గలఁడె?
తండ్రి మృతుం డైనఁ దనరాజ్య మత్తఱి
నేల రాకుండినబేల గలఁడె?
యనుజుండు వలదన నాలిమాటలు విని
చెదుగిఱ్ఱిఁ బట్టఁ బోవెడఁగు గలఁడె?
పరదేశమున నుండి బలవద్విరోధంబు
బలిపించుకొన్న వెంగలియుఁ గలఁడె?
తే. నీవు సేసినపను లిట్టినేరుపరివె
జగదుపద్రవ మెట్లు పోఁ జఱచినావొ, చిత్ర.

అర్థములు: ఒక పినతల్లి = తనతల్లి సవతి, మేలు, ఓర్వలేక = తన గొప్ప తనమును సహింపలేక అనిచినన్ = పంపినచో, విపినంబులకున్, పోవు = అడవులకు వెళ్ళు, వెట్టి, కలడె = పిచ్చివాడు ఉన్నాడా?, తండ్రి, మృతుండు + ఐనన్ = తండ్రి చనిపోగా ఆ, తన్ = ఆ సమయమున, తన రాజ్యము, ఏలన్ = తనకు సంక్రమించే రాజ్యమును ఏలుటకు రాక, ఉండిన = రాని, బేల, కలడె = మూఢుడు ఉన్నాడా?, అనుజుండు, వలదు, అనన్ = తమ్ముడు వద్దు అని చెప్పగా ఆలి మాటలు, విని = భార్య పలుకులు విని చెదుగు + ఇఱ్ఱిన్ = మాయలేడిని పట్టన్, పోన్ = పట్టుకొనుటకు వెళ్ళు, వెడగు, కలడె = అవివేకి ఉన్నాడా?, పరదేశమునన్, ఉండి= పెరచోట ఉంటూ, బలవత్, విరోధంబున్ = బలవంతులతో పగను, బలిపించుకొన్న = పెంచుకొన్న, వెంగలియున్, కలడె = మూర్ఖుడు ఉన్నాడా?, నీవు, చేసిన పనులు = నీవు చేసిన కార్యములు, ఇట్టినేరుపరివె = ఇటువంటి నేర్పరివి, జగత్, ఉపద్రవము = లోకములకు కలిగే విపత్తును ఎట్లు = ఏవిధంగా, పోన్, చఱచినావొ = పోగొట్టినావోమఱి.

తాత్పర్యము: పినతల్లి అసూయతో అడవికి పొమ్మంటే పోయావు. తండ్రిచనిపోగా దక్కిన రాజ్యమును పరిపాలించుటకు నీవు నిరాకరించావు. తోడ బుట్టిన వాని మాటలు వినకుండా, భార్య మాటలు విని మాయలేడిని పట్టుకొనుటకు పరుగెత్తినావు. దూరదేశమున ఉంటూ బలవంతులైన రావణుడు మున్నగు వారితో తగవు పెట్టుకున్నావు. నీ వంటి అవివేకి లోకంలో ఉండదు. నీవు చేసిన పన్నీ తెలివి తక్కువ పనులు. ఇటువంటి నీవు లోకానికి దుష్టులవల్ల కలిగిన ఆపదను ఎలా తొలగింప గలిగినావో మఱి.

69. నినుఁగోరుకన్న తండ్రిని నీనిమిత్తమై
వంతించి మృతిఁబొందఁజేసినావు
నిను వనిన్ సేవింప ననుజునాఁకటి కేమి
యొసఁగ కీవే పండ్లు మెసఁగినావు
నినుఁగపుల్ గొల్చి తల్చిన కార్య మీడేర్పఁ
బిదప వారలఁ జెల్లఁ బెట్టినావు
నినుఁ బాయక డవికిఁ జనుదేర నిల్లాలి
నొరుపంచఁ గొన్నినా ళ్లుంచినావు
తే. రాజకళఁ జూచి నిన్నొక రాజ వనిన
మానుషంబేది? యిదియంత మాయగాని, చిత్ర.

అర్థములు: నిన్నున్ కోరు = నిన్ను కోరుకొన్న, కన్న తండ్రివిన్ = తండ్రిని, నీ నిమిత్తమై = నీ కొఱకు, వంతించి = వగచి, మృతిన్, పొందన్, చేసినావు = మరణించునట్లు చేశావు, నినున్ = నిన్ను, వనిన్, సేవింపన్ = అడవిలో కొలువగా, అనుజు, ఆకటికిన్ = తమ్ముని ఆకలి తీరుటకు, ఏమి = ఏ యొక్కటియు, ఒసగక = ఇవ్వక, ఈవే = నీవు మాత్రమే, పండ్లు = అతడు తెచ్చిన పండ్లు, మెసగినావు = ఆరగించితివి, నినున్ = నిన్ను, కపుల్, కొల్చి = వానరులు సేవించి, తల్చిన = నీవు తలపెట్టిన కార్యము = పని, ఈడేర్పన్ = నెఱవేర్పగా పిదప = నీపని పూర్తియయిన తరువాత, వారలన్ = వారిని, చెల్లన్, పెట్టినావు = చెల్లపాలు జేసినావు, నినున్, పాయక = నిన్ను విడిచిపెట్టకుండ, అడవికిన్ = కానకు, చనుదేరన్ = రాగా, ఇల్లాలిన్ (ఇల్లు+ఆలు) = భార్యను, ఒరుపంచన్ = పరాయివాని ఇంట, కొన్నినాళ్లు, ఉంచినావు = కొన్నిదినాలు ఉంచివేసినావు, రాజకళ = స్వరూపమును జూచి, నిన్నున్ = నిన్ను, ఒకరాజవు, అనినన్ = అనేదు అన్నచో, మానుషంబు, ఏది = పౌరుష మెక్కడ, ఇది, అంత = ఇదిపూర్తిగా, మాయ, కాని = భ్రాంతితప్ప.

తాత్పర్యము: కోరి నిను పుత్రునిగా పొందిన కన్న తండ్రి (దశరథుడు) నీ కోసం విలపించి మరణించేటట్లు చేశావు. అడవిలో నిన్ను సేవించిన తమ్ముని (లక్ష్మణుని) ఆకలి పట్టించు కొనకుండా, అతడు తెచ్చిన పండ్లన్నీ నీవే మెక్కినావు. నీకు భక్తులై నీ కార్యం నెఱవేర్చిన వానరులను ఆపై భుక్తి కల్పించకుండా శాఖా మృగాలుగా జేసినావు. నిన్ను విడిచి మనలేక నీ వెంట అడవికి వచ్చిన ధర్మపత్నిని పరుని యింట కొంతకాలం ఉండేటట్లు చేశావు. నీ మూర్తి జూచి నిన్ను క్షత్రియుడని అంటే నీకు పౌరుషం శూన్యం. తండ్రి మృతికి కారణమౌట మున్నగునవి పౌరుష చేష్టలు కావుగదా. నీ కథ సర్వమూ మోసమే.

70 కుల గురుద్వేషి నొజ్జలుగ వెన్నాడి కాచి
నిష్ఠుర మంత్రముల్ నేర్చినావు
పూర్వదేవతలు కాఁపురమున్న పురియందు
వంచించి యగ్గిఁబెట్టించినావు
తాతల తరమునఁ ద్రవ్వించినపయోధి
పేరుగాఁగొంత పూడ్పించినావు
మోసమౌటెఱుఁగక మోహించి వచ్చిన
యెలనాఁగ ముక్కుఁ గోయించినావు
బళిర! నీవంటి ధార్మికు బ్రస్తుతింపఁ
గొదువ లింకేమి? కైవల్య మెదుటవచ్చు చిత్ర...

అర్థములు:-కులగురు ద్వేషిన్ = నీకుల గురువైన వశిష్ఠునిపై పగగొన్న విశ్వామిత్రుని, ఒజ్జలుగన్ = ఆచార్యులుగా సంగీకరించి, వెన్నాడి = వెంబడించి, కాచి = రాక్షసుల వల్ల గలిగే బాధలు తొలగించి యాగమును రక్షించి, నిష్ఠుర మంత్రముల్ = కఠినములైన మంత్రములను, నేర్చినావు = అభ్యసించినావు, పూర్వదేవతలు = రాక్షసులు, కాపురము,ఉన్న = నివసించే, పురియందున్ = పురములో, వంచించి = మోసగించి, అగ్గిన్, పెట్టించినావు = అగ్ని పెట్టునట్లు చేసినావు, తాతల తరమునన్ = తాతల నాడు, త్రవ్వించిన = త్రవ్వబడిన, పయోధిన్ = సముద్రమును, కొంత = కొంచెము, పేరుగాన్ = నీ పేరుమీద, పూడ్పించినావు = రాళ్ళతో పూరించినావు, మోసము, ఔట, ఎఱుగక = వంచన అని తెలియక, మోహించి, వచ్చిన = వలచి నీచెంత చేరిన, ఎలనాగ = స్త్రీ యొక్క, ముక్కున్ = నాసికను, కోయించినావు = ఛేదింపించినావు, బళిర! = బళిరా (ప్రశంసార్థకము), నీవంటి = నీబోటి, ధార్మికున్, ప్రస్తుతింపన్ = పుణ్యాత్ముని పొగడితే, కొదవలు, ఇంకేమి = కొఱతలు ఇంకా ఏమి మిగిలి ఉంటాయి (ఉండనే ఉండవు), కైవల్యము = మోక్షము, ఎదుట వచ్చున్ = ఎదురుగా వస్తుంది సుమా!

తాత్పర్యము: నీ కులగురువైన వశిష్ఠుని ద్వేషించు విశ్వామిత్రుని గురువుగా స్వీకరించావు. వెంబడించావు. అతని యాగమును రాక్షసుల బారినుంచి కాపాడి దివ్యాస్త్రాలు మంత్రోపదేశం పొందావు. రాక్షసులు నివసించే లంకానగరమును మోసంతో హనుమంతునిచే దగ్ధంచేయించావు. నీ పూర్వికుడైన సగర చక్రవర్తి కాలమున త్రవ్వబడిన సాగరమును నీకు ప్రతిష్ఠాకరంగా కొంతమేర రాళ్లతో పూడ్పించావు. మోసమని తెలియక నిన్ను కామించి వచ్చిన శూర్పణఖ ముక్కు లక్ష్మణునిచే కోయించావు. నీ పనులన్నీ మెచ్చుకోదగనవి. నీవంటి ధర్మాత్ముని ప్రశంసించే వారికి కోరినవన్నీ ప్రసాదిస్తావు. వారికి ఏలోటూ ఉండదు. అంతేకాదు మోక్షం శ్రమించకుండానే వారికి ఎదురుగా వచ్చి స్వాగతం పలుకుతుంది సుమా!

71. శౌర్య మెక్కించి విశ్వామిత్రుఁ డూరకఁ
దొడరింపఁ దాటకఁ దునిమినావు
వైదేహి వాక్యనిర్బంధంబుఁ ద్రోయలే
కటిముటి మారీచు నటికినావు
వెనుకంజ వైచిన విడువక పైకి రా
నరుదుగా ఖరుతలఁ దరిగినావు
మొఱ్ఱో యనుచు దేవమునులు వా రెన్నాళ్లొ
యనుసరింప దశాస్యుఁ దునిమినావు
కాని రోసంబు గలదె నిక్కముగ నీకు?
మనసు మెత్తనివాఁడ వే మనఁగ వచ్చు, చిత్ర....

అర్థములు :- శౌర్యము, ఎక్కించి = పౌరుషమును అతిశయింపజేసి; ఊరక = మానక; విశ్వామిత్రుడు = విశ్వామిత్రుడు; తొడరింపన్ = పూనింపగా; తాటకన్ = తాటక అసుర క్కసిని; తునిమినావు = చంపితివి, వైదేహి = సీతాదేవి యొక్క; వాక్య నిర్బంధంబు = మా టల బలవంతము; త్రోయలేక = తిరస్కరింపలేక; అటిముటిన్ = అనాలోచితముగా; మారీచున్ =మారీచుడను రాక్షసుని; నటికినావు = వధించితివి; పైకిరాన్ = మీదికి రాగా; అరుదుగా = వింతగా; ఖరుతలన్ = ఖరుడను రాక్షసుని తలను; తటిగినావు = కోసితివి; దేవమునులు = దేవర్షులు; మొఱ్ఱో, అనుచున్ = భయముతో మొఱ్ఱో అని కుయ్యిడుచు; వారు, ఎన్నాళ్లో = వారు ఎన్నిదినముల నుండియో, అనుసరింపన్ = వెంబడింపగా; దశ + ఆస్యున్ = రావణుని; తునిమినావు = వధించితివి; కాని = అంతేకాని; నీకున్, నిక్కముగన్ = నీకు నిజముగా, రోసంబు, కలదె = కోపము కలదా? మనసు మెత్తని వాడవు = మనస్సు మృదువైన వాడవు; ఏమి + అనగవచ్చు = ఏమనిపలికేది.

తాత్పర్యము :- అధర్మ మార్గమున వర్తించు స్త్రీలను ప్రజారక్షణము నిమిత్తము రాజపుత్రుడు చంపవచ్చునని, విశ్వామిత్రుడు పురి కొల్పుటచేత తాటకను చంపినావు. సీతాదేవి పట్టుదలను నిరాకరింపజాలక, ఆలోచింపకుండ మరీచుని సంహరించినావు. యుద్ధములో నీవు కొంచెము వెనుకకు బోయినను విడువక మీదికి వచ్చు ఖరాసురుని కడతేర్చినావు. దేవర్షులు మొఱ్ఱోయని ఆర్తనాదము చేయుచు బహుకాలము వెంటాడ రావణుని వధించితివి. అంతే తప్ప నీకు, నిజముగా రోసము లేదు. నీ మనస్సు దయామయము. ఇక ఏమంటే ఏమి లాభము?

72. కొంచెపుఁ బని దాసి నించుక దండింపఁ
బగబట్టి యది యెన్నిపాట్లు వెట్టె
బలిమినిఁ బట్టి శూర్పణఖ వాసికఁ గోయ
నది నీకుఁ బిదప నెం తలఁతఁ దెచ్చెఁ
జిన్నతనంబునఁ జెనకిపోఁ దోలిన
మారీచుఁడొనరించె మాయలెన్ని
నిరపరాధిని వాలి నురుశరాహతిఁ గూల్ప
వానియిల్లా లెంత వగచి తిట్టె
స్వామి వై యేమి యెఱుఁగవు స్వల్పకార్య
కారణంబున నెన్నెన్ని కతలు పుట్టె, చిత్ర....

అర్థములు :- కొంచెము, పని, దాసి = అల్పురాలైన, పనికత్తెను (మంథరను); ఇంచుక = ఒకింత; దండింపన్ = శిక్షింపగా; పగపట్టి = ద్వేషించి; అది = ఆ దాసి; ఎన్నిపాట్లు, పెట్టెన్ = నిన్ను ఎన్ని బాధలు పెట్టినదో!; బలిమిని, పట్టి = బలాత్కారముగా పట్టుకొని; శూర్పణఖ, వాసిక, కోయన్ = శూర్పణఖ ముక్కు కోయగా; అది = ఆ; శూర్పణఖ; పిదప = ఆపై; నీకున్, ఎంత, అలతన్, తెచ్చెన్ = నీకు ఎంత శ్రమకలిగించినదో; చిన్నతనంబునన్ = బాల్యమున; చెనకి = తాకి; పోన్ తోలివన్ = వెడల గొట్టగా; మారీచుడు ఎన్ని మాయలు, ఒనరించెన్ = మారీచుడు ఎన్ని యుక్తులు చేసెనో!; నిరపరాధునిన్ వాలిన్ = తప్పు చేయనివాలిని; ఉరుశర + ఆహతిన్ = గొప్పబాణపు దెబ్బచే, కూల్పన్ = చంపగా, వాని, ఇల్లాలు = వాని భార్యయైన తార, ఎంత వగచి తిట్టెన్ = ఎంతగా దుఃఖించి తిట్టి పోసినదో!; స్వల్పకార్య కారణంబునన్ = చిన్న చిన్న పనులవల్ల; ఎన్ని, ఎన్ని, కతలు పుట్టెన్ = ఎన్నిరకాల కథలు పుట్టినవో!; స్వామివై = దేవుడవై కూడా; ఏమి, ఎఱుగవు = ఏమీ తెలిసికోవైతివి.

తాత్పర్యము :- బాల్యమున బంతియాడు వేళ తనను నీవు కాలితో తన్నుట చేత పగపట్టి కైకేయి దాసియైన మంథర కైకేయికి దుర్బోధచేసి పట్టాభిషేకమును చెడగొట్టి, నిన్ను పదునాలుగేండ్లు వనవాసమునకు పంపించెను. రావణుని చెల్లెలైన శూర్పణఖ ముక్కు చెవులు బలాత్కారముగా కోయించుటచేత అది ఆపై అన్నచే సీతాపహరణము చేయించి నీకు గొప్ప దుఃఖము కలిగించెను. విశ్వామిత్రుని యాగసంరక్షణవేళ మారీచుని వాయవ్యాస్త్రముచే దక్షిణ సముద్రమున పడగొట్టితివి. అందుకు వాడు మాయలేడియై సీతాపహరణములో రావణునకు తోడ్పడినాడు. ఏకెట్టి అపరాధమును చేయని వాలిని బాణముచే కూల్చితివి. అందుకు వాని ఇల్లాలు తార నిన్ను ఎన్ని రకములుగానో తిట్టి పోసినది. నీవు దేవుడవై ఉండియు మంథరాదుల విషయములో తొందరపడితివి. నీవు చేసినవి అల్పకార్యములే. అయితే వాటి వల్ల ఎన్ని కథలో జరిగినీకు ఎంతో దుఃఖము కలిగించినవి కదా.

73. నీపేరు వినుటకే యోపక చెవి గంట
గట్టుకొన్నాతనిఁ గావ నేమి ?
కలన నీతోఁ గత్తిఁ గట్టుక పోరాడు
వాని సోదరుని బ్రోవఁగ బనేమి ?
బాధింపఁ దగుమహాపాత కుండటు చేరి
నీవాఁడ ననగ మన్నింప నేమి ?
మాయవేసముల నీ మర్మమారయుచున్న
విమత దూతల బట్టి విడువ నేమి ?
పతిత శరణాగతావన ప్రకటదీక్ష
లోకముల కబ్బురంబుగ నీకె కలదొ ? చిత్ర....

అర్థములు :- నీపేరు = నీపేరు; వినుటకే, ఓపక = వినుటకు కూడా సహింపక; చెవిన్ = చెవికి; గంటన్, కట్టుకొన్న = గంటలను కట్టుకొనిన అతనిన్ = అతనిని; కావన్, ఏమి ? = రక్షించుట ఎందుకు ?; కత్తి కట్టుక = పగగొని; కలనన్, నీతోన్ = యుద్ధములో నీతో; పోరాడు వాని = పోరువాని; సోదరునిన్ = తమ్ముని; ప్రోవగన్, పని, ఏమి ? = కాపాడవలసిన అక్కఱయేమి ? బాధింపన్, తగు = చంపదగిన; మహాపాతకుండు = గొప్ప పాపి; అటుచేరి = ఆరీతి దగ్గఱచేరి; నీవాడను, అనగన్ = నీ భక్తుడను అనగా; మన్నింపన్, ఏమి ? = క్షమించుట ఎందుకు ?; మాయవేసములన్ = మాఱు వేషములు ధరించి; నీమర్మము = నీ రహస్యము; ఆరయుచున్న = వెదకుచున్న; విమతు దూతలన్ = శత్రువు యొక్క చారులను; పట్టి, విడువన్, ఏమి ? = పట్టుకొని విడిచిపెట్టుట ఏల ?; పతిత = పాపాత్ముల; శరణ + ఆగత = శరణుపొందిన వారి; అవన = రక్షణమునందు; ప్రకటదీక్ష = మిక్కిలి పట్టుదల; లోకములకున్ = ఎల్లలోకములకు; అబ్బురంబుగన్ = ఆశ్చ ర్యము కలిగించునదిగా; నీకె కలదో = నీకు మాత్రమే ఉన్నదా ?

తాత్పర్యము :- నీపేరు కూడ చెవిని పడకూడదని చెవులకు గంటలు కట్టుకొన్న ఘంటా కర్ణుని కాచినావు. నీతో యుద్ధమునకు సిద్ధమైన రావణుని చిన్న తమ్ముడు విభీషణునకు శరణమిచ్చినావు. చంపదగిన మహాపాపి కాకాసురుడు శరణుగోరగా అతని నేరమును మన్నించి రక్షించినావు. వానర వేషధారులై మీ సైన్యము యొక్క రహస్యములు తెలిసి కొనుటకు వచ్చిన రావణచారులు శుకసారణులను బంధించి విడిచి పుచ్చినావు. తప్పుచేసిన వారిని ఎందుకు కాపాడినావు ? శరణాగతత్రాణదీక్ష లోకములో నీకు మాత్రమే ఉన్నదా ?

74. వఱపిన శస్త్రంబె బహుముఖంబుల దైత్య
వాహినీ మర్మము వ్రచ్చి వెడల
ముందు దూసిన బాణమునకన్న సరిమించి
వెనుకమ్ము దైత్యుల విఱుగఁ బొడువ
నేసినమార్గణం బెదు రెక్కి యితరాస్త్ర
మడఁచి క్రవ్యాదుల మగుడఁ జేయ
నిగిడించిన శరంబె నిర్జరారులఁ ద్రుంచి
తొడిఁదొడిఁ దనకుఁ దా దొనకుఁ జేరఁ
దొలఁగి రసురులు కొంత నీబలిమి దెలిసె
ముష్టినీదెంత నీయస్త్రములదె వింత. చిత్ర....

అర్థములు :- వఱపిన, శస్త్రంబె = ప్రయోగించిన, ఆయుధమే; బహుముఖంబులన్ = పెక్కువిధములుగా; దైత్యవాహినీ మర్మముల్ = రాక్షస సేన యొక్క ఆయువుపట్లను; వ్రచ్చి, వెడలన్ = చీల్చి, బయటికిరాగా; ముందు, దూసిన = మొదట ప్రయోగించిన; బాణమున కన్న సరిమించి = అమ్ముకంటె మించిపోయి; వెనుక, అమ్ము = తరువాత వదలిన అమ్ము; దైత్యులన్ = రక్కసులను; విఱుగన్, పొడువన్ = పాఱిపోవునట్లుచేయగా; ఏసిన, మార్గణంబు = ప్రయోగించిన బాణము; ఎదురెక్కి = ఎదురుగాపోయి; ఇతరాస్త్రము, అడచి = ముందఱి బాణములను మించి; క్రవ్యాదులన్ = రాక్షసులను; మగుడన్, చేయన్ = వెనుకకు మఱలునట్లు చేయగా; నిగిడించిన, శరంబె = ప్రయోగించిన బాణమే; నిర్జర + అరులన్ = రాక్షసులను; త్రుంచి = చంపి; తొడితొడి = మిక్కిలి త్వరగా; తనకున్, తాన్ = స్వయముగా; దొనకున్, చేరన్ = అమ్ముల పొదిలో ప్రవేశింపగా; అసురులు = రాక్షసులు; కొంత, తొలగిరి = ఇంచుక వెనుకకు ఏగినారు; నీ బలిమి, తెలిసెన్ = నీ బలము అర్థమైనది; ముష్టి నీది + ఎంత = నీపిడికిలి ఎంత (నీ చేతిబలమెంత?); వింత = అద్భుత కార్యము; నీఅస్త్రములదె = నీఆయుధములదే;

తాత్పర్యము :- యుద్ధరంగంలో నీవు మొదట ప్రయోగించిన బాణమే రాక్షసుల మర్మస్థానాలను ఛేదించింది. తరువాత వదలిన అమ్ము దానిని మించిపోయి రాక్షసులను ఓడించింది. ఆపై ఏసిన శరము వారు వెన్నుచూపేటట్లు చేసింది. ఆపై దూసిన అమ్ము రక్కసులను ఉక్కడగించి తనకుతానే తిరిగి నీ అమ్ములపొది చేరింది. అందువల్ల రాక్షసులు యుద్ధభూమి నుండి ఇంచుక తొలగినారు. అంతేకాని, నీవెంత నీచేతి బలమెంత ? అంతా నీ అస్త్రముల మహిమ. నీవు చేసింది ఏమీలేదు సుమా!

75. అడవిలోఁ దెరువర్ల నుదుగక తినుచున్న
యాఁడుదాని వధించు టర్హ మగునె?
చిక్కినవారికిఁ జేతు లెంతయుఁ జాచు
మొండివాని వధించ ముఖ్య మగునె?
యెక్కడెక్కడనైన నేఱుక తినుకాకి
కన్ను బోఁ బొడుచుట ఘనగుణంబె?
కదు వ్రేటుఁ బడి గడ్డ కఱచిన మారీచుఁ
దఱిమి బాధించుట నెఱతనంబె?
యెవ్వరేరాజు లొనరించి రిట్టిపనులు?
చేసితివి యింక నెద్దేని సేయఁగలవు! చిత్ర....

అర్థములు :- అడవిలోన్ = అరణ్యములో; ఉడుగక = మానక; తెరువర్లన్ = బాటసారులను; తినుచున్న = భక్షించుచున్న; ఆడుదానిన్ = స్త్రీని (తాటకను) వధించుట = చంపుట; అర్హము, అగునె = తగినది యగునా?; చిక్కిన వారికిన్ = దొరకిన వారివైపు; చేతులు, ఎంతయున్, చాచు = చేతులు మిక్కిలిగా చాచు; మొండి వానిన్ = తలమెడలేని వానిని (కబంధుని); వధింపన్ = చంపుట; ముఖ్యము, అగునే? = ప్రధానమైనది అగునా? ఎక్కడ, ఎక్కడన్, ఐనన్ = ఎచ్చోటనైను; ఏఱుకతిను, కాకిన్ = ఏఱుకొని తినెడి కాకిని; కన్ను, పోన్, పొడుచుట = కన్నుపోవునట్లు బాణముతో కొట్టుట; ఘనగుణంబె? = గొప్పగుణమా?; కదువ్రేటున్, పడి = మిక్కిలి దెబ్బతిని, గడ్డకఱచిన = ఓడిపోయిన; మారీచున్ = మారీచుని; తఱిమి బాధించుట = వెంటాడి, హింసించుట; నెఱతనంబె = న్యాయమా?; ఇట్టిపనులు = ఇట్టి అకార్యములు; ఎవ్వరు, ఏరాజులు = ఏ మానవులు, ఏ రాజులు; ఒనరించిరి = చేసినారు?; చేసితివి = నీవు చేసినావు; ఇంకన్ = ఇకపై; ఎద్దేనిన్, చేయన్ కలవు = ఏ పనినైనా చేయగలవు? (ఏది + ఏనిన్).

తాత్పర్యము :- అడవిలో బాటసారులను భక్షించు స్త్రీని చంపుట నీకు తగిన పనికాదు. యోజనాయతములగు తన చేతులకు చిక్కిన ప్రాణులను భక్షించు మొండెపు రక్కసుని జంపుట గొప్పకాదు. ఎక్కడెక్కడో యేదో యేఱుకొని పొట్టపోసికొను కాకి కన్ను పోగొట్టుట ఘనకార్యము కాదు. విశ్వామిత్రుని యాగమును రక్షించు వేళ నీచే చావు దెబ్బతిన్న మారీచుని వెంటాడి హింసించుట జాణతనము కాదు. రాజులు గానీ మరెవ్వరు గానీ యిట్టి అధర్మకార్యములు చేయలేదు. నీవే చేసితివి. ఇక ముందు ఎట్టి పనియైన నీవు చేయగలవు.

76\. రాజకార్యపరుండు తేజోబలాధికుఁ
డాంజనేయుఁడు భృత్యుఁడగుట ఁజేసి
యమితశౌర్యుఁడు ప్లవంగమకులేశుఁ డినజుఁ
డఱలేని స్నేహితుఁ డగుటఁజేసి
విమతమర్మజ్ఞుండు విశ్వాసభరితాత్ముఁ
డల విభీషణుఁ డాప్తుఁడగుటఁజేసి
సుమనస్కు లమనస్కు లమృత వాక్యంబులఁ
బొసఁగ నాశీర్వదించుటను జేసి
లంక సాధించితివి గాని లావుచేత
నిర్జరారుల గెలువంగ నీతరంబె? చిత్ర...

అర్థములు: రాజకార్యపరుండు = స్వామికార్యము చేయుటయందు ఆసక్తి కలవాడు; తేజస్, బల + అధికుడు = మిక్కిలి బలపరాక్రమములు గలవాడు; ఆంజనేయుడు = హనుమంతుడు; భృత్యుడు + అగుటన్, చేసి = బంటు అగుటచేత; అమిత శౌర్యుడు = మిక్కిలి పరాక్రమము గలవాడు; ప్లవంగమకుల + ఈశుడు = వానరజాతికి ప్రభువు అయిన; ఇనజుడు = సుగ్రీవుడు; అఱలేని = భేదములేని; స్నేహితుడు + అగుటన్, చేసి = మిత్రుడు అగుటచేత; విమత, మర్మజ్ఞుడు = శత్రువుల రహస్యములు తెలిసినవాడు; విశ్వాస భరిత + ఆత్ముడు = నమ్మకముతో నిండిన మనస్సుకలిగిన; అల విభీషణుడు = ఆ విభీషణుడు; ఆప్తుడు + అగుటన్, చేసి = స్నేహితుడగుటచేత; సుమనస్కులు = దేవతలు; అమనస్కులు = యోగులు; అమృత వాక్యంబులన్ = అమృతము వంటి మాటలచేత; పొసగన్ = ఒప్పుగా; ఆశీర్వదించుటను, చేసి = దీవించుట చేత; లంక సాధించితివి = లంకను జయించితివి; కాని = అంతేకాని; లావుచేత = బలముచేత; నిర్జర + అరులన్ = రాక్షసులను; గెలువంగన్ = జయింపగా; నీ తరంబె = నీకు శక్యమా?

తాత్పర్యము: స్వామి కార్యనిర్వహణ పరాయణుడు, బలపరాక్రమశాలి అయిన ఆంజనేయుడు బంటు అగుటచేతనూ, శౌర్యవంతుడు, వానర సార్వభౌముడు అయిన సుగ్రీవుడు. భేదములేని స్నేహితుడగుట చేతనూ, శత్రు రహస్య వేత్తయూ, విశ్వాస పాత్రుడూ అయిన విభీషణుడు శ్రేయోభిలాషి యగుటచేతనూ, దేవతలు, మహర్షులు తిరుగులేని ఆశీస్సులు అందించుటచేతనూ నీవు లంకను గెలిచావు. అంతేకాని స్వబలముచేత రక్కసులను గెలుచుట నీ తరము కాదు.

77. నడువఁజాలదని జానకి నెత్తుకొని ముందు
నడచు విరాధుని నఱకు టేమి ?
చనువున వైదేహిచను బిడ్డవలె నోటఁ
బట్టినయైంద్రి కన్గొట్టు టేమి ?
సీత సంతోషింపఁ జిత్ర వేషముఁదాల్చి
తిరుగు మారీచుని నఱకు టేమి ?
తల్లినివలెఁదెచ్చి ధరణిజను నశోక
వని నిల్పు రావణుఁదునుము టేమి ?
కోప మటులేమి ? వారు మహాపరాధు
లైన ముక్తిప్రసాదార్థులగుట యేమి ? చిత్ర...

అర్థములు : నడువన్, చాలదు, అని = నడువలేదని; జానకిన్, ఎత్తుకొని = సీతనెత్తి చంకములోనుంచుకొని; ముందు నడచు = మీ ముందుగా పోవుచున్న; విరాధుని నఱకుట, ఏమి = విరాధుడు అనురాక్షసుని చంపుట ఎందుకు ?; చనువునన్ = పరిచయమువల్ల వైదేహి చనున్ = సీతాదేవి స్తనమును; బిడ్డవలెన్ = శిశువువలె; నోటన్, పట్టినన్ = నోటితో పట్టుకొనిన; ఐంద్రిన్ = మాలకాకి కంటిని; కొట్టుట, ఏమి = బాణముతో కొట్టుట, ఎందుకు; సీత, సంతోషింపన్ = జానకీదేవి సంతోషింపగా; చిత్రవేషమున్, తాల్చి = మనోజ్ఞమైన రూపముధరించి; తిరుగు = సంచరించు; మారీచునిన్ = మారీచుని; నఱకుట, ఏమి ? = చంపుట ఎందుకు; తల్లినివలెన్, తెచ్చి = మాతృభావముతో తెచ్చి; ధరణిజను = సీతాదేవిని; అశోకవనిన్ = తన అశోకవనములో; నిల్పు = ఉంచిన; రావణున్ = రావణాసురుని; తునుముట, ఏమి = చంపుట; కోపము, అటుల, ఏమి = కోపము ఆ విధముగా చూపుట ఎందుకు ?; వారు = విరాధుడు మున్నగువారు; మహా + అపరాధులు, ఐనన్ = నేరములు చేసినవారైనను; ముక్తిప్రసాద + అర్థులు + అగుట, ఏమి = మోక్షము అను అనుగ్రహమునకు పాత్రులగుట ఎట్లు ?

తాత్పర్యము : 'పాపము! నడువలేదు' అని జాలితో జానకిని చంకబెట్టుకొని నీకు అగ్రభాగమున నడచుచున్న విరాధుని చంపితివి. కన్న కుమారునివలె చనువుతో వైదేహి స్తనమును నోటితో బట్టిన కాకిని బాణముతో గొట్టినావు. సీతదేవిని సంతోషపెట్టుటకు బంగారు లేడి రూపుదాల్చి అడవిలో తిరుగుమారీచుని వధించినావు.

మాతృభావనతో జానకిదేవిని లంకకు దెచ్చి అశోకవనములో భద్రముగా నుంచిన రావణుని సంహరించితివి. అంత కోపమెందుకు ? వారు నిజముగా దోషులే అయితే వారికి ముక్తి ఎందుకు అనుగ్రహించితివి ?

78. పరరాజ్యకాంక్ష లోఁ బట్టకుండెద, నైన
సుగ్రీవునగరంబుఁ జూడరాదె ?
పరధనంబున కాస పడకయుండెద, నైన
నాలఁక నొకఱాయి యంటరాదె ?
పరయోషపై నిచ్ఛఁ బాయకుండెద, నైన
వల శూర్పణఖముక్కు నిలుపరాదె ?
పరదానవులఁ ద్రుంపఁ బంతగించెద, నైన
మూల దైత్యులఁ దోలి పుచ్చరాదె ?

దప్పపోకుండనడచిన ధార్మికుఁడవొ ॥చిత్ర॥

అర్థములు : పరరాజ్యకాం క్ష = పరుల రాజ్యముపై కోర్కె ; లోన్ = మనస్సులో ; పట్టక, ఉండెదవు = పొందనివాడవు ; ఐనన్ = పొందినట్లయితే ; సుగ్రీవునగరంబున్ = సుగ్రీవుని పట్టణమును ; చూడరాదె = దర్శించియుందువు ; పరధనంబునకున్ = పరాయివారి సంపదకు ; ఆసపడక, ఉండెదవు = ఆశింపనివాడవు ;ఐనన్ = ఆశించినట్లయితే ఆలంకన్ ; ఒకఱాయి, అంటరాదె = లంకా రాజ్యములోని ఒక శిలనైన తాకి ఉందువు ; పరయోషపైన్ = పెఱపడతిపై ; ఇచ్ఛన్ = కోరికను ; పాయక, ఉండెదవు = విడవనివాడవు ; ఐనన్ = అయితే ; అల = రావణుని చెల్లెలైన; శూర్పణఖ ముక్కు = శూర్పణఖ అనే రాక్షసి ముక్కు ; నిలుపరాదె = నిలిపియుందువు ; పరదానవులన్, త్రుంపన్ = శత్రువులైన రాక్షసులను సంహరించుటకు ; పంతగించెదవు = పట్టుపట్టెడివాడవు ; ఐనన్ = అయితే ; మూలదైత్యులన్ = ప్రధాన దానవులను ; తోలి పుచ్చరాదా = చంపి ఉందువు ; చేసిన ప్రతిజ్ఞలోన్ = చేసిన ప్రతినలో ; ఒందున్ = ఒకటియైనను ; హీనమైనన్ = మిక్కిలి కొంచెముకూడ ; తప్పు పోకుండన్ = తప్పిపోకుండ ; నడచిన = ప్రవర్తించిన ; ధార్మికుడవొ ? = ధర్మ శీలుడవా?

తాత్పర్యము : శత్రురాజ్యంపై నీకు కోర్కెలేదు. ఉంటే కిష్కింధలో అడుగుపెట్టి ఉండేవాడవు. పరుల సొమ్ముపై నీకు కాంక్ష లేదు. ఉంటే లంకలోని సంపదను గ్రహించి ఉండేవాడవు. నీకు పరకాంతలపై ఆసక్తిలేదు. ఉంటే శూర్పణఖ ముక్కు కోయించేవాడవు కాదు. రాక్షస సంహారంపై నీకు పట్టుదలలేదు. ఉంటే ప్రధాన దానవులనే చంపి ఉండేవాడవు. చేసిన ప్రతిజ్ఞలను పూర్తిగా చెల్లించుకొను ధర్మశీలుడవు నీవు.

79\. నిర్దయాత్మ్మలె కాని నిత్యాగ్నిహోత్రాది
కర్మనైష్ఠికులైన ఘనులు గారె?
శుచి శూన్యులే కాని శ్రుత్యాదిపాఠక
ప్రకట వేదార్థ బోధకులు గారె?
సత్యహీనులె కాని చంద్రశేఖర పాద
పద్మపూజానందపరులు గారె?
మాయికులే కాని మంత్రప్రయోగోప
సంహరణక్రియా చణులు గారె?
కులము బ్రహ్మణ్యమగు దైత్యకులము నెట్లు
గూల్చితివి బ్రహ్మహత్యకుఁ గొంక కహహ! చిత్ర...

అర్థములు: నిర్దయ + ఆత్మ్మలె = దయలేని మనసులు గలవారే; కాని = అంతేకాని; నిత్య + అగ్నిహోత్ర + ఆది = ప్రతిదినము హోమము చేయుట మొదలగు; కర్మ, నైష్ఠికులు + ఐన = విధ్యుక్త కర్మములు చేయుట యందు నిష్ఠ కలిగిన; ఘనులు కారె = గొప్పవారు కారా?; శుచి శూన్యులే = పవిత్రలేనివారే; కాని = అంతేకాని శ్రుతి + ఆది, పాఠక = వేదములు మున్నగు వానిని చదివించువారు; ప్రకట = ప్రసిద్ధములైన; వేద + అర్థ బోధకులు, కారె = వేదముల యొక్క శబ్దార్థములను బోధించువారు కారా?; సత్యహీనులె = సత్యము లేనివారె; కాని = అంతేకాని; చంద్రశేఖర పాదపద్మ = శివుని పద్మముల వంటి పాదములను; పూజా + ఆనంద, పరులు, కారె = సేవించుట వల్ల కలిగే సంతోషమునందు ఆసక్తి కలిగిన వారు కారా?; మాయికులే = మోసము చేయువారే; కాని = అంతేకాని; మంత్ర = మాయలను; ప్రయోగ = ఉపసంహరణ క్రియా = ఉపయోగించుట, మరలించుట అనుచేతలచే; చణులు కారె = ప్రసిద్ధులు కారా?; కులము = వంశము; బ్రహ్మణ్యము అగు = బ్రాహ్మణులకు సంబంధించినదైన; దైత్యకులమున్ = రాక్షసజాతిని; అహహ! = అధిక్షేపము; బ్రాహ్మహత్యకున్ = బ్రాహ్మణుని జంపుటకు; కొంకక = సంకోచింపక; ఎట్లు = ఏ విధముగా; కూల్చితివి = చంపినావు?

తాత్పర్యము: రాక్షసులు కఠినాత్మ్మలే. కాని నిత్యాగ్నిహోత్రులు. పవిత్రతలేని వారే కాని, వేదాది విద్యలను శిష్యులచే చదివించేవారు. వేదార్థమును బోధించే వారు. సత్యవచస్కులుకారు. కాని, శివపూజా ధురంధరులు. మోస కారులే కాని, మంత్రప్రయోగోప సంహారములందు నేర్పరులు. కులముచేత బ్రాహ్మణులైన రాక్షసులను సంకోచింపక చంపుటకు నీకు చేతులెట్లు వచ్చినవయ్యా? బ్రాహ్మణహత్య మహాపాపము కదా.

80 • ఒక్కవ్రేటునఁ గూలునో వాలి బలశాలి
చెట్టుమాటొగ్గి వేసితివి గాని
మొనసి నీల్గునెపంక్తిముఖుఁడు తన్నాభికా
మృతకుంభ మగలఁ గొట్టితివి గాని
కుంభకర్ణుఁడు రణక్షోణిలోఁ దీఱునే
తీఱని నిద్ర యెదిర్చెఁ గాని
చిక్కునే యింద్రజిత్తుక్కున సోదరుం
డశననిద్రలు మాని యడఁచెఁ గాని
తే. యింద ఱాయంబు లెఱుఁగుదు వందువలన
మడిసి రసురులు నీచేత మడియువారె?, చిత్ర.

అర్థము: చెట్టు = చెట్టు, మాటు + ఒగ్గి = చాటుగా చేసికొని, ఏసితివి = బాణముతో కొట్టితివి, కాని = అట్లుకాని పక్షమున బలశాలి, వాలి = బలము చేత గొప్పవాలి ఒక్కవ్రేటునన్ = ఒక్క దెబ్బతో, కూలునో = నేల గ్రాలునా?, పంక్తి ముఖుడు = రావణుడు, తత్, నాభికా = అతని బొడ్డు పందలి, అమృత కుంభము = అమృత భాండము, అగలన్, కొట్టితివి = పగులునట్లు బాణముతో కొట్టితివి, కాని = కానిచో, మొనసి = మార్కొని, ఈల్గునె = చచ్చునా?, కుంభకర్ణుడు = కుంభకర్ణుడు, తీఱని = ముగియని, నిద్రన్ = నిదురలో, ఎదిర్చెన్ = మార్కొనెను, కాని = కానిచో, రణక్షోణిలోన్ = యుద్ధభూమి యందు, తీఱునే = చచ్చునా?; సోదరుండు = నీ తమ్ముడైన లక్ష్మణుడు; అశన నిద్రలుమాని = తిండి, నిద్ర మానివేసి, ఉక్కునన్ = బలముతో, అడచెన్ = సంహరించెను; కాని = కానిచో; ఇంద్రజిత్తు = మేఘనాదుడు; చిక్కునే = లొంగునా?; ఇందఱ, ఆయంబులు = ఇంతమంది మర్మములు; ఎఱుగుదువు = నీ వెఱుగుదువు, అందువలనన్ = ఆ కారణమున; అసురులు = రాక్షసులు; మడిసిరి = మరణించిరి కానిచో; నీ చేతన్ = నీ చేతిలో; మడియువారె = చచ్చెడివారా?

తాత్పర్యము: చెట్టు చాటున నుండి కొట్టితివి. లేనిచో బలశాలియైన వాలినేల గూలదుకదా. నాభి స్థానమున నున్న అమృత భాండమును భేదించితివి. కానిచో రావణుడు మరణింపడుగదా. అర్థ నిద్రలో యుద్ధమునకు వచ్చుటచే కుంభకర్ణుడు చచ్చెను. లేనిచో చచ్చెడివాడు కారుగదా. పదునాల్గేండ్లు నిద్రాహారములు మాని యుండుట చేత లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తు చచ్చెను. లేనిచో అతడు పట్టుపడడు గదా. వాలి మొదలగు వారి వధోపాయములు నీవు ఎఱుగుదువు. అందువల్ల వారు నీచేత చచ్చిరి. లేనిచో వారు మరణించెడి వారుకారు సుమా. వారిని చంపుట నీ వీరత్వమునకు నిదర్శనము కాదు.

81. మొసలి పెట్టినకస్తి మొఱ్ఱఁబెట్టినహస్తి
 రక్షరించితి నన్న రమ్య మేమి?
తులువ పల్వురిలోన వలువ విప్పఁగఁ జాన
 సిగ్గుఁ గాచితి నన్నపగ్గె యేమి?
బలువు శాపము చేత బండపాఱిననాతి
 అంకుఁ బాపితి నన్న బింక మేమి?
పెద్ద మోఁదిన భీతి బెగడివచ్చిన కోఁతి
 కండఁ జేసితి నన్నయందమేమి?
తే. భవభయంబున ని న్నెంత ప్రస్తుతింపఁ
 గరుణఁ జేపట్టలేని నీఘనత యేమి?, విత్ర.

అర్థములు: మొసలి, పెట్టిన, కస్తిన్ = మొసలి కలిగించిన పీడచేత, మొఱ్ఱ, పెట్టిన = ఆర్తధ్వని చేసిన, హస్తిన్ = ఏనుగును, రక్షరించితిన్ = నేను కాపాడితిని, అన్నన్ = అని చెప్పినచో, రమ్యము, ఏమి = ప్రతిష్ఠయేనా?, తులువ = దుష్టుడు (దుశ్శాసనుడు), పల్వురిలోనన్ = పదిమందిలో, వలువ విప్పగన్ = చీర తొలగింపగా, చాన = స్త్రీ యొక్క, సిగ్గున్ = మానమును, కాచితిని, అన్నన్ = రక్షించితినని చెప్పినచో, పగ్గె, ఏమి = శక్తియా?, బలువు శాపము చేతన్ =గట్టి శాపముచేత, బండపాఱిన = ఱాయి అయిన, నాతి = స్త్రీ యొక్క అంకున్ = వ్యభిచార దోషమును, పాపితిన్ = తొలగించితిని, అన్నన్ = అని చెప్పినచో, బింకము, ఏమి = శౌర్యమా?, పెద్ద = అన్న, మోదినన్ = కొట్టగా, భీతిన్ = భయముతో, బెగడివచ్చిన = కలత నొంది పారిపోయిన, కోతికిన్ = వానరమునకు, అండన్ చేసితిన్ = ఆశ్రయమిచ్చితిని, అన్నన్ = అని చెప్పినచో, అందము, ఏమి = చక్కదనమా?, భవభయంబునన్ = జన్మ పరంపరల వెఱపుచే, నిన్నున్ఎంత = నిన్ను అధికముగా, ప్రస్తుతింపన్ = పొగడగా, కరుణన్ = దయతో, చేపట్టలేని = అభయ మివ్వలేని, నీ ఘనత, ఏమి = నీ గొప్పతనమెందుకు?

తాత్పర్యము: మొసలి బారినుండి గజేంద్రుణ్ణి విడిపించావు. నిండు సభలో అక్షయముగా చీరలు ప్రసాదించి ద్రౌపదీ దేవి మానమును రక్షించావు. ఱాయిగా మారిన అహల్యను మరల స్త్రీగా మార్చి పవిత్రను చేశావు. అన్నచే దెబ్బలు తిని పారిపోయిన సుగ్రీవునికి అండగా నిలిచావు. కాని ఇవన్నీ చెప్పుకో దగినగొప్పపనులు కావు. భవసాగరమును దాటింపుమని భక్తులు నిన్నెంత వేడుకున్నా నీవు అనుగ్రహించటం లేదు. వారికి జన్మ రాహిత్యాన్ని అనుగ్రహిస్తే అది గొప్ప.

82. నీచు వాసన చేత నీటిలో నుండుట
యెక్కువప్పులను టాయెత్తుకొనుట
కడుపాఁకటికిఁ దుంగకాయలు మెక్కుట
న్ననిని నోరు దెఱచి పెల్లరుచుచుంట
సిరి గల్గి బిచ్చ(జిప్పc జేపట్టుట
చేకత్తి పరరాజు చేతి కిడుట
పట్టణ ప్రజకుఁ జెప్పక పారిపోవుట
కలుఁద్రావి నిను నీవె తెలియకుంట
మ్రానువైయుంట గుఱ్ఱవు మనిసివంట
పుడమి నాడిక సేయక విడువనిన్ను చిత్ర...

అర్థములు: నీచు వాసనచేతన్ = చేపవాసనతో; నీటిలోన్, ఉండుట = నీళ్లలో సంచరించుట; ఎక్కువ, అప్పులను = ఎక్కువ నీళ్లలో; ఆ, ఎత్తుకొనుట = పర్వతమును మోయుట; కడుపు + ఆకటికిన్ = కడుపుమంట తీర్చుకొనుటకు; తుంగకాయలు మెక్కుట = తుంగ ముస్తెలను తినుట; అనిన్ = యుద్ధములో; నోరు తెఱచి = నోరు తెఱచి; పెల్లు + అఱచుచుంట = ఎక్కువగా బొబ్బపెట్టుట; సిరి, కల్గి = సంపద కలిగియుండి; బిచ్చము, చిప్పన్ = బిచ్చమెత్తు పాత్రను; చేపట్టుట = చేతితో పట్టికొనుట; చేకత్తి = చేతిలోని కత్తిని; పరరాజు చేతికిన్ = శత్రురాజుచేతికి; ఇడుట = ఇచ్చుట; పట్టణ ప్రజకున్ = పురప్రజలకు; చెప్పక = చెప్పకుండా; పాఱిపోవుట = వెడలిపోవుట; కలుద్రావి = కల్లు త్రాగి; నినున్, నీవె, తెలియకుంట = నిన్ను నీవే తెలిసికొనకుండుట; మ్రానువు + ఐ, ఉంట = చెట్టై ఉండుట; గుఱ్ఱము + మనిసివి + అంట = గుఱ్ఱమెక్కు మానిసి యనుట; పుడమిన్ = భూమిపై; అడిక, చేయక = రట్టుచేయక; నిన్నున్, విడువను = నిన్ను వదలిపెట్టను

తాత్పర్యము: మత్స్యావతారమెత్తి నీచువాసన వ్యాపింపగా నీళ్లలో సంచరించావు. కూర్మావతారమెత్తి రాయిని మోశావు. వరాహావతారమెత్తి క్షుద్బాధా నివారణార్థం తుంగముస్తెలను తిన్నావు. నరసింహావతారమెత్తి నోరు తెఱచి గర్జించావు. వామనావతారమెత్తి ధనికుడై ఉండీ బలిచక్రవర్తిని యాచించావు. పరశురామావతారమెత్తి చేతిలోని వింటిని రాముని చేతిని ఇచ్చావు. రామావతారమెత్తి అయోధ్యా పురజనులకు చెప్పకుండా అడవికి వెళ్లినావు. బలరామావతారమెత్తి స్మృతి తప్పేటట్లు సురాపానం చేసినావు. బుద్ధావతారమెత్తి జడత్వమును ప్రకటించావు. కల్కి అవతారమెత్తి అశ్వమును ఎక్కుతావట. ఇటువంటి అకార్యములు చేసిన నిన్ను అల్లరిచేయక నేను వదలి పెట్టను సుమా!

83 ఖరునాజిలోఁ జొచ్చి శరముచ్చిపోనేయ
వెనుకకు లంఘించి వెఱచె ననిరి
యని బాఱునో కోఁతి యని భ్రమానిమాటున
నేయ వాలినిఁ బొంచి యేసె ననిరి
గరుడధ్వజుండన్న గుఱుతుఁ దెల్పుటకున్న
బలభీతి శస్త్రాహిబద్ధుఁడనిరి
బలినిఁజంపఁగ రానివరమున యాచింప
వృత్తినాతని భిక్షమెత్తెననిరి
యశ మదెంతొ ప్రయాసలభ్యంబె కాని
యెంతలో వచ్చునపకీర్తి యెఱుఁగ వేమి? ॥ చిత్ర ॥

అర్థములు: ఆజిలోన్ = యుద్ధములో; చొచ్చి = ప్రవేశించి; ఖరున్ = ఖరుడనే రాక్షసుని; ఉచ్చిపోన్ = చీల్చునట్లుగా; శరము = బాణమును; ఏయన్ = ప్రయోగించుటకు, వెనుకకు లంఘింపన్ = వెనుకకు పరువెత్తగా; వెఱచెన్, అనిరి = భయపడెనని అన్నారు; కోతి = వానరుడు; అనిన్ = యుద్ధము నుండి; పాఱునో = పరువిడునేమో; అని = అని సందేహించి; భ్రమాని మాటునన్ = చెట్టుచాటు నుండి; ఏయన్ = బాణము ప్రయోగింపగా; పొంచి = దాగియుండి; వాలినిన్ = వాలిని; ఏసెన్, అనిరి = బాణముతో కొట్టెనని అన్నారు. గరుడ ధ్వజుండు, అన్న = గరుడ వాహనుడు అనే, గుఱుతున్, తెల్పుటకున్ = చిహ్నమును వెల్లడి చేయుటకు; ఉన్న = కట్టుబడి ఉండగా; బలభీతిన్ = బలము వలని వెఱపుచే; శస్త్ర + అహిబద్ధుడు, అనిరి = అస్త్ర రూపమైన సర్పములకు కట్టు పడ్డాడు అని అన్నారు; చంపగరాని = చంపుటకు శక్యముగాని; వరమున్ = వరము వల్ల; బలిన్ = బలి చక్రవర్తిని; యాచింపన్ = వేడగా; అతనిన్ = ఆ బలిని; వృత్తిన్ = బ్రదుకు తెరువు కోసం; భిక్షము, ఎత్తెన్ అనిరి = యాచించెను అనిరి; యశము అది = కీర్తియేమో, ఎంతొ = మిక్కిలి; ప్రయాస లభ్యంబె = శ్రమచేతనే సంపాదింపదగినది; కాని = మఱి; అపకీర్తి = చెడ్డపేరు; ఎంతలో వచ్చున్ = ఎంత సేపటిలో వస్తుందో; ఎఱుగవు, ఏమి = తెలుసుకొనవేమిటి?

తాత్పర్యము: రణరంగంలో ఖరుని ఱొమ్ము చీల్చుటకు బాణము వేయటానికి వీలు కల్గుటకు కొంచెము వెనుకకు పోగా భయపడ్డావనీ; ఎదురుగా నిలబడి యుద్ధం చేస్తే తాళలేక వాలి పారిపోవునేమోయని శంకించి చెట్టు చాటున నుండి కొట్టగా, దొంగ చాటుగా కొట్టావనీ, గరుడ ధ్వజత్వం ప్రకటించటానికి ఇంద్రజిత్తు నాగాస్త్రానికి కట్టుబడినట్లు నటిస్తే నిజంగానే కట్టుపడినావనీ, అవధ్యుడైన బలి చక్రవర్తిని అణగద్రొక్కటానికి మరో దారి లేక యాచిస్తే యాచన నీ వృత్తి ధర్మమనీ అంటున్నారు. కీర్తి గడించటం చాలా కష్టం. ఇక అపకీర్తి ఆర్జించటానికి క్షణం కూడా పట్టదు. ఈ మాత్రమైనా తెలుసు కోలేవేమిటయ్యా స్వామీ నీవు?

84. ఘోర కబంధు దీర్ఘోరుదోర్దండముల్
దఱిగి వచ్చినమాట తథ్యమేని
పంక్తి కంఠాత్మజఫణి రాజబంధమో
చనుఁడవై వచ్చుట సత్యమేని
మైరావణాభేద్య కారాగృహముఁ గూల్చి
బ్రదికి వచ్చినవల్కు భద్రమేని
మారీచదుస్తర మాయాభ్రమతఁ బాసి
విజయమొందిన సుద్ది నిజమయేని
కలిత రాజోపచార భోగములఁ గీర్తి
శాలివై యిందు మెఱయుట సాక్షి జగతి, చిత్ర...

**అర్థములు :** ఘోర = భయంకరమైన; కబంధ = కబంధుడను రాక్షసుని యొక్క; దీర్ఘ = పొడవైన; ఉరు = పెద్దవైన; దోర్దండముల్ = కఱ్ఱలవంటి బాహువులను; తఱిగి వచ్చినమాట = నఱికిన కథ; తథ్యము, ఏని = నిజమైతే; పంక్తికంఠ + ఆత్మజ = రావణుని కొడుకైన ఇంద్రజిత్తు ఫణిరాజబంధ = నాగరాజుల కట్టునుండి; మోచనుడవై = విడుపు పొందిన వృత్తాంతము; సత్యము + ఏని = వాస్తవమైతే; మైరావణ = మైరావణ రాక్షసుని యొక్క; అభేద్య = భేదింపశక్యముగాని; కారాగృహము = చెఱసాల; కూల్చి = ధ్వంసము చేసి; బ్రదికి వచ్చిన పల్కు = బ్రదికి బైటపడిన ఉదంతము; భద్రము + ఏని = నిక్కమైతే; మారీచు = మారీచ రాక్షసుడు పన్నిన; దుస్తర = దాటరాని; మాయా భ్రమతన్ = మోసము వల్ల కల్గిన భ్రాంతిని; పాసి = తప్పుకొని; విజయము, ఒందిన, సుద్ది = గెలుపు పొందిన విషయము; నిజమయేని = సత్యమేని; జగతిన్ = భూమిపై; కలిత = చేయబడిన; రాజ + ఉపచార భోగములన్ = రాజ సేవలవంటి సేవలు, రాజ భోగములవంటి భోగములు పొందుచు; కీర్తి శాలివై = కీర్తిచే ఒప్పువాడవై; ఇందున్, మెఱయుట = ఈ క్షేత్రములో ప్రకాశించుట; సాక్షి = సాక్షియగును.

**తాత్పర్యము :** కబంధ రాక్షసుని యోజన దీర్ఘములైన బాహువులను నీవు బంధించిన కథ, ఇంద్రజిత్తు కల్పించిన నాగబంధము నుండి బైటపడిన కథ, మైరావణుని అభేద్యమైన చెఱసాల నుండి తప్పించుకొన్న కథ, మారీచుని మాయాజాలమును గ్రహించి వానిని చంపిన కథ నిజమైతే - రాజోపచారాలు, రాజభోగాలు పునరుద్ధరించుకొని, ఈ క్షేత్రంలో ఒప్పినట్లయితే నీ కథలకు సాక్షీ భూతమవుతుంది. లేకపోతే నీ కథలకు సాక్ష్యమేమీ ఉండదు.

85. నీ శాంతి యంభోధినిర్భరాంబువులు బా
ణముఖంబునకుఁ దెచ్చునాఁడె తెలిసె
నీ కోప మరి రావణైకానుజన్మ నా
నగరి రాజుఁగఁ జేయునాఁడె తెలిసె
నీ కీర్తి కపటదుర్నీతుఁడౌ ధ్వాంక్షదా
నవుతప్పుఁ గాచిననాఁ తెలిసె
నీ యభిజ్ఞత యవినిందిత నీ తన్వి
నగ్నిఁజొరుమన్నయపుడె తెలిసె
నెంచరాని గుణాఢ్యుఁడ వీవెయనుచుఁ
దెలిసి మ్రొక్కెద నితరమే దిక్కులేక, చిత్ర...

అర్థములు : అంభోధి = సముద్రమునందు; నిర్భర + అంబువులు = అధికమైన నీళ్లను; బాణముఖంబునకున్ = బాణము యొక్క కొనకు; తెచ్చునాడె = తెచ్చినప్పుడే; నీ శాంతి = నీ యొక్క కామక్రోధాదుల గెలుపు; తెలిసెన్ = తెలిసినది కదా; అరి = శత్రువైన; రావణ + ఏక + అనుజన్మన్ = రావణాసురుని ఒక తమ్ముణ్ణి; ఆ నగరి రాజుగన్ = ఆ లంకా నగరమునకు ఏలికగా; చేయునాడే, తెలిసెన్ = చేసినప్పుడే తెలిసినది కదా; కపట దుర్నీతుడౌ = మోసముతో గూడిన చెడ్డనీతి కలిగిన; ధ్వాంక్ష దానవు తప్పున్ = కాకాసురుని యొక్క నేరమును; కాచిన నాడె - క్షమించినప్పుడే; నీ కీర్తి = నీ ఖ్యాతి; తెలిసెన్ - తెలిసినది కదా; అవినిందితన్ = దోషములేని; నీతన్విని = నీ భార్యను; అగ్నిని, చొరుము = అగ్నిలో ప్రవేశింపుము; అన్న యపుడె = అని పలికినప్పుడే; నీ అభిజ్ఞత = నీ యొక్క వివేకము; తెలిసెన్ = తెలిసినది కదా; ఇతరము, ఏ దిక్కులేక = మరొకగతి యేదీ లేకపోవుట చేత; ఎంచరాని = మెచ్చరాని; గుణ + ఆఢ్యుడవు = గుణములు కలవాడవు; ఈవె, అనుచున్, తెలిసి = నీవే అని తెలిసికొని; మ్రొక్కెదన్ = నమస్కరించెదను.

తాత్పర్యము : నీవు బాణాగ్రముచేత సముద్ర జలములను ఇంకించినప్పుడే నీ శాంత స్వభావము తెలిసినది. శత్రువైన రావణుని తమ్ముడు విభీషణుని లంకానగరమునకు రాజుగా చేసినప్పుడే నీ కోపమెట్టిదో తెలిసినది. వంచకుడైన కాకాసురుడు చేసిన అపరాధమును మన్నించినప్పుడే నీ కీర్తి తెలిసినది. దోష రహితయైన ధర్మపత్నిని అగ్నిజొరుమన్నప్పుడే నీ విజ్ఞత తెలిసినది. నీ గుణములు పొగడరానివని తెలిసియు, మరో దిక్కులేక నీకు నమస్కరించుచున్నాను.

86. జనకువాక్యమున రాజ్యవిసర్జనమె కాని
యడరు శౌర్య మొకింత విడిచినావె?
దీక్ష నాభరణము ల్దివియు మాత్రమె కాని
వర ధనుర్బాణము ల్వదలినావె?
వ్రత మని కాంచనాంబరముఁ గట్టవు గాని
బిగువు వజ్రాంగి మై విడిచినావె?
ప్రతినఁ బదార్థమే మితర మొల్లవు గాని
యభిమానధనముపై నలిగినావె?
నిఖిలరక్షోవిదారణ నిర్భయైక
వేషధారివి నీ ముని వృత్తియేమి? చిత్ర....

అర్థములు :- జనకు వాక్యమువన్ = తండ్రి మాటచేత; రాజ్య విసర్జనమె కాని = రాజ్యమును విడిచినావు, కాని; అడరు = అతిశయించు; శౌర్యమున్ = పరాక్రమము; ఒకింత = కొంచెమైనను; విడిచినావె = విడిచిపెట్టినావె ?; దీక్షన్ = నియమమువల్ల; ఆభరణముల్ = నగలు; తివియు మాత్రమెకాని = తీసివేసినావు, అంతేకాని; వర, ధనుర్బాణముల్ = మేటివిల్లును, అమ్ములను; వదలినావె = విడిచిపెట్టినావె; ప్రతినన్ = ప్రతిజ్ఞచేసి; ఇతరము = మఱియొక; పదార్థము, ఏమి = వస్తువేదీ; ఒల్లవు కాని = ఇచ్చగింపవు కాని; అభిమాన ధనముపైన్ = ఆత్మగౌరవము అనునవదపై; అలిగినావె = కోపించినావా ?; వ్రతము, అని = ప్రతిజ్ఞ అని; కాంచన + అంబరము = బంగారు వలువ; కట్టవు, కాని = ధరింపవు కాని; బిగువు = గట్టిదైన; వజ్రాంగిన్ = వజ్రమయ కవచమును; మైన్ = మేనునుండి; విడిచినావె = విప్పివేసినావా ?; నిఖిల = సమస్తమైన; రక్షోవిదారణ = రక్కసులను చీల్చుట అనే; నిర్భయ + ఏక = భయములేని ముఖ్యమైన; వేషధారివి = వేసమును తాల్చినావు; నీ మునివృత్తి, ఏమి ? = నీ మునిజీవనము ఎటువంటిది ?

తాత్పర్యము :- తండ్రి యానతిచేత రాజ్యమును త్యజించినావు కాని నీవు శౌర్యమును త్యజింపలేదు కదా ? నియమానుసారముగా ఆభరణములు తీసివేసినావు కాని ధనుర్బాణములను విడిచిపెట్టలేదు కదా ? ప్రతిజ్ఞకు అనుగుణముగా కనక చేలము కట్టలేదు కాని వజ్రకవచమును తొలగించలేదు కదా. శపథాను సారం, మరే వస్తువును ఆదరింపలేదు కాని ఆత్మగౌరవమును విడువలేదుకదా. రాక్షస జాతి సంహారము కోసం కపట వేషం ధరించావు. అంతేకాని నీదిముని వృత్తి ఎంతమాత్రం కాదునుమా.

87. వెఱపింపఁగలవా చేవిలు నీ కొసంగి తా
విగతరోషుండైన విప్రవరునిఁ
గట్టింపఁ గలవా సాగరముపై సేతువు
మలలఁ గోఁతులమూఁక లలరఁ బట్టి
ఘనత నీఁ గలవా యన్నను గొట్టి తమ్మున
కారాజ్య మాచంద్ర తారకముగ
వేంచేయఁ గలవా విన్వీథిఁ దేరఁగ నున్న
పుష్పకం బెక్కి నీపురికి మరల
తే. జగతి నిటు సంతతోత్సాహచరణమునకు
యుక్తిసేయుదు వోహో నీశక్తి దెలిసె, విత్ర.

అర్థములు: చేవిలున్ = తనచేత నున్న ధనుస్సును; నీకున్, ఒసంగి = నీ చేతికి ఇచ్చి తాన్ = తాను, విగత రోషుండు, ఐన = పోయిన కోపము కలిగిన విప్రవరునిన్ = బ్రాహ్మణ శ్రేష్ఠుని, వెఱపింపన్, గలవా = భయపెట్టగలవా?, కోతుల మూకలు = వానర సమూహములు, అలరన్, పట్టి = విధేయులగుటచేత గాక, సాగరముపైన్ = మున్నీటి మీద మలలన్ = కొండలలో, సేతువున్ = వంతెన, కట్టింపన్ కలవా = నిర్మింప జేయజాలుదువా?, అన్నను, కొట్టి = అగ్రజుని వధించి, తమ్మునకున్ = తమ్మునకు, ఆ రాజ్యము = ఆ వానర రాజ్యము, ఆ చంద్ర తారకముగన్ = చంద్రుడు, చుక్కలు ఉండే వరకు స్థిరంగా ఉండేటట్టు, ఘనతన్ = గొప్పతనములో, ఈన్, కలవా = ఈగలవా?, తేరగన్, ఉన్న = అనాయాసంగా వచ్చిన, పుష్పకంబు, ఎక్కి = ఆకాశమార్గంగుండా, నీ పురికిన్ = నీ నగరమునకు, మరలన్ = మళ్లీ వేంచేయన్, కలవా = పోగలవా?, జగతిన్ = లోకంలో, ఇటు = ఈ విధంగా, సంతత, ఉత్సాహ, చరణమునకున్ = ఎల్లప్పుడు ప్రయత్నాలు చేయుటకు, ఓహో = బళీ, నీశక్తి = నీ ఉత్సాహ శక్తి తెలిసెన్ = అర్థమైనది సుమా.

తాత్పర్యము: తనచేత నున్న వైష్ణవ ధనుస్సును నీ చేతికిచ్చి నిస్తేజస్కుడటచేత పరశురాముని నీవు జయింపజాలివావు. వానరసేన వశమగుట చేత గిరులతో వారధి కట్టింపగలిగావు. అన్నయైన వాలిని చెట్టుచాటు నుండి వధించుటచేత తమ్ముడైన సుగ్రీవునకు శాశ్వతంగా కిష్కింధా రాజ్యమును కట్టబెట్ట గలిగావు. తేరగా పుష్పక విమానం లభించుటచేత మళ్ళీ ఆ యోధ్యను చేరగలిగావు. ఈ విధంగా ఎప్పుడూయుక్తితో ఉత్సాహ శక్తితో కార్యములు సాధిస్తావు.

88\. ని న్నెదుర్కొనన రాని నెపమునఁ గోపించి
కోపిత హితు సూతుఁ గొట్టవలెనె?
సంబంధినోటఁ గొంచెపుమాట రా వాసి
కరిపురం బలుకఁ బెకల్పవలెనె?
నిను జూచి వేడ్క నొందిన గర్వముగ నెంచి
నిండి పాఱెడు నేఱు నిలుపవలెనె?
చెలికానివలె నొద్దఁ జేరి యెత్తుకొనంగఁ
గినుకఁ బ్రలంబునిఁ దునుమవలెనె?
ఎంతరోసంబు గలవాఁడ వేమి నీవు
తెలివి కాదవె బలరామ! తెలిసె నిందు, చిత్ర...

**అర్థములు:-** నిన్ను + ఎదుర్కొనన్ = నిన్ను ఎదురుకొనుటకు; రాని నెపమునన్ = రా నట్టి మిషచేత; కోపించి = కోపగించి; కోపిత = కోపగాడా!; హితున్ = మిత్రుడైన; సూతున్ = సూత మహర్షిని; కొట్టవలెనె = చంపుట తగునా?; సంబంధినోటన్ = వియ్యం కుని నోటినుండి; కొంచెము + మాట, రాన్ = అగౌరవపు మాటలు వెలువడగా; కరిపురంబు = హస్తినాపురమును; అలుకన్ = కోపముతో; పెకల్పవలెనె = పెల్లగించుట న్యాయ్యమా?; నినున్, చూచి = నిన్నుకాంచి; వేడ్కన్, ఒందిన = సంతోషించిన; గర్వముగన్ = మదముగా; ఎంచి = భావించి; నిండి పాఱెడు, ఏఱున్ = నిండుగా ప్రవహించునదిని, నిలువవలెనె = అడ్డగించుట ధర్మమా?; చెలికాని వలెన్ = స్నేహితుని విధమున; ఒద్దన్, చేరి = చెంతకు చేరి; ఎత్తుకొనంగన్ = భుజమున కెత్తుకొనగా; కినుకన్ = కోపముతో; ప్రలంబుని = ప్రలంబుడు అనురక్కసుని; తునుమవలెనె = సంహరిం చుట యుక్తమా?; బలరామ! = బలరాముడా; తెలివి కాదవె = వివేకము గలవాడవే; ఇందున్ = ఈ విషయములలో; తెలిసెన్ = మాకు అర్థమైనది; నీవు ఎంతరోషంబు కలవాడవు, ఏమి = నీవు ఎంతటి రోసము గలవాడవోమరి.

**తాత్పర్యము:-** నీకు ఎదురుగా వచ్చి గౌరవింపలేదని కోపముతో సూతమౌనిని కుశాగ్రమున కొట్టి చంపినావు. దుర్యోధనుని నోట అగౌరవ వచనములు వెలువడగానే చుట్టమని తలపకుండ, అతని రాజధానియైన హస్తినాపురమును గంగలో ద్రోయపెల్లగింప బూనితివి. నిన్ను గాంచి యమునా నది పొంగుట చూచి, అది గర్వముగ పొరపడి నిరోధించితివి. నిన్ను భుజముపై ఎత్తుకొని మోయు ప్రలంబాసురుని చెలిమినెంచక సంహరించితివి. బలరామమూర్తీ! నీవు ఎంతరోసగాడవో. నీవు యుక్తా యుక్తవివేచన కలవాడవని ఈ విషయమున మాకు స్పష్టమైనది సుమా!

89 పరపురుషాకృతి గుఱుతుగాఁజూడక
త్రిపుర పతివ్రతా తిలకములను
విటపయుక్తి భ్రమించి విఫలభ్రమతఁ జేసి
తత్సతీపతుల దుర్దాంతబలుల
హతము సేయించితివల మహానటునిచే
రథరథాంగాశ్వ సారథి శరాది
గుణనిషంగాస్త్రములు కోరినట్లుండునే
సమకూర్చి యసురుల సంహరించి
సాహసుఁడ వైతి విన్నుంచి శంకరుండు
త్రిపుర సంహరుఁడను నాఖ్యఁదెచ్చుకొనియె ॥ చిత్ర ॥

అర్థములు: పరపురుషాకృతి = పరాయి పురుషుల రూపమును; గుఱుతుగాన్ = సరిగా; చూడని = చూడనటువంటి; త్రిపుర = త్రిపురాసురుల; పతివ్రతా తిలకములను = సాధ్వీమణులైన భార్యలను; విటప = విటరాయని; యుక్తిన్ = ఉపాయముతో; భ్రమించి = భ్రమపడి; విఫల, భ్రమతన్ చేసి = వ్యర్థమైన ప్రయత్నము చేత; తత్, సతీ, పతులన్ = ఆసాధ్వీరత్నముల మగలను; అల = సర్వేశ్వరుడైన; మహానటునిచేన్ = శివుని చేత; హతము చేయించితివి = చంపించితివి; రథ = రథము; రథాంగ (రథ + అంగ) = చక్రము; అశ్వ = గుఱ్ఱములు; సారథి = తేరుగడపువాడు; శర = బాణము; ఆది = మొదలైనవి; గుణ వింటినారి, నిషంగ = అమ్ములపొది, అస్త్రముల్ = ఆయుధములు; కోరిన, అట్లు, ఉండునే = కోరిన విధముగ లభింపవుకదా; సమకూర్చి = రథము మొదలగు వానివి సిద్ధము చేసి; అసురులన్, సంహరించి = త్రిపుర రాక్షసులను చంపి; సాహసుడవు ఐతి = తెగింపు గల వాడవైతివి; నిన్నుంచి = నీవు కారణముగా; శంకరుండు = శివుడు; త్రిపుర సంహరుడను = త్రిపురధ్వంసి అనే; ఆఖ్యన్ = పేరును; తెచ్చుకొనియెన్ = సంపాదించెను.

తాత్పర్యము: త్రిపురాసుల భార్యలు పరపురుషులను కన్నెత్తి కూడా చూడని మహాపతివ్రతలు. వారి శీలాన్ని అపహరించటానికి బుద్ధావతారమెత్తి విటునివలె ప్రయత్నించావు. కాని విఫల మనోరథుడవై పగబూని, కోరిన సాధనాలను సమకూర్చి శివునిచే వారి మగలను చంపించావు. చివరకు త్రిపురాంతకుడనే బిరుదు ముక్కంటికి దక్కింది. దానికి కారణం నీవే కదా స్వామి.

90. సకలవర్ణంబులు సంకరంబులు జేసి
యఖిల ధర్మములు శూన్యములు సేసి
భూతలంబును బాపభూయిష్ఠముగఁ సేసి
పరగఁబ్రపంచంబు భ్రష్టు సేసి
కలి విజృంభించిన కడపటనా నీవు
తురగవాహనుఁడ వై దోర్విరాజి
ఖడ్గచంచద్ధారఁ గలుషాత్ముల వధించి
శిష్టసంరక్షణ సేయు టెల్ల
ననిశము చరాచరాది జీవావనైక
జాగరూకుండవా నీవు? జాగు దెలిసె, చిత్ర....

అర్థములు :- సకలవర్ణంబులు = సమస్తకులములు; సంకరంబులు, చేసి = పరస్పరము కలిసిపోవునట్లుగా చేసి; అఖిలధర్మములు = సమస్త వైదిక ధర్మాలు; శూన్యములు చేసి = ధ్వంసం చేసి; భూతలంబును = భూమిని; పాపభూయిష్ఠముగ = పాపము చేత అధికమైనదిగా చేసి; చేసి = చేసి; ప్రపంచంబున్ = లోకమును; పరగన్ = మిక్కిలి; భ్రష్టుచేసి = పాడుచేసి; కలి = కలియుగము; విజృంభించిన = చెలరేగిన; కడపటనా = చివరనా; నీవు = నీవు; తురగవాహనుడవై = గుఱ్ఱము వాహనముగా గలవాడవై; దోర్, విరాజి = భుజమున ప్రకాశించు; ఖడ్గ, చంచత్, ధారన్ = కత్తియొక్క ప్రకాశించు అంచుతో; కలుష+ ఆత్మలన్ = పాపాత్ములను; వధించి = చంపి; శిష్టసంరక్షణ చేయుట = మంచివారిని కాపాడుట; ఎల్లన్ = అంతా; నీవు = నీవు; అనిశము = ఎల్లప్పుడు; చర + అచర + ఆది = చరములు, అచరములు మొదలైన; జీవ + అవన + ఏక = జీవులను రక్షించుట యందు ముఖ్యముగా; జాగరూకుండవా = మేల్కొని యుండువాడవా?; జాగు = నీ ఆలస్యము; తెలిసెన్ = మాకు తెలిసినది.

తాత్పర్యము :-వర్ణసాంకర్యంచేసి, సమస్త వేద ధర్మాలనూ ధ్వంసంచేసి, భూమిని పాపముతో నింపి పాడుచేసి కలియుగం విజృంభించిన వేళ యుగాంతంలో నీవు గుఱ్ఱమెక్కి కత్తిచేత బట్టి దుష్టులను వధించి శిష్టులను రక్షిస్తావా? రేవగలు చరాచర జీవకోటిని జాగ్రత్తగా రక్షించుట అంటే ఇదేనా? నీ కాలయాపన మునకు కారణం మాకు తెలిసినదిలే వయ్యా!

91. భువనమోహన కృష్ణమూర్తివి నీ వేని
ఆలీల లిచ్చట నాడవలదె?
బలసముజ్జ్వల కామపాలుఁడ వీ వేని
దీపించి యాబల్మిఁ జూపవలదె?
వీర నృసింహావతారుఁడ వీ వేనిఁ
దత్తేజ మిం తైనఁ దాల్పవలదె
సత్యవిక్రమ రామచంద్రుఁడ వీ వేని
యాపౌరుష మొకింత చూపవలదె?
యెంచ దేవర దైవమో యీవె కాని
చూపఱకు నీదుమహిమను జూపవలదె?

అర్థములు :- భువనమోహన = లోకములను వలపించు; కృష్ణమూర్తివి నీవు + ఏని = కృష్ణుడవు నీవే అయినట్లయితే; ఆలీలలు = ఆ కృష్ణలీలలు; ఇచ్చటన్ = ఈక్షేత్రములో ఆడవలదె = చూపవలెను కదా; బలసముజ్జ్వల = బలముతో ఒప్పు; కామపాలుడవు, ఈవు + ఏని = బలరాముడవు నీవే అయితే; దీపించి = ప్రకాశించి; ఆ బల్మిన్ = ఆ బలరాముని బలిమిని చూపవలదె = చూపవలయును కదా; వీరనృసింహ + అవతారుడవు = వీరుడైన నరసింహమూర్తివి; ఈవు + ఏని = నీవే అయినట్లయితే; తత్, తేజము = ఆ పరాక్రమము; ఇంతైనన్ = కొంచెమైన; తాల్పవలదె = ధరింపవలెను కదా; సత్య విక్రమ = నిజమైన శౌర్యముకల; రామచంద్రుడవు = రాముడవు; ఈవు + ఏని = నీవే అయినట్లయితే; ఆపౌరుషము = ఆ రాముని శౌర్యమును; ఒకింత = కొంచెము; చూపవలదె = ప్రదర్శింపవలయును కదా!; ఎంచన్ = తలపగా; దేవర, దైవమో = ప్రభువు, దేవుడో, ఈవె కాని = నీవె అగుదువు గాక; చూపఱకు = చూచువారికి; నీదు మహిమలు = గొప్పతనము; చూపవలదె = చూపవద్దా?;

తాత్పర్యము :- నీవు కృష్ణుడవే అయితే, ఆలీలలు ఈక్షేత్రంలో చూపాలి. బలరాముడవే అయితే ఆ బలము చూపాలి. నరసింహుడవే అయితే ఆ పరాక్రమము చూపాలి. శ్రీరామచంద్రుడవైతే ఆ పౌరుషం చూపాలి. నీవు నిజంగా దేవుడవే అయితే ప్రజలకు నీమహిమ చూపించాలి.

92. ఆలగాఁపరివాఁడ వనక నిన్నఖిలవే
దాంత మార్గవిహారి వందునేమి?
హలముఁ బట్టినవాఁడ వనకనిన్ బహువిధా
జాండ నిర్వాహుఁడ వందునేమి?
యల్లసారథివాఁడ వనక నిన్ను సమస్త
శాస్త్ర ప్రపూర్ణుఁడ వందునేమి?
యడవిఁ ద్రిమ్మరువాఁడ వనక నిన్ సకలలో
కాపన్నివారుఁడ వందునేమి?
పుడమి నీదగు కొంచెపు నడత లెంచ
కభినుతింతునె లోకైక విభుఁడ వనుచు, చిత్ర...

అర్థములు: ఆలకాపరివాడవు = గోవులను కాయువాడవు; అనక = అనకుండ; నిన్నున్ = నిన్ను; అఖిల = సమస్తమైన; వేద + అంత, మార్గ = ఉపనిషత్తువీథులలో; విహారివి = తిరుగువాడవు అని; అందున్, ఏమి = చెప్పుదునా యేమిటి?; హలమున్ పట్టినవాడవు = నాగలిచేత బట్టిన కృషీవలుడవు; అనక = అనకుండ; నిన్ = నిన్ను; బహువిధ + అజాండ = రకరకాల బ్రహ్మాండముల యొక్క; నిర్వాహుడవు = పోషించువాడవు అని; అందున్, ఏమి = పలుకుదునా యేమి?; అల్ల = సుప్రసిద్ధుడైన; సారథివాడవు = రథము నడువు వాడవు; అనక = అనకుండ; సమస్త శాస్త్ర = సర్వ శాస్త్రములందు; ప్రపూర్ణుడవు = మంచినేర్పు గలవాడవు అని; అందున్, ఏమి = చాటెదనా యేమి?; అడవిన్ = అడవిలో; త్రిమ్మరు వాడవు = తిరుగువాడు అని; అనన్ = అనకుండ; నిన్ = నిన్ను; సకలలోక = సమస్తలోక ముల యొక్క; ఆపత్, నివారుడవు = కష్టములను తొలగించువాడవు అని; అందున్ ఏమి = పొగడదునా యేమి?; పుడమిన్ = భూమిపై; నీదగు = నీ యొక్క; కొంచెము + నడతలు = హీనములైన నడవడులు; ఎంచక = ఆక్షేపించకుండ; లోక + ఏక విభుడవు = లోకములకు ఒకే రాజవు; అనుచున్ = అని; అభినుతింతునె = కీర్తింతునా?

తాత్పర్యము: నీవు ఆలకాపరివని అంటాను; వేదాంతములలో వర్ణింపబడ్డావని పొగడను. నాగలి పట్టిన కర్షకుడవని అంటాను; అఖిలాండ కోటి బ్రహ్మాండ కోటిని భరించే వాడవని కీర్తింపను. రథసారథివని అంటాను, సకల శాస్త్రపారంగతుడవని నుతింపను. వన సంచారివని అంటాను, లోకుల కష్టాలు తొలగించే వాడవని కొనియాడను. ఈ విధంగా నీవు చేసిన గౌరవ హీనములైన పనులను విరసిస్తాను. అంతేకాని జగదేక నాయకుడవని స్తుతింపను.

93 మామ యింటికిఁ బోవమంచి తీర్థము పుట్ట
దతఁడంత కారువాఁ డతడె సుమ్మీ
పుసుక కంచము తోలుపుట్టంబు గల మిత్రుఁ
డెందు నన్నముఁబెట్టు నేమి గప్పు?
మాటమాత్రం బైనమగువ నోరాఁపదు
కొడుకుపెట్టునె తలకొట్లమారి
యన్నది మేషాండమున్న దిచ్చేదొక్క
తొట్టిగొడ్డది నీకుఁ దోలునేమి?
ఎవ్వరింటికి బోయిన నేమి ఫలము
ఉన్నచో నుండి సిరుల బెంపొందుమయ్య ॥ చిత్ర॥

అర్థము: మామ, ఇంటికిన్ = మామగారి యింటికి; పోవన్ = వెళ్ళగా; మంచి తీర్థము = మంచినీరు; పుట్టదు = దొరకదు, అతడంత = అతనితో సమానుడైన, కారువాడు = ఉప్పని వాడు; అతడె సుమ్మీ = అతడే సుమా; పుసుక కంచము = పుఱ్ఱియే భోజన పాత్రముగా; తోలు పుట్టంబు = తోలే వలువగా; కల = కలవాడు; మిత్రుడు = నీకు స్నేహితుడు; ఎందున్, అన్నమున్, పెట్టున్ = ఏ పాత్రలో కూడు పెట్టగలడు? ఏమి కప్పున్? = మీద దేనిని కప్పగలడు? మగువ = భార్య; మాట మాత్రంబు + ఐనన్ = ఒక్క నిమిషమైనా; నోరు, ఆపదు = నోటిని నిరోధించదు; కొడుకు = కొడుకైన మన్మధుడు; తల కొట్లమారి = జగడగొండి; పెట్టునె = భోజనము పెట్టునే, అన్న + అది = అన్నగారైన ఇంద్రునికి సంబంధించినది; మేష + అండము = పొట్టేలి వృషణము, ఉన్నది = ఉన్నది; ఇచ్చేది, ఒక్క = పాలిచ్చేది, ఒకే ఒక; తొట్టిగొడ్డు = పండ్లు లేని ఆవు; అది = దానిని; నీకున్, తోలున్, ఏమి = నీ యింటికి తోలి పెట్టునాయేమిటి? ఎవరి + ఇంటికిన్ = ఏ బందుగుల యింటికి; పోయినన్ = వెళ్ళినను, ఏమి ఫలము = ఏమి ప్రయోజనము? ఉన్నచోన్, ఉండి = ఉన్నచోటనే ఉండిపోయి; సిరులన్ = సంపదలతో; పెంపు + ఒందుము + అయ్య = గౌరవము పొందుము. అని వేడుకుంటున్నాను.

తాత్పర్యము: మామయైన సముద్రుని ఇంటికి వెళ్ళకు. అక్కడ మంచినీరు కూడా పుట్టదు. అతడు పూర్తిగా ఉప్పనివాడు. మిత్రుడని ముక్కంటి ఇంటికి వెళ్లకు. అతడు నిత్య దరిద్రుడు. పుఱ్ఱెలో భోజనం పెట్టి తోలు వలువకట్ట బెడతాడు. కన్నకొడుకు కదా అని మన్మధుని ఇంటికి వెళ్లకు. అతని భార్య రతి నోటికి అడ్డులేదు. అతడేమో ప్రేమ వ్యవహారాలలో ఇరికించి అందరినీ బాధిస్తూ ఉంటాడు. అతడు నీకు కూడు పెట్టడు. అన్నగారైన ఇంద్రుడున్నాడే అతనికి మేషాండాలే ఆస్తి. అతని పాడియావు ముసలి కామధేనువు. దానిని నీకు ఇవ్వలేదు గదా. అందువల్ల అతనిని యాచించుట వృథా ప్రయాస. చుట్టాలలో ఎవరి యింటికి వెళ్లినా నీకు ఆదరం హుళక్కి. కాబట్టి చిరకాలం నుండి నీవు నివసించే శ్రీకాకుళంలోనే ఉండిపోయి భోగాలు అనుభవించు.

94. దుర్జనభంజనోద్యుక్త సుదర్శన
ధారివే నీవు యథార్థముగను
శాత్రవభయదనిస్వనపాంచజన్యభూ
షితకరాంబుజుఁడవే సిద్ధముగను
మత్తారిభేదనాయత్త కౌమోదకి
నిజకరభరితమే నిశ్చయముగ
ఘోర విద్విట్రక్తధారార్ద్రనందక
సంధానపాణివే సత్యముగను
సన్నుతామోఘబాణైక శార్ఙ్గ చక్ర
శయుఁడవే నమ్మ వచ్చునే స్వామి నిన్ను? చిత్ర...

అర్థములు: స్వామి = దేవా; నీవు = నీవు; యథార్థముగను = నిజముగా; దుర్జన భంజన = దుష్టులను శిక్షించుటకు; ఉద్యుక్త = పూనుకొన్న; సుదర్శన ధారివే = 'సుదర్శనము' అను చక్రమును ధరించిన వాడవేనా?; సిద్ధముగను = సత్యముగా; శాత్రవ = శత్రువులకు; భయద = భయము కలిగించు; నిస్వన = ధ్వనికలిగిన; పాంచజన్య = 'పాంచ జన్యము' అను శంఖముచేత; భూషిత = అలంకరింపబడిన; కర + అంబుజుడవే = పద్మమువంటి హస్తము కలవాడవేనా?; నిశ్చయముగన్ = తప్పక; మత్త + అరి = మదించిన శత్రువుల యొక్క; భేదన = నాశమునకు; ఆయత్త = సిద్ధపడిన; కౌమోదకి = 'కౌమోదకి' అనుగద; నిజకరభరితమే = నీ చేత తాల్పబడినదా?; సత్యముగను = వాస్తవముగా; ఘోర = భయంకరులైన; విద్విట్ = శత్రువుల యొక్క; రక్తధారా = నెత్తుటి ధారలచేత; ఆర్ద్ర = తడిసిన; నందక = 'నందకము' అను ఖడ్గము యొక్క; సంధాన = కూడిక కలిగిన; పాణివే = చేయికలవాడవేనా?; సన్నుత = బాగుగా పొగడబడిన; అమోఘబాణ = వ్యర్థము కాని బాణములచేత; ఏక = సాటిలేని; శార్ఙ్గచక్ర = శార్ఙ్గము అను గుండ్రని ధనుస్సు కలిగిన; శయుడవే = హస్తము కలిగినవాడవా?; నిన్నున్ = నిన్ను; నమ్మవచ్చునే = నమ్మదగినా

తాత్పర్యము: స్వామీ! నిజముగానీవు శత్రువులను శిక్షింప బూనిన సుదర్శన మను చక్రమునూ శత్రువులకు భయము కలిగించు ధ్వనిచేయు పాంచజన్యము అను శంఖమునూ, శత్రువులను చంపుటకు సిద్ధముగా నుండు కౌమోదకి అను గదనూ, శత్రువుల రక్తధారలచే తడియు నందకము అను ఖడ్గమునూ, అమోఘ బాణములు ప్రయోగించు శార్ఙ్గము అను ధనుస్సునూ హస్తములందు ధరించు శ్రీ మన్నారాయణమూర్తివేనా? అయితే జీర్ణమైన నీ ఆలయమును ఉద్ధరించు కొనవేమి?

95 ఇల్లు రత్నాకరం బెన్నాళ్లకును జాలు
జీవనం బొరుల యాచింపవలెనె?
యింట మహాలక్ష్మి యెప్పుడుఁ దాండవం
బొనరించు నొకఁడు నీకొసఁగవలెనె?
స్థిరత లోలోన నిక్షేపించు ధనము నెం
చఁగరాని దొకరిఁ జేఁ జాపవలెనె?
పంటపైరుల కాఁపు కంటఁగాయుచునుండు
కోరికఁ బెఱసొమ్ముఁ గొనఁగవలెనె?
ధాత్రి నెవ్వరి రక్షింపఁ దలఁచినావొ
కోరువారలచేఁ బూజఁగొందు వింతె ॥ చిత్ర ॥

అర్థములు: ఇల్లు = ఉనికిపట్టు, రత్నాకరంబు (రత్న + ఆకరంబు) = మణుల పుట్టుచోటు (సముద్రము); ఎన్నాళ్లకును (ఎన్ని + నాళ్లకును) = ఎన్ని దినములకైనను. చాలు = సరిపోవును; జీవనంబు = బ్రతుకు తెరువు; ఒరులన్ = ఇతరులను యాచింపవలెనె? = అడుగవలెనా? ఇంటన్ = నీ యింటిలో; మహాలక్ష్మి = సంపదకు అధిదేవతయైన లక్ష్మీదేవి; ఎప్పుడు = ఎల్లప్పుడు; తాండవంబు + ఒనరించున్ = నృత్యము చేయుచుండును.; ఒకడు = ఇతరుడు; నీకున్, ఒసగవలెనె? = ఇవ్వవలెనా?; స్థిరతన్ = నిలకడగా; లోలోనన్ = అంతఃపురములో; నిక్షేపించు = దాచిన; ధనము = సొమ్ము; ఎంచగరానిది = లెక్కింపసాధ్యము కానిది; ఒకరిన్ = పరులను; చేన్ చాపవలెనె = చేయి చాపి యాచింపవలెనా?; పంటపైరులకాపు= సస్యరక్షకుడైన చంద్రుడు; కంటన్ = ఎడమ కంటిలో; కాయుచుండును = ప్రసరించుచుండును ధాత్రిన్ = భూమిపై; ఎవ్వరిన్ = ఏ భక్తులను; రక్షింపన్ = కాపాడగా: తలచినావో = కోరెదవో; కోరు = వారినే కోరుము; వారలచేన్ = వారిచే; పూజన్, కొందువు = సపర్యను పొందగలవు; ఇంతె = ఇంతే సుమా.

తాత్పర్యము: స్వామి! రత్నములకు గనియైన సముద్రం నీ యిల్లు. ఎంత కాలమైనా నీ జీవికకు సరిపోతుంది. నీ మందిరంలో కలుముల చెలి మహాలక్ష్మి నిత్యమూ విహరిస్తూ ఉంటుంది. అంతఃపురంలో పాతిపెట్టిన ధనం లెక్కకు అందనే అందదు. పంట పైరుల దొర చంద్రుడు సాక్షాత్తూ నీ యెడమకన్ను. ఇంక నీకు ఇతరులను యాచింపవలసిన అక్కఱ యేమున్నది? నీవు రక్షింపదలచిన భక్తులనే యాచించువారే నీకు కోరినదెల్లా ఇస్తారు.

96. అబ్ధికన్యావివాహమహోత్సవము నాఁడు
చూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె
జానకీకల్యాణ సంభ్రమం బానాఁడు
చూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె
భోజసుతోద్వాహ భూరివైభవ మందుఁ
చూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె
రేవతీపరిణయ శ్రీ విలాసం బప్పు
చూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె
ననుచునిట రాజ్యరమఁ బెండ్లియాడ నిన్నుఁ
బ్రజలు సేవించి సంతోషభరితులైరి. చిత్ర...

అర్థములు: అబ్ధికన్యా = లక్ష్మీదేవిని; వివాహ, మహా + ఉత్సవము, నాడు = పెండ్లియాడు గొప్ప పండుగ దినమున; చూడలేదు = చూడలేక పోయినారము; ఈ, చోటన్ = ఈ ప్రదేశములో; చూడన్, కలిగెన్ = చూడగలిగినాము; జానకీ కల్యాణ సంభ్రమంబు - సీతమ్మను వివాహమాడు సంబరమును; ఆనాడు = త్రేతాయుగములో, మిథిలానగరంలో; చూడలేదు = కాంచలేక పోయాము, ఇచ్చోటన్, చూడగలిగెన్; భోజసుతా + ఉద్వాహ = రుక్మిణీ దేవిని చేపట్టే; భూరివైభవము = గొప్పసంపదను; అందున్ = ద్వారకలో; చూడలేదు = దర్శింపలేకపోయాము. ఇచ్చోటన్, చూడగలిగెన్; రేవతీ పరిణయ శ్రీ విలాసంబు = రేవతీ దేవిని ఉద్వాహమాడే శోభాకరమైన శృంగారచేష్టను; చూడలేదు = కనుగొనలేకపోయాము, ఇచ్చోటన్, చూడగలిగెన్; అనుచున్ = అని పలుకుచు; ఇటన్ = ఇక్కడ (శ్రీకాకుళ క్షేత్రంలో); రాజ్యరమన్ = రాజ్యలక్ష్మిని; పెండ్లియాడన్ = వివాహమాడుచుండగా; ప్రజలు = జనులు; నిన్నున్, సేవించి - నిన్నుకొలిచి; సంతోషభరితులు + ఐరి = సంతసముతో నిండినవారు అయినారు సుమా.

తాత్పర్యము: పూర్వయుగాంలో నీవు లక్ష్మి దేవిని, సీతమ్మను, రుక్మిణీ దేవిని, రేవతీ దేవిని పెండ్లాడే ఉత్సవమును మేము చూడలేక పోయాము. ఇప్పుడు శ్రీకాకుళ క్షేత్రంలో రాజ్యరమను పెండ్లాడే ఉత్సవాన్ని చూడగలిగాము అని పరస్పరం భాషించుకొంటూ ప్రజలు నిన్ను పూజించి సంతోషంలో మునుగితేలుతున్నారు సుమా.

97 అఖిలలోక స్థాపనాచార్యమణి వయ్యు
నిజభక్త గురునిచే నిలుపుకొన్న
గర్భస్థితానేక కమలజాండుడ వయ్యు
నొండుకోవెలను జెల్వొందుచున్న
బహుపరాచర భూతపరిపాలకుడ వయ్యు
భక్తార్పితార్థము లప్పట్టుచున్న
హరచతుర్ముఖ దేవతా గోచరుడవయ్యు
నెప్పుడు దర్శనం బిచ్చుచున్న
నిన్ను సేవింపనెవ్వరో! పెన్నిధాన
మెదుట నుండంగ గనుమూసి యేగువారె? ॥ చిత్ర ॥

అర్థములు: అఖిలలోక స్థాపన =సమస్తలోకాలను స్థాపించిన; ఆచార్యమణివి + అయ్యున్ = గురువర్యుడవు అయినప్పటికిని; నిజ భక్త గురునిచేన్ = సొంత భక్తుడను గురువుచేత; నిలుపుకొన్నన్=ప్రతిష్ఠింపబడినప్పటికిని; గర్భస్థిత = కడుపులోనుండిన; అనేక, కమలజ + అండుడవయ్యున్=పెక్కు బ్రహ్మాండములు కలిగినవాడవైనప్పటికి, ఒండు కోవెలను = ఒక గుడిలో, చెల్వు + ఒందుచున్నన్ = ఒప్పుచున్నప్పటికీ; బహు = పెక్కు; చర+అచర, భూత=తిరుగునవి, తిరుగనివి అను రెండు రకములైన ప్రాణులకు పరిపాలకుడవు + అయ్యున్ = ఏలికవు అయినప్పటికిని; భక్త + అర్పిత + అర్థములు = భక్తులచే ఇవ్వబడు వస్తువులు, పట్టుచున్నన్ = కైకొనుచున్నప్పటికిని, హర, చతుర్ముఖ దేవతా = శివుడు, బ్రహ్మ మొదలగు వేల్పులకు; అగోచరుడవు = అయ్యున్ + మనస్సు చేతను ఇంద్రియములచేతను గ్రహింపరాని వాడవు అయినప్పటికిని; ఎప్పుడు = ఎల్లప్పుడు; దర్శనంబు ఇచ్చుచున్నన్=కనిపించుచున్నప్పటికిని; పెన్నిధానము (పెద్ద + నిధానము) = గొప్ప నిక్షేపము, ఎదుటన్, ఉండంగన్ = ముందఉనుండగా; కనుమూసి = కనులు మూసికొని; ఏగువారె?=వెళ్లి పోవుచున్నారా? నిన్నున్ = నిన్ను; సేవింపన్ = కొలువగా, ఎవ్వరో = ఎవ్వరున్నారో.

తాత్పర్యము:- సమస్త జగముల స్థితికి నీవు హేతుభూతుడవు. అయినా భక్తుడినే గురువుగా మన్నిస్తావు. అనేక సహస్ర కోటి బ్రహ్మాండాలను నీవు ఉదరంలో భరిస్తావు. అయినా చిన్న గుడిలో నివసిస్తావు. స్థావర జంగమాత్మకమైన ప్రాణికోటికి నీవు ఏలికవు. అయినా భక్తులిచ్చే పదార్థాలను స్వీకరిస్తావు. ముక్కంటికీ, నలువకు కూడా నీవు గోచరింపవు. అయినా మానవులకు నిత్యమూ దర్శనమిస్తావు. ఎట్ట ఎదుటనున్న పెద్ద నిధివి నీవు. అయినా జనులు నిన్ను చూడకుండా, పూజించకుండా వెళ్లిపోతున్నారు సుమా.

98. కైలాస మేరు సంకాశ నాగాశన
స్కంధంబుపై రథోత్సవము గల్గఁ
జందనమందార సంతానకల్పక
వనముల మృగయోత్సవమ్ము గల్గ
రంగత్పయఃపయోరాశి వీచికలపై
వర్ణింప డోలోత్సవంబు గల్గ
బహుఫణారత్న శుంభద్భుజంగమ భోగ
వసతిఁ బర్యంకోత్సవంబు గల్గఁ
బరకృతోత్సవ మిచ్చట బ్రాఁతె నీకు
భక్తజనులకు నేత్రోత్సవంబె కాని. చిత్ర....

అర్థములు :- కైలాస = వెండికొండతో; మేరు = బంగారు కొండతో; సంకాశ = సమాన మైన; నాగ + అశన = గరుత్మంతుని యొక్క; స్కంధంబుపైన్ = భుజము మీద; రథ + ఉత్సవము = రథంపై ఊరేగుట; కల్గన్ = సిద్ధించుచుండగా; చందన, మందార, సంతాన, కల్పక వనములన్ = మంచి గందపు చెట్లు, మందార వృక్షములు, సంతాన వృక్షములు, కల్పవృక్షములు మొ.నవి గల వనములందు; మృగయా + ఉత్సవము = వేటాడుట అనే పండుగ; కల్గన్ = ప్రాప్తించగా; రంగత్ = ఒప్పుచున్న; పయఃపయోరాశి + పాలసము ద్రపు; వీచికలపై = అలల మీద; వర్ణింపన్ = ఎన్నదగిన; డోలా + ఉత్సవము = ఉయ్యాలలో ఊగే పండుగ; కల్గన్ = లభించగా; బహు = అనేకములైన; ఫణారత్న = పడగల మీది రత్నములతో; శుంభత్ = ప్రకాశించే; భుజంగమ = సర్పరాజము యొక్క; భోగవసతిన్ = పడగల స్థానంపై; పర్యంక + ఉత్సవంబు = పాన్పుపైపరుండే ఉత్సవము; కల్గన్ = ఉండగా; ఇచ్చటన్ = ఈలోకంలో; పరకృత = ఇతరుల చేత చేయబడు; ఉత్సవము = రథోత్సవము మొ॥ నవి; భక్త జనులకు = భక్తులైన వారికి మాత్రమే; నేత్ర + ఉత్సవంబె = కనుల పండువు; కాని = అంతేకాని; నీకున్ = భగవంతుడవైన నీకు; బ్రాతి + ఎ = గొప్ప?

తాత్పర్యము :- కొండంత గరుడిపై నీవు విహరిస్తావు. కల్పవృక్షవనాలలో వేటాడతావు. పాలమున్నీటి కెరటాలపై ఉయ్యాలూగుతావు. శేషశయ్యపై శయనిస్తావు. అలాంటి నీకు మానవులు భూలోకంలో చేసే రథోత్సవము మొ.నవి ఏపాటి. భక్తులు చూచి ఆనందించటానికే అవి జరుపుతారు అంతే.

99. కోరిక లీను వైకుంఠంబులోని లో
నగరిలో నామూల నవ్యదివ్య
సౌధంబుదాపలి సరసమందారవ
నాంతరామృత సరఃప్రాంతచంద్ర
కాంతోపలోత్పల కల్పితపర్యంక
సకల సౌభాగ్య లక్షణనివాస
లక్ష్మీ మనోజ్ఞ విలాసవశీకృత
సంభోగ సామ్రాజ్యసంతతాభి
రామమూర్తికి వాంఛేతర ప్రపంచ
మేమి గావలె లీలార్థ మింతెకాని, చిత్ర....

అర్థములు :- కోరికలు + ఈను = కోరిన కోర్కెలను తీర్చు; వైకుంఠంబులోని = వైకుంఠము నందలి; లోనగరిలోన్ = అంతః పురములో; ఆమూలన్ = ఒక చాటైన ప్రదేశమున; నవ్యదివ్య సౌధంబు = కొత్తదైన, మనోజ్ఞమైన, భవనమునకు; దాపలి = ఎడమవైపున ఉన్న; సరస = రమణీయమైన; మందార వన + అంతర = కల్పవృక్షముల యొక్క తోపులో; అమృత సరఃప్రాంత = మంచినీటి కొలనుదరి; చంద్రకాంత + ఉపల = చంద్రకాంతమణుల తో; ఉత్పల = కలువపూవులతో; కల్పిత పర్యంక = నిర్మించబడిన పాన్పుపై; లక్ష్మీ మనోజ్ఞ = లక్ష్మీదేవి యొక్క మనస్సును దోచుకొను; విలాసవశీకృత = శృంగార చేష్టలకువశమైన; సంభోగ సామ్రాజ్య = సురత సామ్రాజ్యముచే; సంతత = ఎల్లప్పుడు; అభిరామమూర్తికిన్ = మనోహరమైన రూపము గలవానికి; వాంఛా + ఇతర, ప్రపంచము = అన్యకాంక్షల సమూహము; ఏమి కావలెన్ = ఎందుకు; లీలా + అర్థము = నటనకొఱకే; ఇంతెకాని = ఇంతే;

తాత్పర్యము := భక్తులు కోరిన కోర్కెలు సిద్ధించు వైకుంఠపురంలోని అంతిపురంలో ఒక మూల నున్న మేడకు ఎడమవైపున సుందర మందార వనంలో మధురజల పూర్ణమైన సరోవరం తీరంలో చంద్ర కాంతమణులు చెక్కి, కలువ పూవులు పఱచిన శయ్యపై లక్ష్మీదేవితో సురతసుఖాలలో తేలియాడే భగవంతుడికి ఇతర సుఖాల అవసరమేమిటి ? కేవలం వినోదం కొఱకే కాదా.

100. గుఱుతుగ సద్భక్తకోటికీ నాటికి
విదరాని బహుఋణస్థుఁడవు నీవు
సేవకు లెన్నెన్ని త్రోవలఁజనుచున్న
వదలక యనుసరించెదవు నీవు
నిజదాసు లాత్మేచ్ఛ నిలిపి రెచ్చో నిన్నుఁ
దొలఁగ కచ్చోటనే నిలిచె దీవు
శ్రితు లంబలియు నైనఁజేఁ జూపనది యెంతొ
యమృతభోగంబుగా నలరె దీవు
జగములన్నియు నీకు వశ్యము లటంటి
వీవు నిజదాసవశ్యుఁడ వెంత ఘనత? చిత్ర...

అర్థములు: గుఱుతుగన్ = నిజముగా; సత్, భక్తకోటికిన్ = శ్రేష్ఠులైన భక్తుల సమూహమునకు; ఈనాటికిన్ = ఇప్పటికి కూడ; నీవు = నీవు; విదరాని = విడిచిపెట్టరాని; బహుఋణస్థుడవు = మిక్కిలి ఋణపడి యున్నవాడవు; సేవకులు = దాసులు; ఎన్ని + ఎన్ని, త్రోవలన్ = పెక్కుదారులను; చనుచున్ = ఉన్నన్ = అనుసరించుచున్నప్పటికినీ; నీవు = నీవు; వదలక = వారిని వదలిపెట్టక; అనుసరించెదవు = వెంబడించెదవు; నిజదాసులు = నీ భక్తులు; ఆత్మ + ఇచ్ఛన్ = తాముకోరినట్లు; నిన్నున్ = నిన్ను; ఏ + చోన్ = ఎచ్చట; నిలిపిరి = నిలిపినారో; ఆ + చోటన్, ఏ = అచ్చటనే; నీవు = నీవు; తొలఁగకన్ = ప్రక్కకు పోకుండ; నిలిచెదు = ఉండెదవు; శ్రితులు = ఆశ్రయించినవారు; చేన్ = తమచేతిలో; అంబలియున్, ఐనన్ = గంజినయినా; చూపన్ = చూపగా; నీవు = నీవు; అది, ఎంతొ = అది మిక్కిలి; అమృత భోగంబుగాన్ = అమృతము అనే భోగద్రవ్యముగా; అలరెదవు = సంతోషింతువు; జగము అన్నియున్ = సమస్తలోకములు; నీకున్ = నీకు; వశ్యములు = లోబడినవి; అట + అంటివి = అని అన్నావు; ఈవు = నీవు; నిజదాస, వశ్యుడవు = నీ భక్తులకు లోబడెదవు; ఎంత ఘనత = ఎంత గొప్పతనము?

తాత్పర్యము: నిజమైన భక్తులకు నీ వెప్పుడూ ఋణపడి యుందువు. భక్తులు వివిధ మార్గములను అనుసరించినప్పటికీ వారిని వదలిపెట్టవు. దాసులు తాము కోరిన చోట ప్రతిష్ఠించితే స్థిరంగా అక్కడే ఉంటావు. ఆశ్రితులు అంబలి నివేదించినా అమృతంగా భావిస్తావు. లోకములన్నీ నీకు వశమై ఉంటవి. నీవేమో భక్తులకు లోబడి ఉంటావు. ఇది చాలా గొప్ప విషయం కదా.

101 వెనుక వేసికొని యుర్వీనాథకోటులు
సైంధవుఁగావంగఁ జాలినారె?
ధరనేయుఁ దనసుతుశిర మెవ్వఁడతఁడీల్గ
శాపించి సింధురా జోపినాఁడె?
చాటించు నా సర్వసైన్యంబులనిఁగర్ణు
చే శక్తినరు నేయుఁ జెప్పినారె?
పరులచే నొవ్వని పంతంబు గల భీష్ముఁ
డర్జునాస్త్రంబుల కాగినాఁడె?
మనుజయత్నంబు, బలమెంతమాత్ర? మీవు
నిజము కరుణించునాతఁడే విజయుఁడరయ ॥ చిత్ర ॥

అర్థములు: వెనుకవేసికొని =అభయమిచ్చి, ఉర్వీనాథ కోటులు = రాజ సమూహములు; సైంధవున్ = జయద్రథుని (కౌరవుల చెల్లెలగు దుస్సల మగని) ; కావంగన్, చాలినారె? = రక్షింపజాలినారా ; తనసుతు శిరము = తన కొడుకు తలను ; ఎవ్వడు ధరన్, వేయున్ = ఎవ్వడు నేలపై పడవైచునో, అతడు, ఈల్గన్ = వాడు చావగా; శాపించి = శపించి; సింధురాజు = సైంధవుని తండ్రి; ఓపినాడె? = సమర్థుడైనాడా? చాటించు = కర్ణుని శక్తిచే అర్జునుడు చచ్చునని ఘోషించిన; ఆ సర్వసైన్యంబులు = సమస్త కౌరవసైనికులు; అనిన్ = యుద్ధములో; కర్ణు = కర్ణుని; చే శక్తిన్ = చేతనున్న శక్తితో; నరున్, ఏయన్ = అర్జునుని వధింపగా; చెప్పినారె? = తెలియజెప్పగలిగినారా?; పరులచేన్ = శత్రువుల చేతిలో; నొవ్వని = చావని; పంతంబు కల = ప్రతిజ్ఞ గల,; భీష్ముడు = భీష్మాచార్యుడు; అర్జునాస్త్రంబులకున్ = అర్జునుని బాణముల ముందు; ఆగినాడె? = నిలువబడగలిగినాడా?, మనుజ యత్నంబు = మానవుని ప్రయత్నము = బలము= బలిమి; ఎంత మాత్రము? = ఏ పాటిది? ఈవు = నీవు; కరుణించు నాతడే = కనికరించు వాడే; అరయన్ = ఆలోచింపగా; విజయుడు = గెలుపునొందు వాడు ; నిజము = సత్యము.

తాత్పర్యము:- నీ ప్రాణానికి మా ప్రాణం అడ్డు వేస్తాము అని అభయదానం చేసిన రాజ సమూహాలు సైంధవుని కాపాడలేక పోయాయి. తన పుత్రుని శిరస్సు మహిపై పడకొట్టినవాడి శిరస్సు వేయి ముక్కలవుతుంది అని శపించిన వృద్ధ క్షత్రుడు (సైంధవుని తండ్రి) తన కొడుకును రక్షింపలేక పోయినాడు. ఇంద్రదత్తమైన మహాశక్తితో కర్ణుడు అర్జునుని నేల కూలుస్తాడు అని దద్బాలు కొట్టిన కౌరవ సైనికులు అర్జునుని శక్తితో వధించు అని యుద్ధభూమిలో చెప్పటం మరచిపోయారు. స్వచ్ఛంద మరణమే కాని, ఇతరుల చేతిలో మరణం లేని భీష్ముడు అర్జునుని శరములను నిరోధింప లేకపోయినాడు. దైవం ముందు పౌరుషమూ, బలమూ ఏ మాత్రమూ పనికి రావు. స్వామీ! నీ దయ ఉంటే తప్ప ఎవరూ జయము పొందలేరు. ఇది ముమ్మాటికీ నిజము.

102 జనితరంగా పారసంసరణాబ్ధినే
తటిదరింపగ లేక యెఱుక గలిగె
జేపట్టి దరిజేర్తువానదుద్ధారి వీ
వనుచుగుయ్యిడుచున్న నభయదాన
మీక యపేక్షించె దింత దయాబ్ధివి;
యితర కార్యభరం బదెంతయున్న
శరణాగతులబ్రోచు బిరుదు నీకున్నదే
కరిరాజుబ్రోవ నిందిర రహస్య
కేళి సంహర్షి తాంతరంగికుడవయ్యు
రమను జేకొని వేంచేయు అవ్వయేమి? ॥ చిత్ర ॥

అర్థము: జనితరంగ = పుట్టుకలు అనే అలలతో, అపార =అవలి దరిలేని, సంసరణ+అబ్ధిన్=సంసారమనే సముద్రమును; ఏతటిన్ = ఏ సమయమునందును; తరింపగలేక=దాటజాలక; ఎఱుక కలిగెన్ = జ్ఞానము కల్గెను. చేపట్టి = చేరదీసి; దరిన్, చేర్తువు=బడ్డునకు చేరుస్తావు; అనత్ = ఉద్ధారివి = ఇడుముల నుండి విడిపిస్తావు; అనుచు=అని భావిస్తూ; కుయ్యి + ఇడుచున్నన్ = మొఱపెట్టుకొనుచున్నప్పటికివి; అభయ దానము, ఈక = భయము లేదు అని చెప్పకుండా; ఉపేక్షించెదు = అశ్రద్ధ చేస్తున్నావు; ఇంత = ఈ పాటి; దయా + అబ్ధివి = దయా సముద్రుడవు; ఇతర కార్యభరంబు=వేరే పనుల ఒత్తుడు; అది ఎంత ఉన్నన్ = అది ఎంత అధికమైనప్పటికీ శరణ+ఆగతులన్ = రక్షణను గోరి వచ్చిన వారిని; బ్రోచు = రక్షించు; బిరుదు=సామర్థ్యము, నీకు + ఉన్నదే = నీకు ఉన్నదే కదా; ఇందిర=లక్ష్మీదేవితో; రహస్య కేళిన్ = సురత క్రీడచే; సంహర్షిత = మిక్కిలి ఆనందించిన, అంతరంగికుడవు, అయ్యున్-మనస్సు గలవాడవు అయినప్పటికివి; కరిరాజున్, బ్రోవన్ = గజేంద్రుని రక్షించుటకు; రమను = లక్ష్మీ దేవివి; చేకొని = తోడ్కొని; వేంచేయు = వెళ్ళు; అవ్వ ఏమి = నింద ఏమిటి?

తాత్పర్యము: జనన మరణ పరంపర అనే సముద్రాన్ని దాటటం అసాధ్యమని నేను తెలుసుకొన్నాను. ఆదరించి, ఆపదలు తొలగించి నన్ను భవ సముద్రమును దాటిస్తావని ఆశించి నీకు మొఱ పెట్టుకున్నాను. కాని ఇంత వరకూ నాకు అభయ దానం చేయకుండా నీవు ఔదాసీన్యం వహించావు. ఇంతేనా నీ దయ? అన్య కార్యాలు ఎన్నో చేయవలసిన పూచీ నీకు వున్నప్పటికీ శరణాగతులను రక్షిస్తావట. అయితే మాత్రం లక్ష్మీదేవితో రహఃకేళిలో తృప్తిచెంది కూడా కరిరాజును రక్షించటానికి ఆమెను కూడా తోడ్కొని వెళ్లినావని అందరూ నిన్ను తప్పు పట్టుతున్నారు. ఎఱచి తింటూ ఎమ్ములు మెడకు కట్టుకుంటారేమిటయ్యా?

**103.** ఆగామి సంచిత ప్రారబ్ధముల టుండ
ఈ జన్మమందు నే నెల్లవేళ
నఘములే చేసితి నన్నియుష్మత్సుధా
సదృశ నిర్హేతుక జాయమాన
కరుణాకటాక్ష వీక్షణ మెంచ నెప్పుడో
ప్రసరింపవలె, నే నపారదురిత
వారిధిఁ దరియింపవలెఁగాని గతి యితః
పర మెఱుంగను భక్తపాలనాంక!
శేషపర్యంక! రాజ్యలక్ష్మీ సహాంక
ప్రధననిశ్శంక! యదుకులాంబుధిశశాంక! చిత్ర

అర్థములు :- ఆగామి, సంచిత ప్రారబ్ధములు = ఆగామి, సంచితము, ప్రారబ్ధము, అనుమూడు విధములైన కర్మమును; అటు + ఉండన్ = అలా ఉంచి; ఈ జన్మము + అందున్ = ఈపుట్టువున; నేను + ఎల్లవేళన్ = నేను ఎల్లప్పుడును; అన్ని = స ర్వమూ, అఘములే = పాపములే చేసితిని = చేసినాను, యుష్మత్ = నీయొక్క; సుధాసదృ శ = అమృతముతో సమానమైన; నిర్హేతుక, జాయమాన = కారణములేకుండా పుట్టిన; కరుణాకటాక్ష వీక్షణము = దయచిందు కడకంటి చూపు; ఎంచన్ = తలపగా; ఎప్పుడో = ఇంతకుముందు ఎప్పుడో; ప్రసరింపవలెన్ = వ్యాపింపవలెను; నేను = నేను; అపారదురితవారిధిన్ = ఆవలి దరిలేని పాపము అనే సముద్రమును; తరియింపవలెన్ = దా టవలెను; కాని = అంతేకాని; ఇతః పరము, ఎఱుంగను = ఇంతకంటె అన్యమైనది నాకు తెలియదు; భక్తపాలన + అంక = భక్తరక్షణము బిరుదుగా గలవాడా!; శేషపర్యంక = శేషుడను సర్పరాజు పడకగా గలవాడా; రాజ్యలక్ష్మీసహ + అంక = రాజ్యలక్ష్మితో గూడిన ఒడి కలవాడ; ప్రధాన నిశ్శంక = యుద్ధమునందు జంకులేనివాడా; యదుకుల + అంబుధి శశాంక = యదువంశమనే సముద్రమునకు చందమామ అయినవాడా!

తాత్పర్యము :- ఆగామి, సంచితము, ప్రారబ్ధము అను మూడు విధాలైన కర్మముల మాట అలా ఉంచి ఈజన్మలో నేను చేసిన వన్నీ పాపాలే. అవ్యాజమైన, అమృతం వంటి నీ కరుణా కటాక్ష వీక్షణాలు పూర్వమే నా మీద ప్రసరించి, నేను అంతులేని పాప సముద్రాన్ని దాటి ఉండవలసి యున్నది. నీవు తప్ప నాకు మఱొక గతిలేదు.

104. ప్రాణులకర్మములఁ బరికింపఁ బదునల్గు
రంచు ధర్మ దేవత లని లిఖించి
చిత్రగుప్తులు లెక్క సేయుదురంచు యని
ధర్మ రాజాదుల దండ నునిచి
చేసినవారిచేఁ జెప్పించి
బాధించి నరకకూపములయందుఁ
ద్రోయింతురంచు నట్టి దుర్గతిఁ దప్పింప
దక్షుండ వాపన్న రక్షకుండవు
తే. కలవు కల వని నీపాదకమలములకు
శరణుశరణంటి నభయం బొసంగుమయ్య!, చిత్ర.

అర్థములు: ప్రాణుల కర్మములన్ = జీవులు చేయుపాప పుణ్యములను; పరికింపన్ = పరిశీలించుటకు, ధర్మదేవతలు= ధర్మ దేవతలు; పదునాల్గురు + అట = పదునాల్గురు ఉందురని అందురు, అవి లిఖించి = ఆ పాప పుణ్యములను వ్రాసి, చిత్ర గుప్తులు = చిత్ర గుప్తులవారు, లెక్క చేయుదురు, అట = లెక్కింతురని అందురు. అవి = వాటిని (పాప పుణ్యములను); ధర్మరాజ + ఆదుల = యమ ధర్మ రాజు మొదలగు వారి; దండన్, ఉనిచి = సమీపమున ఉంచి; చేసిన వారిచేన్, చెప్పించి = ఆ పాప పుణ్యములు చేసిన జీవులతో వాటిని నోట చెప్పించి; భటులచేన్, బాధించి = యమ భటులచే, హింసింప జేసి, నరకకూపములు, అందున్ = నరకము నందలి బావులలో; త్రోయింతురు, అట = నెట్టింతురని అందురు, అట్టి, దుర్గతిన్ = అటువంటి ఆపదను, తప్పింపన్ = తొలగించుటకు; దక్షుడవు = సమర్థుడవని; ఆపన్న రక్షకుడవు = ఆపద పొందిన వారిని కాపాడు వాడవు; కలవు, కలవు అని = తప్పక ఉన్నావని; నీ, పాద కమలములకున్ = నీ పద్మముల వంటి పాదములకు; శరణు, శరణు, అంటిన్ = రక్షింపవేడు కొంటిని, అభయంబు, ఒసంగుము, అయ్య = భయమును తొలగించుము.

అర్థములు: పదునల్గురు ధర్మ దేవతలు ప్రాణుల పాప పుణ్యములు కనుగొందురనీ, చిత్ర గుప్తులు వాటినొక పుస్తకములోనికి ఎక్కించి లెక్కపెట్టుననీ, వాటిని యముని చెంత పెట్టి, జీవులచేత చెప్పించి ఒప్పించి, యమకింకరులచే బాధ పెట్టించి, నరక కూపములలో త్రోయింతురని అందురు. అటువంటి దుర్దశ నాకు కలుగకుండ తప్పించి రక్షింప జాలిన వాడవు నీవే అని నమ్మి నీ పాదకమలములను శరణు వేడితిని. నాకు అభయమిమ్ము.

105\. పూర్వకవీంద్రుల పుణ్యఫలం బేమొ
సాక్షాత్కరించి యస్మత్పరంబు
గా గద్యపద్యముల్ గల్పించు మనినీవు
వర మొసంగితి వండ్రు వాంఛజేసి
నేర్చినట్లుగ నేను గూర్చి కవిత్వంబు
నీకంకితముజేసి నెనరుదోఁపఁ
జేదోయి యొగ్గిన శ్రీపాదరజ మింత
నామీఁదఁ బారనీవేమిసామి!
కృపకుఁ బాత్రముఁజేయు మక్షీణభాగ్య
లక్షణాంచిత పాదపల్లవకరాబ్జ చిత్ర...

అర్థములు: సామి = స్వామీ!; పూర్వకవి + ఇంద్రుల = పూర్వ కవీశ్వరులు చేసిన; పుణ్య ఫలంబు + ఏమొ = పుణ్యము యొక్క ఫలితము ఎటువంటిదో; నీవు, సాక్షాత్కరించి = నీవు ప్రత్యక్షమై; వాంఛన్ చేసి = కోరి; అస్మత్, పరంబుగాన్ = నాకు అంకితముగా; గద్య పద్యముల్ = గద్యములు, పద్యములు; కల్పించుము అని = రచింపుము అని; వరము + ఒసం గితివి = వరము ఇచ్చినావు అని; అండ్రు = పెద్దలు అందురు; నేనున్ = నీ భక్తుడనగు నేనును; నేర్చిన, అట్లుగన్ = చేతనైనట్లు; కవిత్వంబున్ = కైతను; కూర్చి = అల్లి; నీకు, అంకితమున్, చేసి = నీకు సమర్పించి; నెనరు, తోపన్ = ప్రేమ పొడమగా; చేదోయి, ఒగ్గినన్ = కేలు జంటపట్టగా; శ్రీ పాదరజము = శ్రీకరమైన నీ అడుగల దూళి; ఇంత = కొంచెము; నా మీదన్ = నాపై; పాఱనీవు, ఏమి = ప్రసరింపనీయవు, ఏల; అక్షీణ, భాగ్యలక్షణ అంచిత = తఱుగని శుభలక్షణములతో నొప్పు; పాదపల్లవ కర + అబ్జ = చిగుళ్లవంటి పాదములు, పద్మముల వంటి చేతులు కలవాడా!; కృపకున్, పాత్రమున్ చేయుము = నీ దయకు అర్హునిగా జేయుము.

తాత్పర్యము: స్వామీ! పూర్వ కవీంద్రుల అదృష్టమెటువంటిదో కాని, నీవు కోరి వారికి ప్రత్యక్షమై నీ పేర కవిత్వము చెప్పుమని అడిగినావట! నేనుకూడ యథాశక్తి కవనము అల్లి నీకు అంకితముచేసి, దోసిలి ఒగ్గినాను. శుభప్రదమైన నీ పాద ధూళికొంచెము నాపై ప్రసరింప జేసి నన్ను ధన్యుని జేయుము.

106. కావ్యదోషము లెఱుంగని మత్కవిత్వంబు
విద్వన్నుతంబుఁ గావించినావు
బహిరంతరింద్రియపరిశుద్ధి లేని నా
తలఁపులోపల వచ్చి నిలిచినావు
పుణ్యకర్మ మొకింత పూని చేయనినన్నుఁ
బెద్దలచేత మెప్పించినావు
పురుష ప్రయత్నంబు గుఱుతెఱుంగని నన్ను
భుక్తి గల్గఁగఁ జేసి ప్రోచినావు
పతితుఁ జేపట్టినావు; చేపట్టినందు
కన్యగతిఁ బోవనీయకు మార్తరక్ష! చిత్ర...

అర్థములు: కావ్యదోషంబులు = గ్రంథరచనలో దొరలు దోషములు; ఎఱుంగని = తెలియని; మత్, కవిత్వంబున్ = నా కైతను; విద్వత్, నుతంబున్ = పండితులచే పొగడబడిన దానినిగా; కావించినావు = చేసినావు; వచ్చి = విచ్చేసి; బహిర్, అంతర్, ఇంద్రియ = బయటి, లోపల ఇంద్రియముల; పరిశుద్ధిలేని = మిక్కిలి స్వచ్ఛతలేని; నా తలపు లోపలన్ = నా మనస్సులో; నిలిచినావు = స్థిరముగా నిలిచిపోయినావు; పుణ్యకర్మము = పుణ్యము కలిగించునవి; ఒకింత = కొంచెమైనను; పూనిచేయని = పట్టుదలతో చేయని; నన్నున్ = నన్ను; పెద్దలచేత మెప్పించినావు = పూజ్యులు మెచ్చుకొనునట్లు చేసినావు; పురుష ప్రయత్నంబున్ = పురుష కారమును; గుఱుతు, ఎఱుంగని నన్నున్ = తెలిసికొనని నన్ను; భుక్తి కల్గగన్, చేసి = భోజనము లభించునట్లుచేసి; ప్రోచినావు = పోషించినావు; ఆర్తరక్ష = కష్టములలోనున్నవారిని కాపాడువాడా!; పతితున్ = భ్రష్టుడనైన నన్ను; చేపట్టినావు = ఆదరించినావు; చేపట్టినందుకు = ఆదరించితివి కనుక; అన్యగతిన్ = మఱియొక త్రోవను; పోవనీయకు = వెళ్లనీయకుము.

తాత్పర్యము: కావ్యదోషములంటే ఏమిటో నాకు తెలియదు. నాకైతలో ఎన్నో దోషములు దొరలియే యుండును. అయినా నా కవనమును విద్వాంసులు కొనియాడినారు. బాహ్యేంద్రియ శుద్ధి, అంతరింద్రియ శుద్ధిలేని నా హృదయములో ప్రవేశించి అందే స్థిరముగా నిలిచిపోయినావు. నేను ఇంతవఱకు పూనుకొని ఎట్టి పుణ్యకార్యములు చేయలేదు. అయినను పండితులు మెచ్చుకున్నారు. నేను పురుష ప్రయత్నము యొక్క ఆవశ్యకతను గుర్తించలేని సోమరిని. అయినా నాకు అన్న పానాదులొసగి దైన్యము లేకుండ చేసినావు. అంతా నీదయ. ఆర్తరక్షాపరాయణా! నేను పాపిని. అయినా నన్ను చేరదీసినావు. ఇకపై చెడ్డ దారిని పోనీకుండ నన్ను కాపాడు భారము నీదే సుమా!

107. శబరి యెంగిలి పండ్లు చవిఁజూచు ననుకంప
కుబ్జ గందము పూఁతఁ గొన్నకరుణ
పాంచాలి కోర సాపడిన దయారతి
గోపమ్మ యుగ్గుఁబాల్ గ్రోలుకృపను
మాలికుఁ డొసఁగు తోమాలెఁ దాల్చిన ప్రేమ
ద్విజుని కొంగటుకులు దిన్నకూర్మి
గుహుఁడు పాదములు కడ్గుట కుబ్బ నెనరును
నుదుత దాస్యమునకుఁ బొడము ప్రేమ
శతక మంగీకరింపుము జగతి జనకుఁ
డర్భ కావ్యక్త భాషల నలరి నట్లు, చిత్ర....

అర్థములు :- శబరి, ఎంగిలిపండ్లు = శబర జాతిస్త్రీ యెంగిలి చేసి యిచ్చిన పండ్లు; చవిచూచు = రుచిచూచిన; అనుకంపన్ = కనికరముతో; కుబ్జ = గుజ్జుదాని; గందము పూత = నానావిధలేపనములు; కొన్న, కరుణన్ = గ్రహించిన, దయతో; పాంచాలి కోరన్ = ద్రౌపది వంటపాత్రలో; సాపడిన = భుజించిన; దయారతి = దయయందలి ఆసక్తితో; గోపమ్మ = గోపిక; ఉగ్గుబాల్ = చనుబాలతో రంగరించిపెట్టిన ఆముదము; క్రోలు కృపను = త్రాగిన దయతో; మాలికుడు = పూలదండలు కట్టువాడు; ఒసగు = ఇచ్చిన; తోమాలెన్ = ఆకులు, పువ్వులు కూర్చికట్టిన దండను; తాల్చిన ప్రేమన్ = ధరించిన కూర్మితో; ద్విజుని = బ్రాహ్మణుని; కొంగు + అటుకులు = కొంగుననున్న అటుకులు; తిన్న, కూర్మిన్ = తినిన స్నేహముతో; గుహుడు = గుహుడను బోయవాడు; పాదములు కడ్గుటకున్ = కాళ్లు కడిగినందులకు; ఉబ్బు, నెనరునన్ = పొంగిన దయతో; ఉడుత దాస్యమునకున్ = ఉడుత చేసిన సేవకు; పొడము, ప్రేమన్ = పుట్టిన, ప్రేముడితో; జగతిన్ = లోకములో; జనకుడు = కన్నతండ్రి; అర్భక = శిశువు యొక్క; అవ్యక్త భాషలన్ = అస్పష్టములైన మాటల చేత; అలరిన, అట్లు = సంతోషించునట్లు; శతకము = ఈ నూఱు పద్యముల సమూహమును; అంగికరింపుము = స్వీకరింపుము.

తాత్పర్యము :- బోయత ఎంగిలించి యిచ్చిన పండ్లు రుచిచూచి ఆమెకు మోక్షమిచ్చినావు. కంసదాసియైన త్రివక్ర (మూడు వంకరలు గల దేహము కలది)ను అడిగి కలపములు పుచ్చుకొని ప్రసన్నుడవై దాని శరీర వక్రతలను మాన్పి నావు. పాండవులు వనవాసము చేయుతరి ద్రౌపది వంట పాత్రలో ఒక మెతుకును సాపడి దుర్వాసోమునిని, శిష్యులను తనిపి పాండవులను కాపాడినావు. యశోదమ్మ ఉగ్గుబాలు త్రావి ఆమె జన్మము ధన్యము చేసినావు. మాలా కారుడైన సుదాముడిచ్చిన పూలదండలను ధరించి అతడు కోరిన వరమిచ్చినావు. నిరుపేదయైన కుచేలుని కొంగున నున్న అటుకులను పిడికెడు మాత్రమే తీసికొని అతనికి బహు సంపదలందించినావు. నిషాదరాజైన గుహుడు అడుగులను కడుగగా ఉబ్బిపోయినావు, వారిధికట్టువేళ ఉడుత చేసిన సాయమునకు మెచ్చి ప్రేమతో దాని మేను నిమిరినావు. లోకములో తండ్రి తన చిన్న కొమరుని తొక్కు పల్కులకు సంతోషించునట్లు, నేను అల్ప ప్రజ్ఞతో రచించిన ఈ శతకమును గ్రహించి శబరి మొ. భక్తులపై చూపిన ప్రేమను నాపై చూపుము.

108. శతక మొకటి మనసా: హరిపాదము
లాశ్రయించవె' యని యల్లినాఁడ
గరిమి 'రామా! భక్త కల్పద్రుమా!' యని
యొప్పుగా శతకంబుఁ జెప్పినాఁడ
నలరులదండ మీ కనఁగ 'హంసలదీవి
గోపాలశతకంబుఁ' గూర్చినాఁడ
యుష్మ దంకితముగా నూహించి శతక మే
నంచితంబుగ రచియించినాఁడ
భవదనుగ్రహ కవితచేఁ బ్రబలువాఁడ
నవనిఁ గాసుల పురుషోత్త మాఖ్యవాఁడ
చిత్రచిత్ర ప్రభావ, దాక్షిణ్యభావ
హతవిమతజీవ, శ్రీకాకుళాంధ్ర దేవ!

**అర్థములు :–** 'మనసా హరిపాదము లాశ్రయించవె' అని = అనుమకుటముతో; శతకము, ఒకటి = శతక మొకదానిని, అల్లినాడన్ = రచించితిని; గరిమన్ = గౌరవముతో; 'రామా! భక్త కల్పద్రుమా'! అని = అనుమకుటముతో; ఒప్పుగాన్ = చక్కగా; శతకంబున్ = మఱొక శతకమును; చెప్పినాడన్ = వ్రాసితిని; మీకున్ = శ్రీ కాకుళాంధ్రదేవా! మీకు; అలరుల దండ = పూలదండ; అనగన్ = అనేటట్టుగా; హంసల దీవి గోపాలశతకంబున్, కూర్చి నాడన్ = అల్లితిని; ఊహించి = ఆలోచించి; శతకము = ఆంధ్రనాయకశతకమును; యుష్మత్, అంకితముగాన్ = నీపేర; ఏన్ = నేను; అంచితంబుగన్ = ఒప్పుగా; రచియించి నాడన్ = కూర్చితిని; భవత్, అనుగ్రహ, కవితచే = నీదయతో అబ్బిన కవితా శక్తితో; ప్రబలు వాడన్ = వర్ధిల్లు వాడను; పురుషోత్తమ, ఆఖ్యవాడన్ = పురుషోత్తముడను పేరు గల వాడను;

**తాత్పర్యము :–** శ్రీకాకుళాంధ్రదేవా! నన్ను కాసుల పురుషోత్తముడు అందురు. నీదయవల్ల నాకు కవనము అల్లు ప్రజ్ఞ అబ్బినది. 'మనసా హరిపాదము లాశ్రయించవే' అనే మకుటంతో చంపక, ఉత్పలమాలంతో ఒక శతకమునూ, పరాకు భద్ర శైలరామ! భక్త కల్పకద్రుమా! అనే మకుటంతో పంచచామర ఛందస్సులో మఱొకశతకమును, 'భావజవిలాస! హంసల దీవివాస!, లలితకృష్ణాబ్ధి సంగమస్థల విహార! పరమ కరుణాస్వభావ! గోపాలదేవ!' అనే మకుటంతో సీసపద్యాలలో ఇంకొక శతకమును రచియించితిని. ఇప్పుడు, 'చిత్రచిత్ర ప్రభావ దాక్షిణ్యభావ! హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ. అనే మకుటంతో 'సీసపద్యాలతో' నీకు అంకితముగా ఈశతక మల్లితిని. స్వీకరింపుము.

## సంపూర్తి

# తప్పు, ఒప్పుల పట్టిక

| పద్యం నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 52. | చట్టం | చుట్టము |
| 54. | ప్రపంచబున్ | ప్రపంచంబున్ |
| 54. | ప్రాణములనను | ప్రాణములను |
| 54. | నిర్గుణంబునన్ | నిర్గుణంబున |
| 58. | తాన్ | నేను (బ్రహ్మ) |
| 63. | అతి | అదితి |
| 66. | ధనస్సు | ధనుస్సు |
| 67. | నందనిన్ | నందనున్ |
| 67. | వలన | వలని |
| 71. | మరీచుని | మారీచుని |
| 72. | స్వామిపై | స్వామిపై |
| 72. | ఎఱగవు | ఎఱుగవు |
| 73. | పోదరునిన్ | సోదరునిన్ |
| 77. | ధుమము | ధునుము |
| 80. | అర్థ | అర్థ |
| 80. | ముద్ధము | యుద్ధము |
| 82. | బిపు | బిచ్చవు |
| 85. | నాఁదె | నాఁడె |
| 85. | అగ్నిచో | అగ్నిలో |
| 87. | కట్టిప | కట్టింప |
| 87. | వారిని | వాలిని |

95. కోరికఁబెఱసొమ్ము, గొనఁగవలెనె?

అచ్చులో జారిపోయింది. 8వ పాదంగా చదువుకోవాలి.

సూచన : 45వ పద్యానికి మా అభ్యర్థనను మన్నించి టీకాతాత్పర్య విశేషాలను వ్రాసి పంపినవారు కవితాప్రసాద్‌గారు. కాని పద్యం మొదటి పాదంలో పదచ్ఛేదం ఇలా ఉండాలి.

ఆదియోగి + అంతరంగ +

ఆలానబంధంబు - ఆలానబంధమంటే ఏనుగును కట్టు త్రాడు.

శ్రీ కాసుల పురుషోత్తమ కవికృతమైన **'పరాకు భద్రశైల రామ భక్త కల్పకద్రుమా'** అనే మకుటంగల శతకం ఇంతవరకు దొరకలేదు, మూడు పద్యాలు వినా. ఈ శతకం **పంచచామర వృత్తాలలో** రచింపబడింది.

1. మొరాలకించవయ్య నీకు మ్రొక్కెదన్ రఘూద్వహో
   బిరాన నా మదిన్ వసించి ప్రేమనుంచి నూట్వదార్
   వరాలు సొలువిచ్చినట్లు వచ్చు కీర్తి నీకహో
   పరాకు భద్రశైలరామ భక్తకల్పకద్రుమా !

2. ధరామరేంద్రమౌనిపూజితా ధరాసుతాయుతా
   ధరాధరేంద్ర ధీరహీరతారహారచారుకం
   ధరా, ధరాధిపాధిపాత్రధౌ ప్రభాంతకంధరా
   పరాకు భద్రశైలరామ భక్తకల్పకద్రుమా !

3. గురున్ కుచేలు చింకిగుడ్డ కొంగుముక్కగింజలా
   దరంబుతోడ మెక్కివాని ధన్యుఁజేయనెంచి బల్
   సిరిన్ ఘటించి యేలినట్టి చిత్స్వరూప రాఘవా
   ప[illegible]శైలరామ భక్తకల్పకద్రుమా !



[illegible]స్సమస్తా సుఖినోభవంతు

"మా[illegible]లుగు[illegible]ల్లికి [illegible]ల్లెపూదండ" అనే గీతాన్ని రచించిన శ్రీ శంకరంబాడి సుందరాచారిగారు (జననం : 10-8-1914). జన్మతః తమిళుడు. వృత్తిరీత్యా ఆంగ్లోపాధ్యాయుడు. సుప్రసిద్ధ గాయనీమణి టంగుటూరి సూర్యకుమారి గారు గ్రామఫోను వారికి ఈ పాట పాడి మంచి ప్రచారం తెచ్చారు. 1947లో వ్రాయబడిన ఈ గీతం 1976లో తొలి తెలుగు ప్రపంచ మహాసభలలో (హైదరాబాదు) తెలుగువారి జాతీయగీతంగా నిర్ణయింపబడింది.

ARUNA GRAPHICS, NELLORE